# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010005242

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గులోబకావలి

అను

# పుష్పలీలావతి కథలు

---

గ్రంథకర్త

మద్దూరి శ్రీరామమూర్తిగారు



ప్రకాశకులు

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీసత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1948

 [వెల రు 1-0-0

---

శ్రీ

# గులోబకావలి



## జయప్రదుడు కుమారులకు హితోపదేశ మొనరించుట

శ్రీమదఖండ మహీమండలంబున కలంకారంబై కర్పూరద్వీపంబుసాటి ద్వీపంబులవన్నెయు వాసియుగాంచి తేజరిల్లుచుండెను. ఆద్వీపంబున సూర్యకాంతిపురంబను నొక్క పురీవరంబు సకల సంపదల కాకరంబై భూతలస్వర్గమన నొప్పియుండెను గగనచుంబితప్రాకారములతోడను, రత్నాకరసాదృశ్యగంభీరములగు నగడ్తలతోడను నాకాశంబంటగలుగు ప్రాసాదములతోడను యొప్పు నాపురీవరంబు దర్శనీయంబై యుండెను. అప్పట్టణంబును జయప్రదుడను రాజన్యశేఖరుండు న్యాయసమ్మతంబుగ పరిపాలనం బొనరించుచు ప్రజాదరణంబు వడసి పౌరులఁగన్న కుమారులకై వడి నాదరించుచు నిట్టి నిత్య సత్యవ్రతుం డుయిట్టి కరుణాంతరంగుండును యిట్టి దయాంతరంగుండును బుడమి నుండజాలఁడని యెల్లరచే నుతిగాంచి వన్నెకెక్కి యుండెను.

ఆపురీవరంబున గల్గు జనంబులు కులోచితవ్యాపారంబుల నిర్వర్తించుచుండిరి. ప్రజాదరణంబున రాజును రాజానుగ్రహంబువడసిన ప్రజలును పరస్పరశోభ నెసంగుటకు సందియముండునా? వేయేల! నాపట్టణంబున కూటికి పేదలును గుణంబుల కొరవడినవారును ప్రవర్తనంబున లోపంబుగలవారలును మందునకైగాన్పింపరని వక్కాణించిన జాలు.

ఒక్కదినంబున భూపాలతిలకుండగు జయప్రదుం డుపవనంబున నొక్క చంద్రకాంతశిలావేదికపై గూర్చుండి సంప్రాప్తయౌవ్వనులై

నాకనుజ్ఞ యొసంగిన నేను మునుల పురంబున కరుదెంచువంతవఱకు ప్రధానామాత్యోత్తముఁడు రాజ్యపరిపాలనము దలంచి తగువిధంబున ప్రవర్తింప వలసినదని మిమ్ము ప్రార్థించుచున్నాను" అని వారల కెఱింగించి ప్రధానామాత్యుని దనస్థానమున నిల్పి పట్టణంబున నొక గొప్ప యన్న సత్రమును గట్టించి భార్యాసమేతుఁడై వనంబుల కేగెను. అమాత్యుండును స్వజన శేఖరుఁడగుటచేతను ప్రభుభక్తిపరాయణుండగుట చేతను నయ్యన్నసత్రమును నిరంతరము నడిపించుచు పరమేశ్వరు ననుగ్రహంబువలన భూపాలుఁడు శీఘ్రముగ వచ్చునని నిరీక్షించుచుండెను.

భూపాలుండును తపోవనికరిగి యచటి మునులచే పరమేశ్వరుని మెప్పించి యాతనివలన దనకొక పుత్రుండు కలుగునట్లుగా వరంబు బడసి మగిడి పట్టణంబున కరుదెంచెను. అనుపది కొంతకాలమునకు పట్టమహిషి గర్భముధరించెను. అవ్వార్త నెఱింగి సుందరాంగుఁడమందానంద కందళితాంతరంగుఁడై యథాకాలంబున బుంసవనమొనరించి పుత్త్రోదయమున కెదురుచూచుచుండెను. నవమాసమ్ములు నిండిన పిమ్మట పట్టమహిషి యొక్క శుభలగ్నంబున నొక్క కుమారుని గనియెను. భూపాలుఁడవ్వార్త దెలియుటతోడనే పెన్నిధి నిగన్న పేదవోలె సంతసించుచు వేదవిదులగు పెక్కురు విప్రుల రావించి వారల కపరిమితంబులగు ద్రవ్యంబుల నొసంగి సత్కరించి తనపట్టణంబునం బ్రెల్లెడల సఫలంబులగు నుత్సవంబు లొనరింప నాజ్ఞాపించెను. ప్రజలందఱును తమతమ గృహంబుల శుభముజరిగిన కంటె నెక్కుడుగా సంతసించి యుత్సవాదికముల గావించిరి.

సుందరాంగుఁడక్కుమారుని కంగధరుఁడని నామకరణమొనర్చి న్నల్లారుముద్దుగ పెంచుచుండెను. దినదిన ప్రవర్ధమానుండై యంగధరుండు యుక్తవయస్కుఁడై సకలవిద్యల శాస్త్రులయొద్ద నేర్చి చదువుల

సరస్వతియని మెప్పుగాంచెను. అట్టియెడ సుందరాంగుఁడాతనికి పట్టముగట్టి విశ్రాంతి దీసికొన సంకల్పించెను. తనయభిప్రాయమును కుమారున కెఱిగింప నాతఁడు తండ్రికిట్లనియెను. జనకా! యించుకయు లోకవృత్తి మెఱుంగని నన్ను పట్టాభిషిక్తునిగావించి నాపై యింతటి భారము నిల్పిన నెట్లు వహింపనేర్తును. ఇంకను గొన్నిదినంబులు నన్ను హాయిగ నిట్లు దిరుగనిమ్ము. అని పల్కిన విని కుమారా! నేటికిగాకున్న వచ్చువత్సరమైన నీవు పరిపాలనము వహింపక తప్పదనియెను. అంగధరుఁ డందుల కంగీకరించి యీవత్సరములోనను దేశసంచార మొనర్చుట కనుజ్ఞ బడసెను.

అంగధరుండు మంత్రికుమారుండగు బలభద్రునితో గలసి దేశసంచార మొనరింప పయనమయ్యెను. సుందరాంగుఁడు కుమారుఁడు బయలుదేరుటకు సిద్ధముగానున్నపు డిట్లనియెను. "కుమారా! స్త్రీలకు గలుగు తంత్రజ్ఞానమును, చీమలకుండు జాగరూకతయు, నీగలకు గలుగు పరిశుభ్రతయు నలవరించుకొనుము. అట్లయ్యెనేని నీ కెట్టి యాపదయు గలుగకుండును. పరులతో సంభాషించునెడ వారల భావంబు గుర్తించి మాటలాడుటయె సర్వశ్రేయములకు మూలము. ఎల్లరతో కలసిమెలసియుండుము కాని విరోధమూనకుము" అని యిట్లే తగునీతులబోధించి చాలదూరమువరకును సాగనంపి వెనుకకు మరలి వచ్చెను.

అంగధర బలభద్రు లిరువురును కొంతదూరముచని యొకవట వృక్షముక్రింద నాటికి విశ్రమించిరి. అటనంగధరుఁడు మంత్రికుమారు నీక్షించి "ఓయీ! ఇరువురమును కలసి ప్రయాణముచేసిన నిరువుర మొక్కచోటే వింతలగుప్రదేశముల జూడగలుగుదుము కాని ఎక్కుడగు వింతల గనజాలము. కావున నిరువురమును చెరియొకమార్గమున నేగి అందందుగల వింతలారసి వత్సరముముగియకుండగనే మరలపట్టణము

జేరుదము. అపు డొకరికొకరము జూచిన వింతలఁ జెప్పుకొందము. అందు వలనమితికాలములో మనమొక్కఁడగు వింతలను దెలియుట కెక్కు డవకాశముండును. నీవియుత్తరముగాబోయి వింతలరసి సంవత్సరము ముగియుటకు మున్నె మనకిప్పుడు కన్పట్టుట గానవచ్చుచున్న కనులా పురంబున కరుదెంచి నారాకనిరీక్షించుచుండుము. నేనొక వేళనీకంటె మున్నుగా జనుదెంచిన నేనుగూడ నీపురంబున నీకొఱకై నిలచియుం డును. తిరిగి మన మొండొరులము కలసికొనునంతవఱకు మనము జూచిన రహస్యముల నెవ్వరికిని వచింపఁగూడదనియు ననిపల్కెను. ఆపల్కులకు ఁబనులాసనోడి బలప్రదు డందులకు సమ్మతించెను. అటుపిమ్మట నామిత్రులిరువురును కొంతసేపచ్చటనే గడపి భాను ప్రతాప మించుక శాంతించినతోడనే బయలుదేరి యిరువురును చెరి యొక మార్గమును బట్టుకొనిపోయిరి.

రాకుమారుఁ డట్లు కొంతదూరము ప్రయాణమును సాగించి సూర్యాస్తమయమున నొకగ్రామమును చేరుకొని నాటి కందువిశ్ర మించెను. మరునాడు తరువాతనే మేల్కాంచి, తిరుగ ప్రయాణమును సాగించెను. మధ్యందిన మార్తాండుని ప్రతాపమునకోడి నయ్యరణ్యం బున నున్న యొక సెలయేటిగట్టునగల లతానికుంజమున విశ్రమించు దలంపున గుఱ్ఱమునుడిగ్గి సమీపమునగల మహీరుహశాఖల కాహ యంబును గట్టి తనతో దెచ్చుకొనిన యాహారపదార్థముల నాపొద రింటబెట్టి యేటికిబోయెను. ఆతడు కరచరణంబుల గడిగికొని యాచ మనించి పొదరింట కరుదెంచి చూచునంత నాహారపదార్థములపై నెన్నియో యీగలు వ్రాలి యుండెను. వానినన్నిటిని పారద్రోలి చూచునంత కన్నమిసుమంతయు మురికిలేకుండ గాన్పించెను. తోడనే యాతని తండ్రిపల్కులు జ్ఞప్తికి వచ్చెను. ఈగల పరిశుభ్రత నలవ రించుకొనుమని తండ్రి యేల చెప్పియుండెనో యాతఁడు తెలిసికొని తండ్రియొక్క దూరదృష్టి కెంతయో యానందించెను.

ఆ కంటాని సాహసమును వినియత్తరి తనసే యా వెలయాలు తన భాగ్యము పండెనని నిశ్చయించుకొని యొకప్పుడు బాలికస్త్రీలనుకొలది సంతుష్టిమానసముతో గౌరవించెను. నాటి యాతని సోక్కాని వచ్చునంతకు సొగసుగా నలంకరించుకొని శయనగృహమున జేరి నిరీక్షించుచుండెను. దప్పుల రాకుమారుడు గాన్పింపగనే యాతని కెదురేగి సముచితగౌరవంబుల నెరపి పలుకరించి కొనివచ్చి యున్నాస నాసీనునిగావించి వివిధోపచారముల నాతని సంతుష్టునిగావించెను. ఆతడును యామె యొనర్చు సపర్యల కెంతయో మెచ్చుకొని యుభయసంభాషణసందర్భ ప్రసంగవశమున తొల్లి తాను బలభద్రునితో జేసిన సమయంబును మరచి లతాంగీ! నేను పట్టణమున కరుదెంచుచు మార్గమధ్యంబున నొక్క సెలయేటిలోని చేపయొక్క యొకమాతంగంబును సునాయాసముగా మ్రింగివేయుట చూచితినని పల్కెను. అంత నావేశ్య యయ్యా! మత్స్యమేనుగును మ్రింగినదా! ఎంత వింతయైనమాట! ఇట్టివింత లోకమున నెచ్చటనైన నుండునా? కల్లలాడుచుండిరి.'' అని పల్కెను. అంత రాకుమారుడు కన్నార చూచితిని. కల్లగాదు. నిక్కువమే పలుకుచుంటినని ముమ్మారు గట్టించి పలికెను. వేశ్యయు నాతని నెట్లైన వంచించి ధనము లాగుకొననెంచినదగుటచే నయ్యా! యిట్టివింత యెందైన నున్నదని యీ పురంబేలు నీతిచంద్రుడు సమ్మతించిన నీకు నే నాజన్మము దాసినై పడియుండెదను. అట్లు కాదేని నీవు నాకేమి పసదనమిత్తువని పన్నిదముపైచి ప్రశ్నించెను. రాకుమారుడును కనులార చూచియుండుటచే తనకే జయము నిక్కమనియును యా వేశ్యను వంచించుట కయ్యదియే తగిన మార్గమనియును భావించి ఓసీ! నామాటలు పొల్లైన యెడల నేను నీకు దాసుడనై పడియుందును. కాన సత్వర మా నీతిచంద్రునొద్దకు బోవుదమనియెను.

ఇంద్రవర్మయు తమతమ వాదముల నాశ్రయించుచు తర్కించి యందఱల సత్యమును నిరూపింపఁజాలరి. భూపాలుండును పెద్ద ప్రశ్న వారిలోఁ బంచి సంతృప్తులవలన నట్టివింత యనుభవమునొందిన యత్తెంగి యప్పు తీర్పొసఁగెను. అక్కడ తన సంగతి యంతయు జగజంతయగు వేశ్యకు దాసు డయ్యెను.

బలభద్రుఁడును యనేక దేశములం దిరిగి పెక్కులగు వింతలను గాంచి కమలాపురంబును జేరి యందొక్కచో నివసించుచును రాకుమారుఁడు మాయలమారి మల్లి యనందగు వేశ్యవలలోఁ దగుల్కొని యుండుటయు నాతఁడట్లు మోసగింపబడుటయు గూడ నెఱింగి యట్టిన నా కులటను వంచించుటకు సంకల్పించుకొని యాగ్రామమున కించుక దూరమున నున్న యరణ్యములో నివాస మేర్పరచుకొని కొన్ని కోతులను బట్టితెచ్చి వానికి ముస్తాబు దొడగి కుక్కలపై నెక్కి యుద్ధము చేయునట్లు నేర్పించెను. కుక్కలును తమ కాహారము పుష్కలముగా లభించుచుండుటచేత కోతులజోలికి పోక వానిని దమ వీపున మోయుచుండెను. ఇట్లు తయారుచేసి యొక నమ్మికమైన సేవకునకా కుక్కలను కోతులను స్వాధీనమొనర్చి వేశ్య నెట్లైన వంచింప దలంచి యా గృహంబునకేగి తొల్లిటివలె గంటను మ్రోగించెను.

వేశ్యయు తన యదృష్టము పండెనని తలంచుచు చెలికత్తెలచే నాతని లోనికిరప్పించి యథోచితగౌరవంబుల నెరపెను. మంత్రి కుమారుఁడామె సేతలకు సంతసించినట్లు నటించుచు మైమరచినట్లుగా పల్కుచు తాను కోతులు కుక్కలపై నెక్కి యుద్ధముచేయుట గాంచి యుంటినని దెల్పెను. అంత నా రూపాజీవియు నాతని వంచించి తన నాతని సేవకునిగా నొనరించుకొనుట కనువైన సమయము వచ్చినదని సంతసించుచు యాపల్కులను రెట్టి యట్టివింత గలుగబోదని వాదిం

చెను. కడ కిరువురును యెుకరి రోజినవారు గెల్చినవారికి దాసులగు నట్లుగా పన్నిదము వైచుకొని తమతమ పరిష్కరింపఁజేసికొనుటకు నీతిచంద్రునొద్దకు బోయిరి.

నీతిచంద్రుఁడు మంత్రికుమారుని మాటలాలించి కుమారా! కోఁతులకును కుక్కలకును పరస్పరవైరముగదా! యట్టిచో మర్కటములను దమపీపుల మోయుటను కుక్క లెన్నటికిని యంగీకరింపవు" నీపల్కు లసత్యములుగా నున్నవియెను. అంత మంత్రికుమారుఁడు దేవా! తామన్నట్లు సెలవిచ్చినారు. మచ్చికచేసి సయ్యాటి పరస్పర విరోధమును మఱవఁగలవు. నాపల్కులు యదార్థ మెఱుంగఁగోరెదరేని ఈగ్రామమున కించుకదూరముననున్న యరణ్యమున నొక్క యాటకాఁడు గలఁడు. ఆతఁడియ్యది ప్రత్యక్షముగా తమకు జూపఁగల డనియెను. భూపాలుఁ డానింతజూచుటకు స్థిరసంకల్పుఁడై నాఁటి కెట్టి నిర్ణయమును చెప్పక సభఁజాలించెను. మంత్రికుమారుఁడు తొల్లి చెప్పియున్నట్లాతనిమిత్రుఁడు కోఁతులను కుక్కలను దీసికొని పురంబు ప్రవేశించి పలుతావుల వాని నాడించెను. ఇయ్యది క్రమముగా రాజునకు గూడ తెలియవచ్చుటచే నరపాలుఁ డాటగానిని రావించి స్వయముగా వాని యాటగాంచి మంత్రికుమారుఁడు చెప్పినదే సత్యమని నిర్ధారణ గావించుకొని వేశ్యనుకూడ రప్పించి మంత్రికుమారుని పల్కులు యదార్థములని యామెచే నొప్పించి యామె యాతనికి దాసియగు నట్లు దీర్పొసంగెను. మంత్రికుమారుఁడు తనవివేకముచే దన్ను రక్షించుకొనుటయే గాక రాకుమారునికూడ దాస్యమునుండి తప్పించెను. కాన వివేకము నాటిలేనిదనవచ్చును.

జయప్రదుఁడు కుమారులకీకథ జెప్పి నాయనలారా! మీరిప్పటికి వివేకమెంత యావశ్యకరమైనదో యెఱింగితిరా! యని వారలకు హితబోధ గావించి కాలోచితంబుల దీర్చుకొన నంతఃపురంబున కరిగెను.

---

## పరాక్రమ కేతుని జననము

సౌభాగ్యశాలియైన జయప్రదమహారాజు సకలభోగంబు లనుభవించుచుండ నాతని ధర్మపత్నితిలకము గర్భము ధరించి యొక శుభదినంబున నొక శుభలగ్నంబున నొక చక్కని కుమారుని గనియెను. దాదులా వర్తమానమును జయప్రదున కెఱింగించి వెండియు నిట్లనిరి. "ఓరాజా! ఈబాలకుండు పురిటింట బాలభానునిపగిది ప్రకాశించుచు నత్యద్భుత తేజంబును గల్గియున్నాడు. అనన్య సామాన్యతేజంబును, తేజంబున కనుగుణ్యమైన సౌందర్యమును గల్గి విరాజిల్లు నీ బాలకుడు దేవాంశసంభూతుడగు నేమోయను సందియ ముదయించుచున్నది. ఆ పలుకులాలించి సంతుష్టాంతరంగుండై మహదానందవార్ధి మునింగి వేదవిదులగు పండితులను జ్యోతిష్కులను పిలిపించి నానానేకములైన దానములొసరించి బహూకరించి వైష్ణవులతో విద్యావిధులారా! యీ బాలకుని భవిష్యమెట్లుండునో తేటతెల్లముగా మీవలన వినగోరి యుంటినని పల్కెను.

పైవారలు గణితమొనర్చి లగ్ననిర్ణయము గావించి గ్రహస్ఫుటమొనరించి భావస్ఫుటగణన మొనర్చి భావంబుల తర్కించి భూపాలున కిట్లనిరి. దేవా! ఈకుమారుడు మానవాధీశ్వరుడగుట యటుంచుడు. లోకమునకంతకును చక్రవర్తి కాగలడు. భూతగణంబు లీతనికి వశ్యులై వర్తించుచుండును. బహుపరాక్రమయుతుండగుటచే పరాక్రమకేతుండను నామమున కెంతయుదగును. అరువదినాలుగు విద్యలందును పరిపూర్ణపాండిత్యముగల్గును. వేయేల నీతనితో సరిపోల్పదగిన వాడెవ్వడును యీభూమిపై నీవఱకు జనించియుండలేదని నిస్సందేహముగా జెప్పవచ్చును. అయిన నీతడు జన్మించిన ముహూర్తవిశేషమున తమరాబాలుని చూచినయెడల తమకు దృష్టిమాంద్యము గలుగ గలదు. అని శుభాశుభముల నిర్ణయించి పల్కిరి. జయప్రదుండు కుమారుని

భవితవ్యముగూర్చి జ్యోతిష్కులాడువాక్యములకు సంతసించెను. కాని యట్టి సౌందర్యవంతుడైన బాలుని చూచుట ప్రాప్తిలేనందుకు వగ జెందెను. పైపన్నెండేండ్లు యుండువిధమన్న బాలకునకు పరాక్రమకేతువని నామకరణముంచి మంత్రిని బిలిపించి యాతని కిట్లనియెను ఓయీ! పైపన్ను లేమంటివో వింటివిగదా? నే నా బాలకుని చూడరాదట. అట్టియెడ నా బాలకుడింటనున్న యెడల ప్రమాదవశముననైన నాతనిజూచుట తటస్థింపవచ్చును. కావున మనగ్రామమునకు సమీపముననున్న యరణ్యమున నొక కోటకట్టించి యందుబాలునితో స్త్రీసహితుని వసించుటకు తగిన యేర్పాటుల్ గావింపుము. వారికెట్టికొరంతయు గలుగకుండ నిత్యమును గనుగొనుచుండుమని నియోగించెను. మంత్రియు ప్రభుని పల్కులకెదురాడజాలక యందుల కంగీకరించి సమీపారణ్యమున కోటగట్టించి యందు సమస్తవస్తువ్రాతంబుల జేర్చి పట్టమహిషి నచ్చటవిడియించెను. ఆదేవేరియు బాలకుడగు పరాక్రమకేతునితో నయ్యరణ్యమధ్యమున నాకోటలో నివసించుచు శుభకాలాగమనమునకు నిరీక్షించుచుండెను. పరాక్రమకేతుడు దినదినప్రవర్ధమానుడై శుక్లపక్షశశాంకరుచందంబున వర్ధిల్లుచు పదునారువత్సరముల బాలకుడయ్యెను.

## జయప్రదుడు పరాక్రమకేతునిజూచి యంపుడగుట

పరాక్రమకేతుడు తగినగురువులకడ వివిధవిద్యలనేర్చి మంచి పాండిత్యమలవరుచుకొని యాయుధవిద్యయందు సాటిలేనివాడని ప్రఖ్యాతిగాంచెను. ఒక్కనాడు మృగయావినోదంబునకై బాణతూణీరముల ధరించి యనన్యసహాయుండై దుర్గమంబైన కాంతారంబు ప్రవేశించెను.

ఆత డా యరణ్యంబున బ్రవేశించి ధనుష్టంకారము గావింప మృగములు తల్లడిల్లి నలుదెసలు పరువిడజొచ్చినవి. పులులు పొద

లేనియెడల నింత యాకస్మికముగా దృ[illegible] [illegible] కేవలము [illegible] గాన్పింపదు. నాకిష్టదైవ్వలాడిన పుష్ప[illegible] [illegible] ఇంక విచారించిన ప్రయోజనమేమి? నన్ను పురంబునకు గొనిపొమ్ము ఈకుమారకుని నారాజ్యమునందుండక వెడలిపోవ నజ్ఞాపించుము. దేవిని అంతఃపురమునకు దోడ్కొనిరమ్ము అని నియోగించెను. ఇంతట పరాక్రమకేతుడుగూడ మేల్కాంచి జరిగినదంతయును గ్రహించి తండ్రికి నమస్కరించి యాతని యాజ్ఞల పరిపాలించుటకై యారాజ్యమును విడిచి చనియెను.

## జయప్రదుని కుమారులు గులాబీపూవును దెచ్చుటకు పయనమగుట.

జయప్రదు డాస్థానమున గూర్చుండి యొక్కనాడు వైద్యశిఖామణుల రావించి వారికిట్లనియెను. అయ్యలారా! 'సర్వేంద్రియాణాం నయనం ప్రధాన'మ్మను నార్యోక్తి తమరెఱుంగుదురుగదా? కన్నులు లేకున్న వారికి లోకం అంధకారబంధురము కాదె కావున మీరెల్లరును బాగుగా నాలోచించి నాకు దిరుగ దృష్టిగల్గుట కేదైనమందు గల్గిన యెడల దెల్పుడు. అంధుడనై జీవించుట దుర్ఘటముగా నున్నది అనిన వారలును శాస్త్రములను దిరుగవైచి పెక్కురొక్కటిగా గూడి దీర్ఘముగా నాలోచించి యెట్టకేలకు రాజున కిట్లనిరి. ''ఓ భూమీశా! తమకు మరల దృష్టినొసంగగల మందొక్కటి మాత్రమే గలదు. అయ్యది గులోబకావలి యను నాపుష్పముతో తను నేత్రములను తాకినయెడల తమకు మరల దృష్టిగల్గును. కాని ఇతరవిధమున నయ్యది సాధ్యముగాదు. అట్టి ప్రసూనరాజమును కొనివచ్చుటకు దగినవానిని బంపుడు'' అనిన విని భూపాలు డధికంబుగ సంతసించి మఱునాడు మంత్రిసామంతామాత్యు లందఱును సభకు రావలసినదిగా నాజ్ఞాపించి నాటికి కొలువు చాలించెను.

మరునాఁడు సభాప్రాంగణమంతయు సామంతరాజులతోడను రాజబంధువులతోడను, అమాత్యవర్గమువారితోడను, సరదారులతోడను క్రిక్కిరిసియుండెను. ఎల్లవారును ప్రభువిట్టి యసాధారణసభ గావించుటకేమి హేతువై యుండునాయని యొండొరులు ప్రశ్నించుకొనుచు తగిన సమాధాన ముండక ఎవరికి దోచినట్లు వారు పలుకుచుండిరి. కొందఱు జాతదంతుఁడగు కతంబున రాజ్యపరిపాలనాభారమును కుమారులపై నుంచుటకు సంకల్పించియుండెనని భావించియుండిరి. ఇంతలో భూపాలుఁడు సభకు విచ్చేసెను. సభయందలి కలకలము శాంతించెను. భూపాలు డెల్లరను గూరుచుండ నియోగించి గంభీరస్వరంబున నిట్లనియెను. సభ్యులారా! మిమ్ములను నేడిచ్చట సమావేశపరచుటలో నాయభిమతమేమో మీలో కొంతమందికి మాత్రమే తెలిసియుండును. నేను తమవలన నొకఘనకార్యమును సాధింపఁదలచి మిమ్ములను యిచ్చట సమావేశపరచితిని. నాయొడవ కుమారుఁడగు పరాక్రమకేతుని చూచుటవలన నాదృష్టి దప్పియున్న సంగతి మీకెల్లరకును విశదము. నేత్రములు లేకుండ జీవించు టెంత సంతాపకరమో వేరుగ వచింప నగత్యము లేదుకదా? కన్నివారణకై పెక్కులగు ధనరాసులను వెచ్చింప సంకల్పించుకొని యుంటిని. మీరెల్లరును సావధానమనస్కులై యాలింపుడు. నాకు మరల దృష్టి నొసంగగల గులోబకావలి యను ప్రసూనరాజమును గొనితెచ్చి యిచ్చినవానికి పెక్కుడుగా ధన మిచ్చుటయె గాక సారవంతములైన గ్రామములును గూడ పారితోషికముగా నొసంగెదను. అట్టి కార్యమును సాధింపనిచ్చగించువారు నాభాండారమునుండి దారిబత్తెములకు గావలసిన ద్రవ్యమును, బలగమును గూడ గొనిపోవుట కెట్టి యాటంకమును లేదు. కావున మీరెల్ల రాలోచించుకొని ధైర్యబలపరాక్రమాదులు గల్గి యక్కార్యసాధనమునకు బూనుకొను వారెవ్వరో లేచి సిద్ధపడుడనియెను.

ఆపలుకులాలించి యందున్న సభాసదులెల్లరును కట్టా! ఆబకావలిపుష్ప మెందుండునో తెలియదే యవెట్లు సాధింపగలము అనికొందఱును ఇదేమి అసాధ్యవస్తువును దెమ్మని నియోగించుటకీ భూపాలునకు మతిలేకుండ బోయినదాయని గుసుకకొందఱును, కన్నులతో బోయిన్న మతియు బోయినదని కొందఱును అట్లుండ అనేక విధములుగా దమమనస్సున దలంచుచు భూపాలునకు బ్రత్యుత్తర మొసంగనైరి. అంత భూపాలుండు చింతాక్రాంతుడై కట్టా! ఇట్టి సభలో నాయీవాంఛితమును దీర్పగలిగిన పూరుషుడొక్కడును లేడయ్యెనా? ఇంతమంది సామంతులుండియు నొక్కడును గులోబకావలి ప్రసూనమును గొనివచ్చుటకు సాహసింపడయ్యెనే! ఇక నాకు దృష్టి గలుగుటకెట్టియవకాశము లేదనుమాటయే నిక్కమయ్యెనా? అని పెక్కుగతుల వాపోవుచుండ నాభూపాలుని కుమారులు నల్వురును లేచి జనకా! మీరింక చింతింపనలదు. మేమాప్రసూనమును సాధించుకొనివచ్చి తమ కర్పింపగలము. ఆశీర్వదించి పంపుడు ఎట్టికష్టములకైన తలయొగ్గి కార్యమును సాధించుకొనివత్తుము. పుత్రులవలననే జననీ జనకులకు సౌఖ్యము కలుగకున్నయెడల పెరవారలవలన గలుగునా? కనుక మాకు ముగుదల యొసంగవలయును అని పల్కిరి జయప్రదు డందుల కెంతయు సంతసించి కుమారులను లబ్ధవిజయులగునట్లాశీర్వదించి వలసినంత ద్రవ్యమును సైన్యమును తీసికొనిపోవుటకు సెలవిచ్చెను.

రాకుమారులు నల్వురును తమతో కొంతసైన్యమును విశేషమగు ధనంబును వారలకును సైన్యమునకును గావలసిన యాహార పదార్థములను గొని యొక్క శుభముహూర్తమున గులోబకావలి పసూనమును గొనివచ్చుటకు ప్రయాణమై పురంబు నిర్గమించిరి.

జయప్రదముండును తనసౌఖ్య మాకాంక్షించి కోమటులు నలువురను ప్రయాణమును గొనివచ్చుట కేగియుండుటచే సంతృప్తహృదయుండై వాడు త్వరగా నరుదెంచి తనకు స్వస్థత చేకూర్చునని నమ్మియుండెను.

## పరాక్రమకేతు డన్నలతో గులేబకావళి పూదోటకుపోవ బయలుదేరుట

రాజకుమారులు నలువురును చతురంగబలసమేతులై పురంబు నిర్గమించి పోవుచు క్రమక్రమంబున గొన్ని పల్లెలను గ్రామంబులను బట్టణంబులనుగడచి చనిచని కడకొక గ్రామమునను మార్గాయాస ముపశమింప విశ్రమించిరి. పరాక్రమకేతుండు తండ్రిచే రాజ్యమునందుండ రాదని శాసింపబడి యారాజ్యమును వదలి తన యదృష్ట మెట్టిదో కనుగొనగోరి యీవిపులవిశ్వంబున నెచ్చట తలదాచుకొనతావు లభించునా యని చింతించుచు దేశముల ద్రిమ్మరుడై తన సోదరులు విడిసియున్న పట్టణమునకు జేరుకొని వారి సంరంభమంతయును గాంచి వారెచ్చటికి పోవుచుండిరో తెలిసికొనగోరి యొక్క భటునితో స్నేహము నర్చెను. ఆ సైనికులవలన వారు గులేబకావళి యుపవనమునకై బయలుదేరి పోవుచుండుట యెఱింగి వారితో తానుగూడ పోయి పుష్పమును సాధింప నిశ్చయించుకొని యాసైనికుని సహాయమున రాకుమారులను సందర్శించెను. వారును యాతనిగుర్తింపజాలక "ఓరీ! నీవెవ్వడవు నీవు మావలన నర్థించునదేమి చెప్పు"మని ప్రశ్నించిరి. పరాక్రమకేతుడు వినయవిధేయత లుప్పిరిగొన వారలకు ప్రణామ మాచరించి "అయ్యా! నేనొక బంధువర్జితుడను. ఏకాకినై నిలువనీడలేక దేశముల వెంట దిరుగుచుంటిని. దేవరకడ నేదైన నొక యుద్యోగము లభించునేమో యను దలంపున తమ సందర్శనమునకు జనుదెంచితిని. పిదప

తమ చిత్తమున మిన్నకుండెను. రాజపుత్రులు వాని విధేయత కెంతయో సంతసించి యొక సైనికునిగా నియమించిరి. పరాక్రమవంతుడును యందుల కెంతయో సంతసించి వారితోగలసి ప్రయాణము చేయుచు వారి మనస్సున కెక్కునట్లు ప్రవర్తించుచుండెను.

## రాకుమారులు తిలదవతియను వేశ్యతో జూదమాడి యోడి చెఱనుంపబడుట

రాకుమారులు నలువురు పరివారవర్గంబుతో నిరంతర ప్రయాణంబు సల్పుచు ప్రతిధ్వజమను పట్టణమును ప్రవేశించి యాపురీవరంబున నొకటిరెండు దినంబులు నిలచి ప్రయాణము సాగించుటకు దలంచి యాపట్టణమునకు వెలుపల గుడారముల నిర్మింపజేసి యందు విడిసిరి. నాటి దినాంతమందు రాకుమారులు నలువురు పట్టణసౌందర్యమును దిలకించు కుతూహలముగలవారలై వారువంబుల నెక్కి పట్టణంబుల ప్రవేశించి యావీధిఁగల ప్రాసాదంబుల ప్రాభవంబున కలరి సౌధముల సౌందర్యమునకు మది నుబ్బుచు విహరించుచుండ తమంబులోకంబుల నావరించుటఁజేసి వారు వెనుదిరిగి తక్కినపురంబును మరునాడు చూచుటకు నిశ్చయించుకొని తమ గుడారంబుల కరిగిరి.

మరునాడు రాకుమారు లింకొకవీధి కరిగి యందలి చిత్రముల చూచుచు కాలయాపన మాచరించిరి. ఇట్టులనే దినమున కొక్కొక్క వీధిని జూచుచు విహరించుచు యొక్కనాఁడు పణ్యవీధిని చూడ బోయిరి. ఆవీధిని బోవుచు నందత్యధికసౌందర్యయుతంబైన సౌధరాజ మొక్కటిగాంచి యా రాకుమారులలో నొక్కరుఁడా సౌధమును జూపుచు సోదరులారా! ఈసౌధమును చలువరాళ్ళతో నిర్మించిరి. ఎడనెడ వివిధరత్నము లమరింపబడియుండెను. ఈ రత్ననిర్మిత

సౌధము సామాన్యసౌధములలో లెక్కింపదగినదిగాదు. మరియును మన మీావటకే పురంబున గాంచిన సౌధముల నొక్కటియు దీనికి దుల్యములుగావు. ఈసౌధ మెవ్వరిదో యెఱుంగ నెవ్వయని పలుక నందఱును యీాతని యభిప్రాయముతో నేకీభవించిరి. అంత వారా సమీాపంబుననుండి బోవు నొక్కరుని బిలచి యీాసౌధ మెవ్వరిదని ప్రశ్నించిరి. ఆ కాపువాఁడు వారలకు బ్రణామం బాచరించి అయ్యా! ఈసౌధము తిలదవతియును వేశ్యారత్నముయొక్క యంతఃపురంబు. ఈ పీటంగల బోటులలో నింత సొగసుగోటులు గల్గు బోటి యుండదని పెక్కురు వచించుచుండగా విందును. ఈమె యొకరాత్రికి లక్షవరాలు గైకొనుచుండునట. ఎందరెందరో రాకుమారులు పెక్కుదేశముల నుండి యిచ్చటి కరుదెంచి యీామెకు గానుకలు ముడుపులు చెల్లించు చుందురు. పైగా నీమె జూదమున సాటిలేని పాండిత్యము సంపాదించి యున్నది. ఆటకొక్క లక్షరూప్యముల పణముగా నిడి యెంతటి వారితోనైన జూదమాడి యోటమి యెఱుంగక గెలుపుగొనుచుండు నట. వేయేల జనులెల్లరును యీామె సోయగమును జూడజాలని కన్నులుగావని వచించుచుందురు. అని యేమేమో పల్కెను.

ఆపల్కు లన్నియును రాకుమారులచిత్తంబుల హత్తుకొని తత్కాంతాసందర్శనంబునకు తత్తర మొందజేసినవి. రాకుమారులును నాటికి బ్రొద్దుపోవుటచే మరునాడమ్ముద్దియఁ గనుంగొన సంకల్పించు కొని విడిదిల కరిగిరి. నాటిరాత్రి రాకుమారులలో నొక్కరుఁడును కంటికి కూర్కులేక పరితపించుచు నెడనెడగల్గిన నిద్దుర మైకము నా తలిరాకుబోణి కల్పితరూపమును స్వప్నమునగాంచి యానందించుచు నంతలో మెలకువగల్గుటచే విషాదము జెందుచు నెప్పుడు తెల్లవారి సాయంకాల మగునా యెప్పు డాలలితాంగిని కన్నుల కరవుదీరునట్లు చూడగల్గుదుమా యని తీరని చింతతో నారాత్రి

నలదేలించుచు ముక్తాచూర్ణసమేతంబును కర్పూరమిళితంబును అగు తాంబూల మొసంగి సుగంధద్రవ్యంబుల మేనబూసి వారిని సంతతానందవార్ధి నోలలాడించుచు సద్దియు ప్రొద్దుగడపె తదనంతరంబున రాకుమారుల కిట్లనియెను. నక్షత్ర సన్నిభులగు తమ చెంతనుండుటచే నిద్దురవచ్చుటలేదు. ప్రొద్దుపోకకు కొంతతడవు నెత్తంబుల ప్రొద్దు పుచ్చెదమా యని ప్రశ్నించెను. రాకుమారులును యక్షవిద్యయం దారితేరిన వారగుటచేతంబున నామెను సులభంబుగ నోడింపగలమను ధైర్యంబున నందులకు సమ్మతించి యాట కొక లక్షరూప్యముల పణంబుగా నిడి జూదమాడుటకు ప్రారంభించిరి.

ప్రప్రథమమున రాకుమారులు గెలుపొందిరి. కాని యా చతుర చతురత్వంబు మెరయ నాడుటచే నొక్కొక్కయాట తప్పక నామెయే గెల్చి వారల చెంతనున్న ధనమంతయును గెలుచుకొనియెను. ఇంతలో వేకువ యగుట యెఱింగి రాకుమారు లాటచాలించి మించుబోణి! వేకువ యైనది ఇంక యాటసాగించుట యుక్తముగాదు. నేటికి సెలవిమ్ము. మరల నీతో నాడుటకు జనుదెంతుము అని పల్కి యామెచే ననుజ్ఞగొని గృహాభిముఖులైరి.

మరునాడు నలువురు రాకుమారులును తమ బొక్కసమందు ధనములేకుండుటచే రథగజతురగ పదాతులన్నిటిని విక్రయించి రొక్కమును గూర్చుకొని సాయంకాలమువర కెట్లో వేగించి దినాంతమందా వేశ్యనుగూడి జూదమాడి తమ ధనమంతయును గెలుచుకొనగోరి యామె సౌధముకు బోయిరి. ఆమెయు వారిని లోనికి గొనిరా ననుజ్ఞ యిచ్చెను. దూతికలు వారిని లోనికి గొనివచ్చుటతోడనే వారికుచిత సత్కారములాచరించి వారలనుసంతుష్టి నొందించి ఎప్పటియట్లు జూదమాడుటకు నెత్తములుసిద్ధపరచెను. రాకుమారులునుఆడినకొలది యోడుచు యోడినకొలది రోష మెక్కుడుగా రెట్టింపు ధనమును

మరల నోడ్డుచుండిరి. కొలదికాలములో వారిధనమంతయు వేశ్యకు స్వాధీనమయ్యెను. ఇంకను పణమొడ్డుటకు ధనంబులేక మిన్నకుండిరి. అంత నామె అయ్యా, మీవద్దధనంబులేదుగనుక నాటికి చాలింతమా యని ప్రశ్నించెను. రాకుమారులు నెలవెలబోయి చేయునది లేక యొకించుకాలోచించి యామె కిట్లనిరి. ఓమోహినీ! నీవు మమ్ములను జయించితివి. నీతో నింకొకయాట యాడవలయునని యున్నది. ఆయాటను మేము గెలిచినయెడల నీవు మాకడ గెలుపొందిన ద్రవ్యమంతయును యిచ్చివేయవలయును. లేదా నీవే మమ్ము గెలిచిన యెడ మేమే నీకు సర్వదా దాసులమై చరించుచుందుము. అని పలికిరి. ఆపల్కుల కావెలయాలు సమ్మతించి మరల యాడెను. కాని రాకుమారుల తిథి ప్రతికూలముగా నుండుటచే నయ్యాటయందునను వారే యోడిరి. తోడనే యామె చెలికత్తెలరుదెంచి యానలువురు రాకుమారులను బంధించి చెరసాలకు గొనిపోయిరి. తిలదవతియు తన యదృష్టమునకు మనంబున నెంతయో సంతసించి యానంద రసాబ్ధిని మునుంగుచు యానిశాశేషమును గడపెను.

## పరాక్రమకేతుడు తిలదవతిని జయించుట

పరాక్రమకేతుడు తనసోదరులు నలువురును తిలదవతిచే జయింపబడి చెరసాలలో నుంపబడిన వర్తమాన మాలించి వారి నెట్లైనను చెరవిడిపింపవలయునను సంకల్పమున జూదమున పరిశ్రమ మొనర్చి యందుగూడ పాండిత్యమును సంపాదింపగోరెను. మరియు నామె యట్లు జయము గొనుటకు నెట్టికైతవ మొనగూర్చుచుండెనో కనుగొన దలంచెను. గ్రామమును ప్రవేశించి యొక సంపన్నగృహస్థుని యింటికేగి యాతనికి తానొక బీదవాడననియును యుద్యోగాపేక్షతో జనుదెంచితిననియు నమ్మికబుట్టవచించి యాతనియొద్దనొక

స్వల్పవేతనమునకు పరిచారకునిగా ప్రవేశించి యాతని పన్నసలం దుచు క్రమక్రమముగ వేతనాభివృద్ధి గాంచుచుండెను. ఆశ్రేష్ఠియును ఈపరాక్రమకేతునియెడల నమితప్రియముగలవాఁడై యుండెను.

కొంతకాలము గడచినపిమ్మట పరాక్రమకేతుఁడు వాదమున పాండిత్యము గడింప ప్రయత్నముచు జూపుచుండు కాపురకేగి వార లతో వాదములాడుచు క్రమక్రమముగ నపరిమితమైన పాండిత్య మును సంపాదించి పేరువడసిన దిట్టదులనుగూడ సులభముగా గెలువం చునంతటి పాండిత్యమును సంపాదించెను. ఆవాదులందరును అతని తో నోయీ మమ్ము జయించుటొక గొప్పగాదు. తిలదవతిని జయిం పుము. అప్పుడు నీపాండిత్యము శ్లాఘింపఁబడునని హాస్యముచేయు చుండిరి.

అంతటి పాండిత్యము సంపాదించిన యనంతరము తిలదవతి మోసముచే జయముగాంచుచుండునని యెఱింగి యెట్టిమోసముగావిం చునో యెఱుంగగోరి యాగృహమునందలి పరిచారకులతో నెవ్వరి తోనైన మైత్రియొనర్పగోరి యావీథిని తిరుగుచు నాగృహమునుండి వెలికెవ్వరైన జనుదెంతురాయని పరికించుచుండెను. ఇట్లుండ నొక్క నాఁడొక ముదుసలి యాగృహమునుండి వెలికరుదెంచి యెచ్చటికో పోవుచుండెను. ఆమెను కొంతవఱకు వెన్నాడి తన కెదురైనమిత్రుని కాముదుసలిని జూపి యామె యెవ్వరని ప్రశ్నించెను. అతఁడు పరాక్రమకేతున కిట్లనియెను: ఈజరఠాంగన యాతిలదవతియొక్క పరిచారిక; యీయామె యావేశ్యకు కుడిభుజమువంటిది. ఆమెయొక్క రహస్యములన్నియు నీమెకు దెలియును. అని జెప్పి తనదారిఁబోయెను. పరాక్రమకేతుఁడామెను వెన్నాడి యామె నివాసమును గుర్తించు కొనియెను.

పరాక్రమకేతుఁడు మఱునాఁడించుక పున్నగ యజమానుని కడ సెలవొంది యాముదుసలి గృహంబున కేగుటకై బయలుదేరిన తోడనే యామె వెనుకనే బయలుదేఱి యామె నివాసమును జేరఁబోయెను. తోడనే యామెను సమీపించి యామె పదములపై వ్రాలి అవ్వా అనుచు పెద్దపెట్టున వాపోవ మొదలు పెట్టెను ఆతని విచారముజూచి యాముదుసలిగూడ గొంతవఱకు విచారించి నాయనా! ఏల విచారింతువు. నీవెవ్వరివాఁడవు. ఇక్కడికేట్లు వచ్చితివి నీ వృత్తాంత మాద్యంతము నాకు చెప్పుమనుటయు నాత డతిదీనముగ నామె కిట్లనియెను. అవ్వా! నేనొక దిక్కుమాలినవాఁడను. నాజనయిత్రి నన్ను గని పరలోకమున కేగినది. జనకుఁడును యొకటిరెండు సంవత్సరములైనను గడువకమునుపే ననుఁబాసి పరలోకమున కరిగెను. తల్లిదండ్రులు లేక దిక్కుమాలియున్న నన్ను నాకు పూరస్త్రురాలగు నొక వృద్ధురాలు జేరదీసి పెంచి పెద్దవానిగ జేసినది. కాని అయ్యో! నాదురదృష్టమేమని చెప్పుదును పదిరెండు వర్షముల ప్రాయమున నుండగా నామెగూడ నన్నొంటిగా విడచి పరలోకమున కరిగినది. నేనంతట మరల దిక్కులేనివాఁడనై పరులపంచజేరి యింతవరకెట్లో కాలయాపనము జేసితిని కాని యయ్యది చాల చిన్నగ్రామమగుట చేతను యందు పనులేమియు లేకుండుటచేతను జీవనోపాధి గలుగుట కష్టముగా నుండుటచే నాగ్రామమును విడిచి యీగ్రామమునకు వచ్చితిని. నేఁడు నాయదృష్టవశమున నినుగంటిని. నాఁడెన్నఁడో చనిపోయిన నాయవ్వను బొడగాంచినట్లైనది. ముమ్మూర్తుల నామెను పోలియున్న మిమ్ము బొడగాంచిన తోడనే మీపాదముల వ్రాలి నను రక్షింపవలసినదని వేఁడుకొన బుద్ధిపుట్టినది. అని తన దీనచారిత్రము నంతయు నామెకడ వెళ్ళబోసి మరియు నిట్లనియెను. అవ్వా! అసహా

యుండను. దిక్కులేనివాడను. నీసహాయము నపేక్షించుచునని నేనాశతో నీపాదముల బ్రాలితిని. నన్ను విడువక రక్షించుట నీదేభారమని పలుకుచు వెక్కివెక్కి యేడ్వ నారంభించెను. ఆవృద్ధాంగనయు వానిని దీనచారిత్రమంతయును విని యాతని స్వపుత్రునిగా నెంచవలెనని తలంచి నాయనా లెమ్ము! నన్ను నాయనమునివలె చూచి యానందమున నాదరించుచు యీనాటినుండి నిన్ను పెంచెదను నాకుమాత్ర మెవ్వరున్నారు. పేరాశతో వచ్చిన నిన్నూరక పోనిత్తునా పెంచెదను అని పల్కి యాతని గృహములోనికి గొనిపోయెను.

పరాక్రమకేతుడు ఆ వేయిరోజులు నాయవ్వకడ మిక్కిలి వినయ విధేయతలతో మెలంగి యామెకుపవలయు సేవలను జేయుచు గడపి యుదయముననే లేచి అవ్వా! నిరుద్యోగియగువాడు కాపురుషుండని మనవారు పల్కుచుందురు. కావున గ్రామములోనికి బోయి యోగ్యమైన తగిన యుద్యోగమున్న జూచివచ్చెదను అని పల్కి పురంబులోనికరిగి తన యజమానుని గృహంబున కరిగి యాతని నెప్పటివలె సేవించుచు సాయంకాలమైనతోడనే యజమానుని యనుజ్ఞగొని యవ్వచెంత కరుదెంచుచు నొకమాసము దినములు గడపి యామాసమున యజమానుడు తనకొసంగిన ద్రవ్యమంతయును గొనిపోయి యవ్వచేతుల నిడి అవ్వా! ఇదిగో నేను పనిచేసి గడించినది. ఇద్దానిని నీయిచ్ఛవచ్చినట్లు వెచ్చించుకొనుము అని పల్కెను. ఆముదుసలియు వానిప్రవర్తనమున కెంతయో సంతసించి నాయనా నాకీద్రవ్యమేల నియ్యెది నీకడనే యుంచుకొమ్మనియె కాని పరాక్రమకేతు డందుల కంగీకరింపక యాద్రవ్యమును ముదుసలికే యొసంగెను.

ఇవ్విధంబున నైదారుమాసములు గతించెను. ప్రతిమాసమునను పరాక్రమకేతుడు జీతమును గొనివచ్చి యాముదుసలి కిచ్చుచు యామె నమ్మకమునకు పాత్రుడయ్యెను. ఒకనాడు పరాక్రమకేతుడు

తనకు జీతమును దెచ్చియిచ్చినప్పు డాతని క్లిసిరియెను. కుమారా! నీవిట్లు కష్టించి ద్రవ్యము నేల సంపాదించెదవు. నాయింట లెక్క లేనంత ధనమున్నది. అనుభవించుటకు మాత్ర మెవ్వడున్నారు. నీ వొక్కడవేగదా? ఎందులకై యూరక కష్టపడియెదవు రమ్ము నా ద్రవ్యమంతయును జూపెదను. అనిపల్కి యాతని తనతోగూడ గొని పోయి యొక నేలమాళిగ యందు గుప్తపరుపబడిన ధనరాసులను జూపి కుమారా! యివన్నియును నీయధీనములు నీకెప్పుడెంత యగత్య మైన యంత దీసికొనుచుండుము. ఇంక పనిమాని యింట గూర్చుండు మనియెను. అంత నాత డవ్వా కూడుచుండితినని గుళ్ళుమళ్ళు యాట వను నామెత నెఱుంగవా? ఊరక కూరుచున్న యెడల దేహపరిశ్రమ యెట్లు కలుగును. ఇంతియెగాక నేపనియు లేనిమనస్సు కట్ట తెగిన నది వలె కళ్ళెముల వదలించుకొనిన గుఱ్ఱమువలె దారి తెన్నుల తెరం గెఱుంగక పరుపిడుచుండును. కావున నన్ను నాయుద్యోగమును విడువవలసిన వని జెప్పకుమనియెను. ఆతని పలుకు లాలించి యాతని యెడ నపరమితానురాగము కలిగియుండెను.

ఇట్లు కొన్నిదినములు గడచిన యనంతరము పరాక్రమకేతు డొక్కనా డవ్వచెంతజేరి అవ్వా యీపురమునందలి వింతలన్నియును చూచితిని కాని వేశ్యవాటికయందు దివ్యకాంతుల నీను సుందర భవనం బొక్కటి చూచితిని. అంత చక్కని భవన మీపురంబున నెక్కడను లేదుసుమా! ఇంతటి భాగ్య మామెలాగ కెట్లు కలిగినదో గదా? యని ప్రశ్నించెను. ఆ ముదుసలియు కుర్రా అయ్యది నా యజమానురాలి సౌధము. ఆమె గడించిన ధనము లెక్కింప నలవి కాదు. అందుచేతినే యంతటి దివ్యసౌధమును కట్టించినది. అని పల్కెను పరాక్రమకేతుడును యా యవ్వవలన తిలదవతియొక్క వృత్తాంతమంతయును దెలిసికొనుటకు సమయమువచ్చినదిగా దలంచి,

అవ్వా! ఆమె జూదమాడుటయందతి నిపుణురాలనియు, ఎల్లప్పుడును జయమునే గాంచునుగాని యోటమి యెఱుంగదనియు నీవును పలుకుచుందురియ్యది నిక్కమగునా? నేనుమాత్ర మయ్యది కల్లయని తలంచుచుంటిని ఏలనందువా? పాచికలు నెట్టుటలో ప్రజ్ఞ యెల్లప్పుడును యుపయోగింపదు. ఎల్లప్పుడును జయమే గలుగుటకామె యేదో మోస మొనర్చుచుండుననియే తలంతును అని పల్కెను. జరతాంగనయు పరాక్రమకేతుని పలుకులాలించి యాతని బుద్ధిసూక్ష్మతకు మిగుల సంతసించి కుమారా! నీవనినదే సత్యము. ఆమె మోసముననే యెల్లర జయించుచుండును. అని పల్కెను. పరాక్రమకేతు డవ్వా పాచికలలో మోసమున్నదా? లేక యాటలో మోసమున్నదా? తెలుపుమని ప్రశ్నించెను. అవ్వయు తానేమి వచించుచుంటినో స్మృతిలేక రహస్యము నిట్లు బయలుపుచ్చెను. కుమారా! పాచికలలో మోసము లేదు. కాని యామె యొకపిల్లి నెత్తిపై దీపముంచును. తనకు పందెములు సరిగా పడకున్న యెడల మెటికలు విరచును. అంత నాపిల్లి తల యాడించుటకు మొదలు పెట్టును. అప్పుడామె యా దీపపు క్రీనీడలో నుంచిన యెలుకకాయల నామె కనుకూలముగా నుండునట్లు సవరించును. అందువల్లనే యామె యెల్లప్పుడును జయించుచుండునని రహస్యము నంతయు వెలిగ్రక్కి యంతలో తెలివిదెచ్చుకొని నాయనా యీరహస్యము నెచ్చటనైన వెలిగ్రక్కెదవుసుమా! హానివచ్చును అని పెక్కువిధముల పల్కి యాతనిచే నాసంగతి గోప్యముగా నుంచునట్లు బాసగొనియెను.

పరాక్రమకేతుడు బిలదవతినే సర్వదా జయలక్ష్మివరించుటకు గలకారణమును దెలిసికొని యందులకు ప్రతిబన్నుటకై యొక్క ముంగిసనుకొని యద్దానిని తనజేబులో నుంచుకొని చేతిమెటికలు విరచినతోడనే బయటకు వచ్చునట్లుగా నేర్పెను. ఇట్లు ఆమె చేయు

మోసమును ప్రతిఘటించుటకు నలయు నేర్పాటులన్నియు గావించు కొని తానీవఱకు సంపాదించిన ద్రవ్యమంతయును లెక్కింపగా నారు లక్షల వరాలుండెను.

పరాక్రమకేతు వొక్క శుభదినంబున తనయజమానుని సమీపించి అయ్యా ! యీగ్రామమునకు సమీపమునందున్న యొక గ్రామములో నామిత్రులకు వివాహము జరుగుచున్నది. పోయి చూచిరావలయునని యున్నది. కావున నొకగుఱ్ఱమును నేటికి నాతో గొనిపోవుట కనుజ్ఞ యొసంగవలయునని ప్రార్థించెను. ఆపలుకులు నాలించి యాతడు నిక్కమని భావించి యందులకు సమ్మతించెను. నాడు దినాంతమగుటకు మున్నే పరాక్రమకేతుడు గుఱ్ఱమునెక్కి బజారునకేగి రాకుమారులు ధరింపదగిన యమూల్యవస్త్రముల గొన్నిటినిగొని ధరించి సాయంకాలమగుసరికి తిలదవతి గృహమునకు జనుదెంచి గంట మ్రోగించెను.

తిలదవతియు యాగంటానాదమాలించి మరల నెవ్వడో తనకు ధనమర్పించి పోవచ్చియున్నట్లు భావించి సంతోషమునుపొంది చెలి కత్తెలను బిలచి యాగంట మ్రోగించువానిని గొనిరావలసినదని యాజ్ఞాపించెను. వారాతని గొనివచ్చుటకేగినతోడనే తాను శయన గృహంబున కరిగి యందు పరికరములన్నియు సిద్ధపరచి చక్కగ నలంకరించుకొనియెను.

చెలు లాతని గొనివచ్చుచుండగా దవ్వులనుండి యాతనిగాంచి యామె తనమనంబున నిట్లని చింతింపదొడంగెను. ఆహా ! యేమీ సుందరాకారుని సౌందర్యము భూలోకమున విహరింప నరుదెంచిన మన్మథుడా లేక చెలువలశీలంబు పరీక్షింప రోహిణి నెడబాసివచ్చు చంద్రుడా ? లేక రంభావియోగమున మతిచెడి భూలోకమున నల్లా డుచున్న నలకూబరుడా ? కాకున్నయెడల నాసామాన్యమానవులకింతటి

పోయినగదా? కష్టా! ఈతని జెట్టబట్టుటచే నేనెందరి ధన్య యనయ్యెనో యామె యీయమ్యుగంబుల భాగ్యరాలుగదా? ఇదివర కెందరెందరో రాకుమారులఁ గాంచి యుంటినిగాని యింత సుందరా కారుని యింతటి తేజోనిధి నీవఱకు గాంచి యుండలేదు. నేనొనర్చిన పూర్వజన్మసంచితభాగ్యమునఁ నే యీతని సాంగత్యంబు నేటికి లభించి నది. అని పరిపరివిధంబుల దలపోయుచు సంభ్రమాశ్చర్యములు బెన గొన నమరేగి దండను గొని తెచ్చి యొక హంసతూలి కాతల్పమున గూర్చుండబెట్టెను.

తిలదవతి యాతనికి సుగంధతాంబూలాదు లర్పణచేసి పాటక చొప్పున కాలయాపన మొనరింపక నాతనితో సురతక్రీడల దేలుట కుత్సహించి యాతని త్వరపెట్టసాగెను. కాని పరాక్రమకేతుండు వయ్యారీ! నీ వేమో నెత్తముల ప్రజ్ఞగలదానవని నీపాండిత్యమెఱుంగ గోరి దవ్వులనుండి చనుదెంచితిని కావున మున్ముందు పాచికలతో గొంత ప్రొద్దుపుచ్చి తదనంతరము భోగింతముల నెను. ఆపల్కు లా లించి తిలదవతియు నాతనితో క్రీడింప దలంపుగల్గి మన్మథుండు త్వర పెట్టుటచే నెట్టున పాచికలాటకట్టిపెట్ట సంకల్పించెను. కాని పరాక్ర మకేతుండు త్వరపెట్టుటచే విధిలేక సొగటాలాడ నమర్చి పాచిక చేగొని పందెముపెట్టుచు నాట సాగింప మొదలిడెను.

మొదటియాట రాకుమారుఁడు గెల్చెను. రెండవ యాటయు యామె యోడుటకు సిద్ధముగానుండెను. అంత నామె తనచేతి మొటి కలు విరచెను. తోడనే దీపము తలపైనుంచబడిన పిల్లి తల యూడిం చుటకు మొదలుపెట్టెను. తోడనే యాతడును మొటికలు విరచెను. ఆతని జేబులోనుండి ముంగి వెలుపలికి వచ్చెను. ఆముంగిని గని మె లుక కదలమెదలలేక యూరకుండెను. పరాక్రమకేతుడు తిలదవతీ! లక్షలకొలది ధనముగా నేర్పరచి జూదమాడుచుంటివిగాని దీపము

పెట్టుట కొక్క కొయ్యముక్కనైనను జతగూర్చియుంటివి కాదుగదా యని పరిహాసము చేసెను. అందుల కామె యెంతయో నొచ్చుకొని యొకచెలికత్తెచే యొక దీపపు స్తంభమును దెప్పించి యాడుటను మొదలుపెట్టెను కాని ప్రతియాటయు నోడిపోవుచుండెను. కొంత సేపటికి పరాక్రమకేతుఁడు సుమారేడుకోట్ల రూపాయిలు గెలుపొందెను అంతట నాటచాలించి తరుణీ! రేపటిదినమున యాట సాగింతము. నాధనముగూడ నిచ్చటనే యుండనిమ్ము అని పల్కి యానిశాశేష మాతస్త్రీమణితో క్రీడించుచు సుఖముగా గడిపెను. తిలదవతియు ఆతనియందు బద్ధానురాగయై, సకలకళాప్రవీణుండగు పరాక్రమకేతు చేతల కపరిమితామోదము నంది సంతుష్టచిత్తయై ఇట్లని చింతింప దొడంగెను. ఆహా! ఎంతటి ప్రజ్ఞాన్వితుడు ఎంత సౌందర్యముగలవాఁడు చూచినకొలది చూడ ముచ్చటగుచున్నదే మరువదలంచినను మరపునకు రాని యింత సోయగము గలవానిని సృజించుట కాబ్రహ్మ యెంతటిసేద్పను వినియోగించెనోగదా? సోయగమునకుతోడు విద్యాప్రవీణత యందులకు దగిన చాకచక్యము—వీని నన్నిటికంటె మిన్నయగు రసికత నొక్కచో మూర్తిభవించి యుండెనుగదా! సురతకళాప్రవీణుడగు నాతనిచెంత ప్రౌఢనయ్యు కేవల ముగ్ధపగిది మెలంగితినే యెంతటియానంద మాసుందరుని చెంగట లభించియుండెను. ఇట్టివానిని చెంగనాడుకొనునంతటి బేలయుండునా? కానిమ్ము జయించిన నీతని దాసునిగా నేలుకొందును లేదేని జయింపబడిన నేనీతని నాబాహువల్లరుల బంధించి కదలమెదల నీయకుందును. అని చింతించుచు మరల నాతడెప్పుడు వచ్చునాయని నిరీక్షించుచుండెను.

పరాక్రమకేతుడు తనదుస్తులన్నిటిని మరుగుపరచి యెప్పటి వస్త్రముల ధరించి యాజమానుని చేరబోయెను. నాడుదినాంతమువరకును యజమానుని మదికెక్కునట్లు సేవించి సాయంకాలమైనతోడనే

యోాతనియొద్ద నుండి లసమ్మగొని తిలదవతి సౌధమునకు బోయెను. ఆమెయు సాయంకాలమునందే పరాక్రమకేతుం డరుదెంచునని వివిధాలంకారభూషితయై యాతని యాగమన మపేక్షించి నీలికవాట మును తెరచియుంచి యుంచుకమైనయున యొక హంసతూలికాతల్ప మున గూరుచుండి యెవరికైన, జాతని సెనుకం ని గాసికి దీసుకొని వత్తునని తలపోయుచు క్షణ మొక యుగమునలె గడపుచు అనుషంగా మునను తన యలంకారముల తృప్తిబడియున్న నాతడు పరిహసించు చునేమో యని మాటిమాటికిని దర్పణమందు దిలకించి సవరించు కొనుచు మాటిమాటికిని వీధిగుమ్మమువంక చూచుచు కాలయాపన మొనరించుచుండెను. పరాక్రమకేతుండు గాన్పించినతోడనే యాసన మునుండి లేచి పరుగుపరుగున యాతని సమీపించి కౌగిలించుకొని ప్రియా! ఇంతటిజాగొనర్చి రేల? మీకొరకై క్షణమొక యుగమువలె నిరీక్షించుకొనియుందునని యెరిగియు దలంప కిట్లు జాల మొనర్ప పాడియే యని పల్కుచు మోహాతిశయంబున నాతని పలుమారు కౌగిలించుచు గబ్బిగుబ్బలుగమ్మన నాని తమిదీర్చుకొనుచు యంచనడకలతో నాతని శయనాగారమునకు దోడ్కొనిపోయి మృదుతరంబగు నొక హంస తూలికాతల్పమున నాతని గూర్చుండబెట్టెను.

తిలదవతి సఖులను బిలువనంపి మధురతరంబులగు ఫలహార ముల దెప్పించి నాథా! యీ అల్పాహారమును స్వీకరించి నాయానంద మినుమడింపజేయ ప్రార్థించుచున్నదానను. మీరు నేడిచ్చటికి వేగ ముగా నరుదెంతురనియు మీ సరసనే గూరుచుండి యుల్లాసమున భుజింపవచ్చుననియు వీనినన్నిటిని తయారుచేయించి మీరాక కెదురు చూచుచుంటినని పల్కెను. ఆపల్కులాలించి పరాక్రమకేతుడు ఫల హారముల పళ్ళెర మందుకొని యొకభక్ష్యము నెత్తి తిలదవతికొసంగిన నద్దాని నామె భక్షింపుచుండ తాను వేరొక్క భక్ష్యమును దినుచు

మధ్యమధ్య దామెసవృచున్న భక్ష్య మామె కందించుచు వినోదంబుగ ఫలహారములన్నిటిని భుజించి వానిరుచికెంతయు నానందించుచునామె కిట్లనియెను. తరుణీమణీ! భక్ష్యములే మధురములో లేక నీయధర బింబమే మధురమో నిర్ణయింప నుంతయు నలవియగుట లేదు. సూర్యోదయమునుండియు నీయధరమధురామృతధారల చవిచూచుభాగ్యమిం కెప్పటికి గల్గుననియే తలపోయుచుంటిని. కాని యీదినమున పాచికలయందు నీకుగల పాండిత్యమును జూపింపుము. నిన్నటిదినమున చాలరాత్రి యగునంతకుగాని యాట ప్రారంభింపమిచే నెంతయో సేపాడియుండ లేదు. నేడట్లుగాదు మన మిద్దరలో నెవ్వనికెక్కుడు పాండిత్యముగలదో నిర్ణయము తేలువరకును యాడవలయును. అనిన విని తిలదవతియు, అయ్యా! తొలిజన్మమున నాయొనర్చిన పుణ్య విశేషంబున నేటికి మీయట్టి రసిక శేఖరుల సాంగత్యములభించినది. అట్టియెడ కాలమంతయును నిపాచికల యాటలో గడపివేయదలంచు చుంటినేను కాని మీయానందమునకు భంగము గల్గింప మనస్కరింపక యందుల కంగీకరించుచున్నాను కాని యొక్క మాట వినుడు నాకడనున్న ద్రవ్య మపారము ఒకటి రెండు దినంబులాడిన నయ్యది తరుగదు. కావున నేనోడిన నాసమస్తైశ్వర్యముల సమర్పించి తమ దానినై మెలంగుచుండెదను. అట్లుకానినాడు అనుసంతసు పరాక్రమకేతుఁడు తరుణీ సందేహింతువేల! నీవే నా పాచికల జయించిన యెడల నీకు దాసుడనై వర్తించెదను. ఇదే ప్రమాణముగానొక్క యాట యాడుదము రమ్మని యామెను బలవంతపరచెను.

ఇరువురును యాడుటకు గూర్చుండిరి. మొదటినుండియు యదేమియదృష్టమోగాని యామె యాటయే నీళ్ళుగారుచుండెను. పరాక్రమకేతుని కాయలన్నియును పండుచుండెను. ఆమె చేయునదిలేక యూరక చూచుచుండెను. ఆమె తనచేతికి పాచికలు వచ్చుటతోడనే

మొంతయు ప్రయత్నమున పందెము వేయబోయెను. పైపై నసుకూలములు గానియెడ మనుజప్రయత్నమున కార్యములు సాధింపబడునా? యాపంతె మామెకు లభింపకపోవుటయేగాక పరాక్రమకేతువు కొంతయులాభకారియై యాతనికాయలు పండుటకుగూడ తోడ్పడెను. ఆట ముగియునంతకు పరాక్రమకేతు డన్నికాయలను పండెను తిలదవతి యోడెను. తోడనే యామె తనకడనున్న బీగముగుత్తి యాతని కొసంగి పదములపై వ్రాలి అయ్యా! చేసినవాగ్దత్తము మేరకు మీకు దాసినైతిని. దయతో నన్నేలుచుండ ప్రార్థించుచుంటిని మీకొసంగిన బీగము లన్నియును నేను నిలువజేసి యుంచిన ధనరాసులున్న మందిరములని రెండు చూపెదనని యెక్కొక్కగదిని తెరచి యందున్నధన రాసులను చూపెను. పరాక్రమకేతు డాధనరాసులను చూచి ఆహా! ప్రపంచముననున్న ధనమంతయును యీమె యింటనే నిలచియుండెనా? అబ్బా ఎంత ద్రవ్యమార్జించినది యని విస్మయమంది యామె తోగూడనయ్యాగృహమునకు జనుదెంచి యామెతో సురతభోగముల దేలుచు నానిశాశేషమును గడపెను.

త్రిజగన్మోహిని యనందగు సుందరీమణి పొందు లభించినంత టినుండి యాపరాక్రమకేతుండు తానరుదెంచిన కార్యమును మరచి యామెతో కామోపభోగము లనుభవించుచు దివారాత్రముల భేదము లెంచక యాతిలదవతి యింటనే నిలచుచుండెను. ఆమెకు మాత్రమంత కంటె కావలసిన దేమున్నది. ధనమా లోపములేదు. విద్యలయందా పరిపూర్ణపాండిత్యమును సంపాదించినది. వరుడా యనుకూలుడు. రూపమునందా మన్మథుడు కామశాస్త్రవేది, పరమరసికుడును. ఇంత కంటె నామెకు వాంఛనీయముండునా? అట్లయ్యిరువురును గొన్ని మాసములు నిరంతరసుఖముల బొంది తన్మయులైరి.

## జయప్రదుని విచారము

జయప్రదుఁడు కుమారులు నలువురును గులోబిపువ్వును గొని వచ్చుటకు బయలుదేరిన నాటినుండియు వారు తప్పక ప్రసూనము గొనివచ్చి తన యంధత్వమును బాపెదరని నమ్ముకొని యుండెను ఒకమాసము గడచిపోయినది. కుమారు లరుదెంచు జాడ గాన్పింప దయ్యెను. రెండుమాసములు గడచినవి కాని రాకుమారులు తిరిగి రాలేదు. అతఁడు తనతో జెప్పినట్లుగా కుమారు లొకమాసము లోననేగాక రెండుమాసము లైనను రాకపోవుటచే నెక్కుడుగా చింతించుచుండెను.

ఆహా! ఆగులోబిపువ్వుచే నాకు దిరుగ దృష్టి గలుగునని పేరాశవహించు కుసుమకోమలులగు తనూజులను పంపియుంటిని. వీరి కా బకావలియున్న వన మెచ్చటనుండెనో యందు ప్రవేశించుట కేమార్గమున బోవలయునో దెలియునో లేదో? ఇంతకును యాబకావలి వనమున్న దిక్కునకేని వీరేగియుండిరో లేదో-ప్రయాణమునందు వీరల కేమైన నాపద గలిగియుండునా? ఒకని కాపదగలిగిన నొకడైన దిరిగిరావలయునుగదా? ఒక్కరును రారైరి. నామనమూరక తామ రాకులోని నీటిబిందువువలె నూరక చలించుచున్నది. కుడిచి కూర్చుండ లేక నిష్కారణముగా పుత్రులనుగూడ కష్టపెట్టుచున్నాను. అని విచారించుచు మంత్రిని పిలిపించి యాతనికి జయప్రదు డిట్లులనియెను.

కుమారులు ప్రసూనసంగ్రహమునకై యరిగి చాలదినము లైనది. వారిలో నొక్కరుఁడును యింతవఱకు గృహమునకు మరలి రాలేదు. వారేదిక్కునకేగిరో యెంతవరకు కృతకృత్యులైరో దెలియదు. కావున చారులను బుత్తెంచి వారివృత్తాంత మేమైన దెలియ నగునేమో యత్నింపుమని నియోగించెను.

మంత్రియు పెక్కుఁడు చారులను బిలిపించి చారలను రాకు మారులు ప్రయాణమ్మైన దిక్కునకేగి రాకుమారు లెవ్వ రచ్చటనున్న దియు కనుగొని వారలను కలసికొని మాటలాడి పట్టణమున కెప్పు డరుదెంచెదరో కనుగొని రావలసినదని నియమించెను. మంత్రుల యాజ్ఞను శిరసావహించి చారులు నిరంతర ప్రయాణముల సాగించుచు దమకగుపడిన జనప్రదంబులందెల్ల రాకుమారులచ్చటికి వచ్చియుండిరో లేదో కనుగొనుచు పెక్కుదినములవఱకు దిరిగి దిరిగి రాకుమారు లెచ్చట నున్నదియుగనుగొనవేరక గృహోన్ముఖులై మంత్రిశేఖరు నకు తమపడిన పాట్లెల్ల వినిపించి రాకుమారులను గలసికొన నేర మైతిమని నుడివిరి.

జయప్రదుఁడు చారులు తిరిగివచ్చిరనియు వారు కుమారులను కలసికొన లేకపోయిరనియు విని యెక్కుడుగా విచారించి విధీ! ఇంతటి వృద్ధుడనయ్యు యాశాపాశపీడితుఁడనై యింకను ఐహికముల నాకాంక్షించుచు కుమారులను గట్టబెట్టితిని. నాయట్టి కట్టిడి యుం డునా యని తలపోయుచు విధివిధాన మెవ్వరును దప్పింపలేరని నిశ్చ యించుకొని పరమేశ్వరుఁడే దనకు దోడ్పడవలయునని తలంచి కుమా రులు కార్యమును సాధించుకొని రావలయునని కోరుకొనుచు పెక్కు లగు వ్రతములను తపములను సలుపుచుండెను.

## పరాక్రమకేతుడు గులేబివువ్వునకై యరుగుట

ఒకనాడయ్యిరువురు తమ ప్రాసాదమునకంటియున్న యుద్యా నవనంబును ప్రవేశించి యేలాలవంగనికుంజములపొంత రవంతనిల చుచు జాజివిరజాజిలతాపుంజముల గొంతతడవు దాగుడుమూతలా డుచు మల్లెపందెరు చెంతనించుక నిలచి తత్ప్రసూనసౌరభంబుల నాఘ్రాణించుచు చేమంతుల చెంతచేరి మారుతవశంబున నటునిటు

గదలుచు వింజామరలు వీచు తెరంగున నూగుచు తమ్ము సేవించు చున్నవో యనునట్లున్న చేమంతిపువ్వుల గ్రహించుచు చని చని ప్రాణాధిమును కించుక దూరముననున్న సరోవరమును డాయంజని యందున్న పద్మములపై ముసరుచు విహరించు ద్విరేఫసంతతుల గాంచి యానందించుచు నందు ప్రియాంగనతో జలక్రీడ గావించుచు రాయంచలబెడగు గాంచి సంతసించుచు తత్సరోవరతీరమున సమర్చ బడిన చంద్రకాంత శిలావేదికపై సురపొన్ననీడల గూరుచుండి వినోద కథాప్రసంగమున బ్రొద్దుగడపిరి. అనంతర మాదంపతు లాసరోవర మున బ్రవేశించి కొంతతడవు జలకేళి సవరించి సంతృప్తచిత్తులై వెలికరుదెంచిదువ్వలువలధరించితత్సమీపంబునగలయొక్కపొదరింటం జేరి కొంతతడ విష్టకథాలాపంబులను గొంతతడవు మదేభయానల సుందరతరంబులైన నృత్యగానాదులను గాంచియును నానందించుచు గాలంబు గడపిరి.

అనంతర మయ్యిరువురును గృహోన్ముఖులైరి. అట్లు చను చుండ మార్గమధ్యమున నొక్కచో నొక్కగులాబిపుష్పము దిలకించి నాథా! యాప్రసూనము నా కందునట్లు దోప దద్దానిని ధరింపలయు నని యున్నది తెచ్చిపెట్టుడని పల్కెను. ఆతడా ప్రసూనమును డాయబోవుచు విస్మృతాంశము జ్ఞప్తికి వచ్చినతోడనే యాపుష్ప మును గోయక విన్నదనంబుతో దిలదవతిని జేరవచ్చెను. తన విభు డట్లు మఱలివచ్చుటయు నాతని వదనంబున వింతమార్పు కలుగు టయు దిలకించి తిలదవతి కట్టా! వారి నేటికి పుష్పమును గోయు మంటిని నేనట్లు చెప్పుటవలన నాతనిమనంబు సంకటపడి యుండునని భావించి నాథా! మఱలివచ్చితిరేల? ఇంతలో దమముఖ మిట్లు విన్ననై యుండుట కేమి హేతువు? తెల్పుడని పరిపరివిధంబుల బ్రశ్నిం చుచుండెను కాని యాతడు విచారమున నోరు కదల్పక మిన్నకుండె

ను. ఆతడు మానముతోడనే యామెతో నంతఃపురంబున కేగెను. కాని తనమనోగతమును సుంతయును తిలదవతి కెఱిగింపడయ్యెను.

అంత దిలదవతి యూరక పరితాప మొంది పతిమనోగత మెఱుంగనేరక యెట్టకేల కామె యాతనిపదముల వ్రాలి నాథా! మీ రేల నేడు భోగముల నన్నిటిని వగిలియుండిరి; ఇట్లుండుటకు కారణ మేమి? మీరే సర్వమని నమ్ముకొనియున్న నన్నిట్లు బిన్నబుచ్చి మీరు మాటలాడకుండుట పాడియే. మీరు చింతించుచుండ నేనుమాత్రము మీ భోగముల నందుచు సుఖింపగలనని యెంచితిరా? మీ విచారకారణ మెఱింగింపక తప్పదని జలనంతపరచెను. ఎట్టకేలకు పరాక్రమకేతుడు తరుణీమణీ! నీ కెఱిగింపరానిరహస్యమున్నదా? వినుము. మేమైదుగు రన్నదమ్ములము గులోబకావలియుద్యానవనమునుండు గులోబిపూవును సంపాదించుటకై బయలుదేరితిమి. నలుపురీవ ఆకు నీచే జూదమున జయింపబడి చెరసాలలోనున్నారు. నేనును నీబాహుబంధమున జిక్కుకొని విషయాసక్తుడనై క్రిందుమీదెఱుంగక వచ్చిన పనిమరచియుంటిని. నీవుపుష్పమును కోయమంటివి. ఆపుష్పమును కోయబోవునంతకు మేము బయలుదేరివచ్చిన సంగతి జ్ఞప్తికివచ్చినది తోడనే యెడతెగనివిచారము నన్నావహించినది. ఇంతవర కాప్రసూనమును సంపాదించుటకెయ్యది సరియైన మార్గమని యైన యెఱుంగనైతిని అని పల్కి మిన్నకుండెను. ఆపల్కులాలించినతోడనే తిలదవతి నాథా అంతటి కష్టకార్యమును సాధింపవలసినంత యగత్య మేల కల్గెను. మానవులకు చొరరాని; మానవులకేకాక దేవతలకైనను పిపీలికాదులకైనను యాబకావలి యుపవనము జొరరానిదికదా! ఆవనమున ప్రవేశింపవలయునను యభిలాష మీకెందులకు గల్గెను. అందలి గులోబిపూవులు దెచ్చుటయున సామాన్యకార్యముగా మదినెంచియుంటిరా? ఆపుష్పమునకు కావలిగా నెందరు భూతములు నియ

మింపబడియుందురో యెఱుంగుదురా! ఆ యుపవనప్రాకారము లాకస మంటుచుండు సనియైన వింటిరా! సారంగమార్గమునైన ప్రవేశింప వీలులేనట్లు మూషకరాజను భూతము తన భటులగు యిన్నూరువేల మూషకములతో కావలి కాయుచున్నాడు. ఆకాశమునుండి లోని కెవ్వరును ప్రవేశింపకుండునట్లు పెక్కు వేల భూతము లహోరాత్రము లేకదీక్షతో కావలి కాయుచుండుననియైన వినియుంటిరా? నాథా! ఆ ప్రయత్నమునుండి విరమింపుడు. నాపల్కు లాలింపుడు లేనిపోని చింతలు మనంబున నుంచుకొనకుఁడు. ఇచ్చట నివసించుచున్నందు వలన మీ కెట్టి లోటుపాటులును కలుగవు. ఈనాద్రవ్యము మనజీవిత ముల హాయిగా గడపుటకే గాక పదితరములవారికిగూడ సరిపడును గదా? అని యేమేమో వచించుచుండ యామెను వారించి ప్రేయసీ! ఇందున్న రహస్యమును నీ వెఱుంగక నన్ను వారింప నెంచుచున్నావు. కాని నాచారిత్ర మంతయును వినిన యనంతరము నీవట్లెంతమాత్ర మును పల్కవు. నాచారిత్రమును సంగ్రహముగా దెల్పెదను వినుము. నేను జన్మించిన పదునారు వత్సరములవరకు మాజనకునిచే చూడబడ కుండునట్లుగా నరణ్యమధ్యమునఁ బెంపబడితిని. ఒకనా డాకస్మికముగా నేను వేటాడి సొమ్మసిలి యొక చెట్టుక్రింద పరుండియుండ వేటకై యరుదెంచిన నాజనకుడు నన్ను చూచెను. తోడనే యాతనిదృష్టి తప్పెను. ఎట్టి భీతితో నన్నరణ్యమునుంచి పెంచెనో యట్టి భయము నుండి తప్పించుకొనజాలడయ్యెను. వైద్యులెవ్వరో బకావలి వనము నందున్న గులోబిపూవు మరల దృష్టి యొసంగగలదని యాతనికి జెప్పిరట యట్లు చెప్పినమాట లాలించిన నాటనుండియు నాజనకు డాపూవునే సర్వదా వాంఛించుచు నలువురు కుమారులను యందు లకై బంపెను. నాకీ సంగతి తెలిసి నేకూడ వారితో బయలుదేరితిని. నావలననే నాతండ్రి గ్రుడ్డివాడయ్యెను. నావలననే తిరుగ దృష్టి

పొందినయెడల మేలుకాదా? కాక యీ ప్రయత్నమున నేను మరణించినను లక్ష లోకము లన్నియును అజ్ఞానవర్తకున్న నన్ను దుష్కీర్తి పోయరా! కావున నాప్రస్థానమును మానుమని యింక నెన్నడును బోధింపకుము. మరియు నీ పెద్దల తీరుజూడ నీవాబకావలి వనమును గూర్చి యెఱింగి యుందువని తోచుచున్నది. కావున నాకావనమునకు సరియైన మార్గమెరింగించుము. పైన నాయదృష్ట మెట్లుండునో యట్లగును అని పల్కెను.

రెండియు శిలదవతి యాతనిని గులోబిపుష్పమును దెచ్చుటకై వెడలకుండునట్లు చేయవలయునని యెంతయు ప్రయత్నించి విఫల మనోరథురాలై చేయునదిలేక యాపట్టణమున కుత్తరముగా కొన్ని దినముల ప్రయాణములో గులోబకావలి యుద్యానవనమున్నదనియు మార్గమంతయు కీకారణ్యమనియు కంటకభూయిష్టమై యుండుననియు జెప్పెను. అనంతరము పరాక్రమకేతుడుయొక్క శుభదినమున నామె కడ సెలవొంది పుష్పమును సాధించి వచ్చిన తిరుగ కొలది దినములలో వత్తునని జెప్పి పయనమై పోయెను.

## ౬. పరాక్రమకేతుని ప్రయాణము

పరాక్రమకేతు డుత్తరాభిముఖముగా నడుచుచు నొక్క మహారణ్యమును ప్రవేశించెను. అయ్యరణ్యంబున చెట్లతిదట్టములై సూర్యకాంతిని భూమిపై పడనీయకుండెను. అందువలన నాప్రదేశ మంతయును జలసంసిక్తమై యుండెను. మరియు వివిధంబులగు భుజగంబులు తరుమూలములపొంతనున్న పుట్టలలో నాశ్రయ మేర్పరుచుకొని యుండెను. ఆపరాక్రమకేతుడు భయపడక—ధైర్యమే సహాయమై త్రోవజూప ఖడ్గమాత్రసహాయుడై యాత్మరక్షణమాచరించుకొనుచు మెల్లమెల్లన పయనము సాగించుచు నెట్టకేల కాయరణ్యమును గడచి

వేరొక మహారణ్యమును ప్రవేశించెను. అందు పవనవేగంబున ప్రవహించు సెలయేళ్ళును కాలునైచిన జర్రునజారు బండరాళ్ళును మిట్టపల్లంబులును గల్గి భూమియంతయు సూదులవంటి పదునుగలరాళ్ళచే గప్పబడియుండెను. ఆమొనలురాళ్ళపై నడువనేరక యాతఁడెంతయో శ్రమజెందుచు దప్పికయైనప్పుడా కొండవాగులయందలి జలముచే దప్పిక తీర్చుకొనుచు ఆకలిబాధల నడంచుకొనుట కేకాయగసరులో నమలుచు నేకాకియై ప్రయాణమొనర్చి కొన్నిదినంబుల కావనంబునుగూడ గడచి చని వేరొక యరణ్యమును ప్రవేశించెను. అయ్యది ఇంతదను గడచివచ్చిన యరణ్యములు రెంటికంటె నెక్కుడు భయంకరమై యడుగు నడచుటకుగూడ నశక్యమై యుండెను. కాని పరాక్రమకేతుడు పట్టువదలక సాహసంబున కార్యమైనను సాధింపవలయును లేనియెడల కార్యసాధన యత్నమునైన మరణింపవలయును యను దృఢనిశ్చయమున నడుగామడవలె నడచుచుండెను. ఆతడట్టి కష్టముల నొందుచు—తుచ్ఛవాంఛనల జయించుకొనలేక వేశ్యయొక్క కపట మెఱుంగక మోసపోయిన తనయన్నలీకష్టములనించుకంతయు చవిచూడకయె మరలిపోదునుగదా యని చింతించుచు—తన్నింతవరకును రక్షించి గులోబకావలి వనమునకు సరియైనమార్గమును జూపించిన పరమేశ్వరునియనూనకటాక్షమున కెంతయో సంతసించుచు మాటిమాటి కాపరంధాముని దివ్యనామసంకీర్తన మాచరించుచు ప్రయాణము సాగించుచుండెను. అయ్యరణ్యంబు కంటకశిలావృతమై యుండుటవలన నాతఁ డెక్కుడు దూరము నడువనేరక దినమున నెక్కుడగు శ్రమదీర్చుకొనుటకై యుపయోగించుచుండెను.

ఇట్టులనే యనేకబాధలకు లోనై కొన్నిదినములు ప్రయాణమును సాగించియొక్కనాడు మార్గాయాసమున సొమ్మసిల్లి పడియుండెను. అప్పుడొక భూత మాతని సమీపించి తనచేతితో నాతని తట్టి

శేపి ఓరీ ఎవ్వడవు సంప్రాణ్రక్షణ మొందియున్న యీప్రాంతములకు వచ్చుట కేల నీకు పిలుచిరెన్ను నీవృత్తాంతమేమి దెలుపుమన నాతడు మేల్కాంచి యాభూతరాజముయొక్క పాదపద్మముల కెఱగి భూతరాజమా! నీతో నాయవస్థయేమని చెప్పుకొందును తల్లిదండ్రులు లేనియనదను, బహుబీదవాడను, ఎచ్చటికిబోయినను యుద్యోగము లేదు పొమ్మని కసరి కొట్టువారేకాని యించుక జాలిగలిగి ననురక్షిం చుటకు పూనుకొనకుండిరి. ఇంక నీవిపుల విశ్వంబున సేతలదాచు కొనుటకు నెలవులేక చేయునదిలేక ఆత్మహత్యగావించుకొని జీవముల వాయుటకు నిశ్చయించి నదిలోబడితిని కాని పాడుప్రాణము ననువీడ దయ్యెను. ఈత నేర్చియుండుటచే యానదీజలంబులు నను పైకి దేల్చి వేసినవి. ఇక చేయునదిలేక నేయరణ్యంబైన ప్రవేశించిన పులియో సింగమో తప్పక నను కబళింపగలదని నిశ్చయించుకొని గంభీరాటవుల ప్రవేశించితిని. కాని యేమిప్రయోజనము పులులమొత్తంబులు నను జూచి గుహలు జొచ్చినవి. సింగంబులు కాందిసీకతనొందినవి. విషో రగంబులు నను విడిచి దవ్వుదవ్వుల కరిగినవి. ఇక చేయునదిలేక తెగించి యాకలిదప్పులచే పీడింపబడినైన మరణింప నిశ్చయించుకొని నిరంతరప్రయాణముసల్పుచు యిచ్చటి కరుదెంచితిని. నేటికి నావాం ఛిత మీడేరనది, ఓభూతమా! నన్ను నేడు నీకాహారముగా సమర్పణ చేయుచుంటిని. చతుష్పాదులకాహారమగుటకంటె యేనక్కలవాతనో బడుటకంటె నాశరీరము తమవంటి మహానుభావుల కుపయోగింపబడిన యెడల ధన్యుడనగుదును. అని పెక్కువిధముల పల్కెను.

ఆతనిపల్కులాలించి యాభూతము కనికరముగలదియై ఓయీ నీచరిత్ర మాలించిన నీపై జాలికలుగుచున్నది. నీయట్టివానిని పెక్కుర కబళించినగాని మాకొక్కపూటకైన సరిపడదు అట్టియెడ నిను కబళించి యాదోషమును నామెడ జుట్టుకొనుటెందులకు నీకు జీవనో

వాధి జరుగక మరణింపనుంటి ననుచుంటిని గావున నాకడనుండుము నీకెట్టికష్టమును గలుగనీయక గాపాడుచుండెదను అని యను నయో క్తుల నాతని లాలించెను.

## పరాక్రమకేతుడు భూతమును మెప్పించుట

పరాక్రమకేతు డనుదినంబునను కాయగసరులచే తన యాకలి బాధ తీర్చుకొనుచుండుట చూచి యాభూత మోయీ! ఎంతకాలమని యిట్లు కాయగసరుల దినుచు కాలక్షేపము చేయగలవు కావున నీవు భుజించునట్టి వస్తువులేమో నాకు దెల్పుము అట్టివానిని దెచ్చి నీకర్పిం తుననియెను. అంత పరాక్రమకేతుఁడు భూతరాజమా! మీ రెల్లరును పచ్చిమాంసమునే భక్షింతురు కాని మేమట్లుగాదు మాంసమును తిను టయే యరుదు తినినను పచనముగావించి యుపయోగింతుము. మేము తరచుగా వరిబియ్యము గోధుమపిండి, శర్కరమున్నగు వస్తు వుల నధికముగా వాడుచుందుము అని పల్కెను.

భూత మామరునా డెచ్చటికోపోయి గోధుమపిండి, శర్కర, నేయి మున్నగు వివిధవస్తువుల నొంటెలపై నిడుకొని మోయించుకొని వచ్చి వానిని పరాక్రమకేతునకు జూపి ఓయీ! నీకొరకై యీవస్తువు లను సంగ్రహించుకొని వచ్చితిని. వీని నెట్లో పచనముగావించుకొని తృప్తితీర భుజించుచుండుము. ఈసరుకులు సెలవైనయెడల మో మోటపడక నాకెఱిగించుచుండుము మరల వానిని దెచ్చి నీకర్పింప గలను. అని పల్కి తనకార్యము నిర్వర్తించుకొనబోయెను.

పరాక్రమకేతు డాపదార్థములను జాగ్రత్తచేసి దినమున కొక కొంచెము కొంచెముగా నాడుకొనుచు కొన్నిదినములు కాలయాప నముచేసెను. తదుపరి యొక్కనాడు నాలుగైదువీశల నేతినికలిపి సీటిని కొంచెముచేర్చి పెద్దముద్దగా గలిపి యద్దానిని చేతులతోడను కాళ్ళ

తోడను బాగుగాత్రొక్కి యిమరొట్టెలుగా తయారుచేసి నిప్పులపై కాల్చి సిద్ధపరచెను పిమ్మట నిప్పులను కణకణలాడునట్లుచేసి యొక యెలుకను వధించి దానిమాంసమును చక్కగా నిప్పులపై వేల్చి తినుటకు సరియైన నుప్పు కారములచల్లి తయారుచేసి భూతమునకందించిన తోడనే యారొట్టెలను తినిచూచి వానిరుచి కెంతయు మెచ్చుకొని యాతని కిట్లనియెను ఓయీ! నీవుచేసిన యీరొట్టెలు మంచి రుచిగా నుండెను. ఇంతకుమున్ను నేనెప్పుడును యింతటి రుచిగల పదార్థము నెప్పుడును చవిచూచి యెఱుంగను మాంసమును నీవెట్లు తయారు చేసితివో! చెప్పజాలనుగాని యామాంసమున కున్నరుచి యింతని వచించుటకేని యశక్తుడను నీవు నాకు గావించిన యీయుపకారము నకు నేను సర్వదా వశుడనై నీయభీష్టముల దీర్చుచుందునుఅని పెక్కు విధముల నాతని బొగడెను. పరాక్రమకేతుడును తనమనంబున యీ భూతమును తృప్తిపరచి సులభముగా స్వాధీనము చేసికొనిన యనంతరమే కార్యసాధనకు గడంగవలయును కాని యన్యథా చరించిన కార్యము సాధింపబడకుండుటయేకాక ముందెప్పుడును సాధింపవలను కానట్టి పరిస్థితులేర్పడగలవని చింతించుచు భూతముయొక్క మాటల కధికముగా సంతసించుచున్నట్లు నటించెను.

పరాక్రమకేతుడు ప్రతిదినంబునను యాభూతమునకు రొట్టెలనుచేసి తిననిచ్చుచు యాతని యనుగ్రహంబు సంపాదించు చుండెను. ఒక్కనాడు భూత మధికసంతోషంబుననున్న సమయంబున పరాక్రమకేతుం డాభూతమును సమీపించి మహానుభావా! నేటిదనుక మీ మనసున కెక్కునట్లుగా మెలంగితిని. మీసహాయమున నా చిరకాల వాంఛితమును దీర్చుకొనవలయునని తలంచితిని కాని తమ్మడుగుటకు సందేహించుచు చుంటిని అని విన్నవించెను. ఆపల్కు లాలించి భూతమోయీ! నాయెడ సందేహింపవలసినదిలేదు. నీవాంఛితమేమో

తెలుపుము. అయ్యది యెట్టిదైనను తప్పక నెరవేర్చెదనని పల్కెను. పరాక్రమకేతుఁడు కొంతదిటవు దెచ్చుకొని భూతరాజమా! నాకు చిరకాలమునుండి బకావలి యుపవనము చూడవలయునని యున్నది. యీనాకోర్కె దీర్పవలసిన దనెను.

## పరాక్రమకేతుని కోర్కెదీర్ప భూతము ప్రయత్నించుట

ఆభూత మాపల్కు లాకర్ణించి యెట్టికోరిక గోరితివి. ఇది మానవులకు గాదు మావంటివారికిగూడ నసాధ్యమే. చిన్నచటికెట్లు గొనిపోవ నేర్తును నావంటి భూతములు పెక్కువేలచట కాపుగా నియమింపబడి యుండి యా యుద్యానవనమునకు పహరా యొసంగు చుండునే అట్టిచో నీయభిమతమెట్లు దీర్పగలను. కావున నాకోర్కెను విడిచి యొండెద్దియైన వాంఛింపుము. నిముషమున నీకోరిక దీర్చెద ననిన విని పరాక్రమకేతుఁడు అయ్యా! వేరొండు వాంఛితమేమియును నామది నిల్వదు బకావలి వనము చూచియైన ప్రాణములు విడువవలె లేకున్న యేతత్ప్రయత్నముననైన ప్రాణములు విడువవలయునని సంకల్పించుకొని యుంటిని. నీవే నాకోర్కె దీర్పకున్న నాకు మరణమే శరణ్యము అని నిట్టూర్పుల నిగుడ్చుచుండెను. భూత మాతనియందు జాలిగొని కొంతవడి చింతించి ఓయీ! ఈవిషయమున నీకోర్కె తప్పక తీర్తునని నీకభయ మీయజాలను. కాని కొంతవఱకు సహాయ మొనర్చెదను. నాస్నేహితుడగు నొక భూతరాజుకడకు నినుబంపెదను. అతని సహాయము లభించెనా? నీవు నీవాంఛితమును దీర్చుకొన వచ్చును. అని బల్కి వెండియు నాతని కిట్లనియెను. ఓయీ యెప్పటి వలెగాక నేడు రొట్టెలధికముగా చేయుము మాంసమునుగూడ నెక్కుడుగా సిద్ధపరచి యుంచుము. నేడిచ్చటకు నామిత్రుడైన భూతమును విందునకు బిల్చి యాతని సంతుష్టినొందజేసి నీమీద నాతనికి దయ

గలుగున ప్రాణచ్ఛేదము, అని పల్కి యాతని పచనకృత్యములకు బొమ్మనియెను.

పరాక్రమకేతుఁడును దినదినమును తాను చేయుచున్న రొట్టెల కంటె నెక్కుడుగా చేయవలసి యుండుటచే నాడున్న గోధుమపిండి నంతటిని యున్న శర్కరతో గలిసి నేతిభాండముల ద్రిమ్మరించి యా పిండిని బాగుగా కలిపి ముద్దగావించి తనశక్తి కొలదిని మర్దించి రొట్టెలను తయారుచేసెను. మరియు నాభూతము చంపి తెచ్చిన జంతువు లలో రుచికల్గిన జంతువుల మాంసము నెత్తి పచనముచేసి సిద్ధ పరచెను. భూతము పరాక్రమకేతు డంతయు సిద్ధము చేసియుండుట గమనించి తన హితుని బిలుచుకొని వచ్చుటకై పోయి యొక్క ఘడియలో తన్ను బోలిన యింకొక భూతముతో లోనికి బ్రవేశించెను. భూతము తన మిత్రుని సుఖాసనాసీనుని గావించి కుశలప్రశ్నల గావించి క్షేమోదంత మరసి యాతని కుల్లాసము పుట్టింప దామిరువు రును బాల్యమున గలసి యొనర్చిన కొంటెపనులను జెప్పుచు కొంత వడి సంతోషమున కాలయాపన మొనరించి మిత్రమా! నీకీ దిన మున విందుచేయ సంకల్పించి యిచ్చుటకు దీసికొని వచ్చితినని పల్కి రొట్టెలను మాంసమును కొనివచ్చి యాతని ముందుంచి తాను గూడ సుఖాసీనుడై మిత్రునితో విందారగించుట కుపక్రమించెను.

అతిథియై చనుదెంచిన యాభూతము యారొట్టెలను మాంస మును చవిజూచి కట్టా! యింతటి రుచ్యములగు పదార్థములను నే నెన్నడును చవిచూచి యెఱుంగను ఆహా! ఇట్టి పదార్థములు నీ కెట్లు లభించుచున్నవి, దెల్పుమని ప్రశ్నించెను. అంత నాభూతము పరా క్రమకేతుని బిలిచి తనమిత్రున కాతనిజూపి ఈతని సహాయమున నాకిట్టి యనర్ఘపదార్థములు నిత్యమును లభించుచుండెను. అని బల్కిన వినియా భూతము పరాక్రమకేతుని పరిశీలించి మిత్రమా! యీతడొక

మానవునివలె నున్నాఁడు. నీకీతనితో సహవాసమెట్లు కలిగినది. ఈతని చరిత్రమేమి, సవిస్తరముగా దెల్పుమని భూత మిట్లనియె. నీవనినట్లీత డొక మానవుడే, ఈతఁడు తన జీవితోపాధి గడచుటకు మిక్కిలి కష్టమైయుండ నీచప్రవృత్తుల ప్రవేశింపనొల్లక—నాత్మహత్య గావించుకొన నెంచి యీనాగృహమునకు వచ్చెను. అంత నేనీతనిపై కరుణ గల్గి నాగృహముననే నిలువవలసినదిగా యాతనికి జెప్పితిని. అప్పటి నుండి నాకడ నమితమగు భయభక్తులు కలిగియున్నాఁడు. అని జెప్పి వెండియు నిట్లనియెను. ఈత డొకటి వాంఛించుచున్నాడు. అట్టివాంఛిత మెట్లు దీర్పగలనా యని యాలోచించుచుంటిని. పోనీ నీవాంఛిత మీడేర్ప నసమర్థుడనని పల్కిన చెల్లదా యని ప్రశ్నింతువేమో వినుము. ఇన్నిదినములు తాను నాకై కష్టపడి యనుదినమును రుచ్యములైన పదార్థము తయారుచేసి పెట్టుచు నన్నిటికిని నన్నే నమ్ముకొనియున్నవాని నూరక బొమ్మనుటకు మనస్కరించుటలేదు. ఏమి చేయుదుననియెను. అంత నయ్యాది ఓయీ! యుపకారికి ప్రత్యుపకారము చేయకుండుట మన భూతగణంబులకు లగ్గుగాదు అవశ్యమీతని వాంఛితమును దీర్పవలయును. అని ప్రత్యుత్తరమిచ్చి వెండియు నిట్లనియెను. ఈతని వాంఛితమును తీర్చుటకు నీవేల సందేహించుచుంటివి. అయ్యది నీకసాధ్యమైనదా? వలయునెడ నాసహాయమును గూడ గైకొనుము. ఈతని చూడగా సజ్జనునివలె నున్నాడు. సజ్జనుల కొనర్చిన సహాయమెన్నటికిని వ్యర్థముగాబోదు. అనిన విని పరాక్రమకేతునకు నీయభిమతము దెలుపుమని భూతము కనుసన్న జేసెను. పరాక్రమకేతుఁడు యతిథిగా వచ్చిన భూతమునకు సాగిలబడి లేచి భూతరాజమా! నాయభిమతమును దీర్చుటకు తమవంటివారు తోడ్పడుదుమని బలుకుచున్నపుడు బలుకకుండ నుండుట మేలుకాదు. నాకు చిరకాలమునుండి బకావలియొక్క యుపవనమును సందర్శింపవలయునను

కోరిక యున్నది. భూలోకస్వర్గమనియు నద్దానిని చూడనివాని జన్మ మేలవనియు పెక్కురు పలుకుదురు. అట్టి వనమును చూడవలయును లేదా యేతత్ప్రయత్నమున మరణింపవలయునని నిశ్చయించుకొంటిని అని పల్కె. ఆపల్కులాలించి యగ్గిపై గుగ్గిలము పడినట్లు మండి యాభూతము ఓరీ! మానవా! ఎంతటి యసాధ్యపు కోరికను గోరితివి. నీవంటివారి కయ్యది సాధ్యమా! నీవింక నీప్రయత్నమునుండి మరలుము లేనియెడల వృథా జీవములు గోలుపోయెదవు. అని రూక్షమున పల్కిన భూతము తనమిత్రుని శాంతునిగావించి ఓయీ మనల నర్థించినవానికోర్కె తీర్చుట మన విధ్యుక్తముగదా! యనిన యా భూతము ఓయీ! ఇక్కార్యమున వానికెట్లు సహాయము చేయవలయునో దోచుటలేదు. అందువలన నట్లంటిని. అనిన భూతము ఓయీ! నేనొక్కయుపాయము దెల్పెదను వినుము. వీనిని మాసోదరి యొద్దకు బంపుము. అచ్చటనుండి యాతడెట్లైన ప్రయత్నించి యుపవనములోనికి పోగలిగిన పోవును. లేదా వానికర్మ మెట్లున్న నట్లగును అనియెను. అంత నయ్యతిథి అగునగును. ఆమె యఘటితఘటనాచతుర సార్థకనామధేయముగలది. ఆమె తలంచిన నీతని వాంఛితము తప్పక నెరవేరగలదు. అని పల్కి యాతనిచేతికి తన సోదరియగు యఘటితచరితకు లేఖ లిఖించి యిచ్చి పోవు మార్గ మెఱింగించెను.

పరాక్రమకేతుడు వారిరువురయొద్దను సెలవుగైకొని భూత మెఱింగించినమార్గమునబడి యఘటితచరితను సందర్శించుటకు బయలు దేరెను.

## పరాక్రమకేతు డఘటితచరితను సందర్శించి యామె మన్ననలందుట

పరాక్రమకేతుడు నిరంతరప్రయాణము సలిపి కష్టముల కోర్చి ఎట్టులో యఘటితచరిత యుండుతావున కరిగి తనయొద్దనున్న యు

స్త్రీ మా మెకందించెను. అఘటితచరిత సమీపముననున్న కుమార్తె మరకతమణి యనుదానిని పిలిచి యీయుత్తరమును చదువు మనియె ను. ఆమె ఆయుత్తరము గైకొని పరాక్రమకేతుని జూచి తన మనం బున నాహా యీతరుణవయస్కుని చెట్టబట్టగలిగిన యువతియే ధన్యురాలుగదా నాకిట్టి మహాభాగ్యము కలుగునా యని తలపోయు చు నించుక తడవూరకుండి యీయుత్తరమువిప్పి యిట్లు చదివెను.

"అక్కగారి పాదపద్మములకు తమ్ముడనేక నమస్కారము లాచరించి వ్రాయునదేమనగా భవదీయాశీర్వచనముకలిమి నేటివఱ కిచ్చట సుఖముగా నున్నాము. నీవును మా మేనకోడలైన మరక తము క్షేమముగా నున్నారని తలంచెదను. ఇపుడు నేను పంపిన యీపురుషుని నేను పసితనమునుండియు పెంచి పెద్దవానిని చేసితిని. ఈత డతిబాల్యముననున్నతరి యొకవనములో నసహాయుడై పడి యుండెను. కరుణించి యీబాలకుని దెచ్చి పెంచితిని. ఇప్పుడాతని నీవద్దకు బంపితిని. ఇకముం దీతని యభివృద్ధి గమనించు భారమును నీపై నుంపదలచి నీవద్దకు బంపితిని. ఈతని నెట్లు రక్షించి గాపాడు చుండెదవో ఈతని నేను ప్రాణపదముగా జూచుకొనియుంటినని చెప్పి ననది యతిశయోక్తి కానేరదు.

తరచు నీ క్షేమసమాచారములను కుమారుని యోగక్షేమము లను మరకతయొక్క క్షేమమును వ్రాయించుచుండవలెను.

ఇట్లు

నీయనుంగు సోదరుడు"

అని యూరకుండెను. అఘటితచరితయు నాతని రూపురేఖా విలాసములగాంచి తనకుమార్తెయగు మరకతమణికి నంతకంటె చక్కని భర్తనుదెచ్చు టసాధ్యమని నిశ్చయించి యాతని నతిగారవ

మున జేరబిలిచి తనతొడపై గూర్చుండబెట్టుకొని నాయనా నాసోద రునకు! ప్రాణపదంబైన నాకు నాతఁడు మాత్రము గాకుండునా యని [illegible] కుమారీ! నీమామ యభిప్రాయము గుర్తెఱింగితివా! నిన్నాతనికిచ్చి పరిణయము గావింపవలసినదని యాత డభిలషించి యుండెననుట కీయుత్తరము విశదము చేయుచున్నదని పల్కి కుమారీ! "మనసులేని మనువుమూలమునకే హానికరము" కావున నీవీతని వరింప నిచ్ఛగింతువా? సంకోచింపక తెలుపుమని యడుగుచు నామెను గూడ తొడపై గూర్చుండబెట్టుకొనెను. అంత నామె తల్లి కిట్లనియె. జననీ! మున్ముందు నన్నేల ప్రశ్నింతువు. ఆ మహానుభావుడు నాయట్టిదానిని పరిగ్రహింప నంగీకరించునో లేదో మున్ముందు తెలిసికొనుము. నేనెప్పుడును నీయాజ్ఞనువర్తినని యెఱుంగవా? అని యూరకుండెను. అంత పరాక్రమకేతుడు భూతమున కిట్లనియెను. తల్లీ నాపోషణభార మంతయును వహించుట కంగీక రించుచున్నపుడు నీయాజ్ఞల జవదాటుదునా మరియు నను కష్టముల ముంపక యనురాగమున లాలించుచు నీముద్దుల కుమార్తెను నా కొసంగి పరిణయముగావింప యత్నించుచుండవలదని నిరాకరింతునా? సిరి రా మోకాలొడ్డునంతటి మూఢుడనియే భావించితివా అని మిన్నకుండెను.

అఘటితఘటన చరిత నవ్వుచు తన కుమార్తెకరమును రాకుమారుని చేనిడి చిరంజీవులై పరస్పరానురాగము గల్గి వర్ధిల్లుడని యాశీర్వదించెను. తదుపరి యామె వారిరువురకును గొప్ప వైభవముతో వివాహము గావించెను.

పరాక్రమకేతుడు మరకతమణితో సుఖించుట

రాకుమారుడును మరకతమణితో నతివినోదంబుల దేలుచు కొంతకాలము సుఖముగా గడపి తన యత్నమును సాధించుట కుపక్ర

మింపవలయునని నిశ్చయించుకొనియెను. మరకతమణియు నాతనితో సురతక్రీడల దేలుచు తనకంటె భాగ్యవతి యింకెందును యుండబోదని సంతుష్టహృదయయై యొకనిముషమైన నాతని విడువనేరక యతని తోడిదే లోకమనుకొని నిరంతర మాతనికనిపెట్టుకొని యాతనికివలయు నుపచారములన్నియు దానె సల్పును నాతనిమనంబున కెట్టిచింతయును గలుగకుండునట్లు సంరక్షించుచుండెను. అట్లున్నను ఆతనిమనంబు క్రమముగాతనపైనుండి వేరొకవస్తువుపై ప్రసరించుచున్నట్లు గుర్తించెను. అతఁడును ఆమెతో మనసిచ్చి మాటలాడకుండెను. హాయిగా నామెతో సురతక్రీడల దేలుటమాని యామెమాట త్రోసివేయజాలక నెట్టటో కాలయాపనము చేయుచుండెను. అయ్యది గుర్తించి మరకతమణియొక్క వాఁడాతని యుపవనంబునకు దోడ్కొనిపోయి యొక్క లతానికుంజముననున్న చంద్రకాంత శిలావేదికపై నాతనితో గూరుచుండి నాథా! తమకు నాయందనురాగము దప్పినట్లున్నది. లేనియెడల తాము తొల్లిటియట్లు ప్రవర్తింపక కాపట్యమూని వర్తించుచుండిరి. ఇందులకు గల గారణమిసుమంతయు నాకు ద్యోతముగాలేదు నేరిచియో నేరకయో తమయెడ తప్పొనర్చిన క్షమింపుఁడు ఇంకముందట్టి నేరములు చేయకుండ నానేరమిదెలిపి యనుగ్రహింపుఁడు. మనంబున నేదోయుంచుకొని మీర లటమటజెందుచు యేతన్మూలమున నను గూడ చింతిపజేయుటేల? ఇచ్చటినుండి యెచ్చటికైన పోవలయునని యున్నయెడల మీయభిమతమును నాకెఱింగింపుఁడు నాజననిని క్షణమున సమ్మతింపజేసి మీవెంట నంటివత్తును కాదందురా? మీరే పదార్థమునైన గాంక్షింపుచుంటిరా దెలుపుఁడు నిముషమాత్రమున నాపదార్థమును దెప్పించియొసంగగలను. అని పెక్కువిధముల ప్రార్థింపగా పరాక్రమకేతుఁడు తరుణీ! ఇచ్చటినుండి పోవలయునను యభిప్రాయము నాకెన్నఁడును లేదు. కుడిచికూర్చుండలేకనా యిచ్చటినుండి

పోవలయును. నా మన మన్యాకాంతాయత్తమైన దేమో ? యని వెలి
గొందకుము అట్టిదెన్నడును సంభవింపదు నామనంబున భావించు
చున్న దొక్క విషయము మాత్రమున్నది అద్దానిని నీకెఱిగింపవలయు
నని తలంచియు మరల నీవేమందువో యను భయంబున నీకు దెలు
పుటమానితిని గాని మరియొండుగాదు. ఇంత నీవింతగా తరచి యడు
గుచున్నావు గావున చెప్పుచుంటిని వినుము. నాకు చిరకాలమునుండి
బకావలి వనమును జూడవలయునని యున్నది. కాని యిందుల
కెన్నియో యాటంకములుండుననియెఱుంగుదును. అయినను నాకేమో
యద్దానిని చూడవలయునను యభిలాష మిక్కుటముగానున్నది.
ఇంతకెక్కుడగు విచారము నామనంబున నెంతమాత్రమును లేదు
అని తన వాంఛితము వెల్లడించెను. అంత మరకతమణి 'దేవా! యీ
మాత్రపుకార్యమున కింతగా మనోవ్యథ జెందదగునా? ఈ వృత్తాంత
మును నాజనని కెఱిగించి యామెవలన తమ యభిలాషను దీర్చెదను.
ననునమ్మి నాతో గలసి యెప్పటివలె నాదరించుచుండు డిదియే పది
వేలు అని యాతనికోర్కెదీర్చుట కుపాయమన్వేషించుటకు సమ్మ
తించి యాతనిసంతోషసాగరమున దేలించి యాతనివలన దానును
ముదమంది యావనంబున ప్రియవల్లభునితో విహరించి సాయంకా
లము ప్రొద్దుపోయినపిమ్మట మందిరమును జేరబోయిరి.

అఘటితచరిత తన కుమార్తెయు నల్లుడును చీకటిపడువరకును
రాకుండుటచే చింతించి వారెచ్చటి కేగియుందురాయని యాలోచిం
చుచు నిముష మొక యుగమువోలె గడపి వారు మందిరమును
ప్రవేశించుచుండగా జూచి పరుగుపరుగున వారి సమీపించి కుర్ర
లారా! ఇంత ప్రొద్దుపోవునందాక మీరెచ్చటి కేగియుంటిరో యేమి
యాపద మూడెనోయని పెక్కుతెరంగుల నామన మూరక తల్లడిల్ల
సాగినది. ఇప్పుడు మిమ్ములను చూచువరకును నామనంబు తామ

రాకులోని జలకణంబుపోల్కి చంచలత వహించినది. రండు లోనికే గుదమని వారిదుప్పరను లోనికి గొనిపోయి తానొక సుఖాసనమున గూరుచుండి యిరువురిని చెరియొక తొడమీదను గూర్చుండబెట్టుకొని ఇంతవరకు మీరు రాక మసలుటకు కారణమేమి? పరికింపగా మీ ముఖంబులు విన్ననైయున్నట్లు దోచుచున్నవి. ఆయుపవనమున కలహించి యుంటిరా లేక శరీరమున నస్వస్థతగానున్నదా. నాయనా పరాక్రమకేతూ! కుర్రదేమైన నీయెడ నపరాధము గావించియుండెనా? సందేహింపకుము. అని పలుకుచుండ మరకతమణి అమ్మా అట్టిదేమియును కాదు మీయల్లునకు. బకావళి వనమును చూడ మనసగుచున్నదట. దానికై వారు నిరంతరచింతతో నుండిరి. అయ్యది అసాధ్యకార్యము. దానిని నేనెట్లు దీర్పగలనని చింతించుచుంటిని అంతియె కాని వేరుకాదని పల్కెను. ఆపల్కులాలించి యాభూతము అల్లుడా! నీకాబకావలిపై మనసు పోయినదా యేమి? అని నవ్వుచుపల్కి తగిన వాడవుగ నుంటివి. ఇంటికి రానిచ్చిన యిల్లాలిపై చేయి వేసినట్లు చేయదలంచితివి కాబోలును. కానిమ్ము నీయభిలాష తీర్పకుంటినా నాకుమార్తె నీయభిమతము తప్పక తీర్చెదము. కాని కొంతకాలమోపికపట్టి యుండుము. అని పల్కి వారల సంతోషముతో నుండుడని దీవించెను.

పరాక్రమకేతుఁడు తనవాంఛితము దీర్చుట కామె సమ్మతించుటచే నపరిమితానందమునొంది మరకతమణితో సరససల్లాపములు సలుపుచు దిన మొక నిముషముగా గడపుచుండెను. మరకతమణియు నాత డెప్పటియట్లు వర్తించుచుండుటచే సంతసమంది ప్రతిదినమునను తల్లియొద్దకుబోయి నానాథుని యభిలాష దీర్ప యత్నించుచుంటివా? ఎప్పు డాతని నాపూవుతోటకు గొనిపోవుదువని ప్రశ్నించును. ఎప్పటి సమాచారమప్పుడు తల్లివలన నెఱింగిదనవిభుని కెఱింగించుచుండెను.

ఆతడును ప్రియురాలికి తనయెడఁగల భక్తిశ్రద్ధల కెంతయో యానందించి యామె కుల్లాసము కల్గించుటకై తానొనర్పఁగల కార్యము లొనరించుచుండెను.

పరాక్రమకేతుఁడు బకావలి వనము ప్రవేశించుట

ఇట్లుండ నొక్కనాడు భూతము తనయల్లుని సమీపమునకు బిలచి కుమారా! ఈదినము రాత్రి నీవు బకావలివనమునకు పోవచ్చును. అందులకు దగిన కట్టుదిట్టముల గావించియుంటిని. ఆయుపవనమున నీ యిచ్చవచ్చినట్లు విహరించి మరల సూర్యోదయమగుటకు మున్నె నీవేగిన మార్గముననే మరలిరమ్ము. రాకుంటివా యింక నిన్ను దక్కించుకొనుట మాబోంట్ల కసాధ్యము. జాగరూకతతో ప్రవర్తింపుము. ఆమెలదోటలో నిద్రించుచున్న బకావలిని మాత్రము మేల్కొలుపకుము. ఆమె నిద్రనుండి లేచినయెడల భూతములనన్నిటిని బిలచి గోలచేయును. అప్పుడు నిను రక్షించుట యాపరమేశ్వరునకైన నశక్యమా అని యక్కడ నాతడెట్లు ప్రవర్తింపవలయునో మున్నగు విషయముల దెల్పెచనెను.

పరాక్రమకేతుఁడు తన ప్రియురాలి యొద్దకేగి యామెను సంతోషమున దేల్చి తనకు బకావలివనము ప్రవేశించునవకాశముగల్గినది పోయివచ్చెద ననుగ్రహింపుమని యామెకడ సెలవంది రాత్రి పడినతోడనే భూతము తనకు మార్గము జూపబంచిన మూషకరాజుపై నెక్కి యొక సొరంగమార్గమున. బకావలి వనము ప్రవేశించెను.

పరాక్రమకేతుడు గులోబకావలి వనము ప్రవేశించుట

అందున్న సుందరతరలతానికుంజముల యందచందములగాంచి యానందించుచు చలువరాళ్ళతీరంబులు గలుగు సరోవరంబుల రామణీయకత కుబ్బుచు ఆసరోవరతీరంబున గల దీపకళికావ్రాతంబుల

కాంతిసంపదలకు మనంబున మెచ్చుచు అరిగియరిగి యందున్న జల యంత్రముల గాంచి సంతసించుచు కృత్రిమాద్రుల గనుగొని వాని రమణీయత కలయుచు|ముందుకేగి యొక దివ్యభవనంబును గాంచి యనేక శతసహస్రదీపికలతో వెలుగొందుచుండుటగాంచి యయ్యది యే బకావలి నివసించు సౌధముగానెంచి యామెను జూడవలయునను తలంపున యాసౌధోపరిభాగంబున కరిగెను. అచ్చట నొక శయనాగారమున మృదుతమంబగు నొక్క హంసతూలికాతల్పమున బరుండి నిద్రించుచున్న బకావలిని గనుంగొని తనమనంబున నిట్లని వితర్కించెను.

ఆహా! ఏమి యీబాలతారుణ్య సౌభాగ్యము! రంభాద్యప్సరసలను గూడ తలదన్నునట్లున్నదే! ఈమె యింత సౌందర్యవతియగుటచేతనే యీమె జనకుడిన్ని కట్టుదిట్టముల గావించి యుండెను. అనన్యసామాన్యంబగు సౌభాగ్యముల కుమారిన, అనన్యసామాన్య గుణసమన్వితమగు పుష్పమును కాపాడుకొనవలయునన యెవ్వనికుండదు అని యేమేమో వితర్కించుచుండ నామె నిద్దురలో తన ముఖమును పరాక్రమకేతుని వంకకు ద్రిప్పెను. అంతకుమున్నే యావిలాసినీమణిపై విరాళిగొనుచున్న యాతని కామె యిట్లు మోముజూపుట దోహదమొనరించి యాతని విరాళి ద్విగుణీకృత మొనరించెను. అతడామెను. విడువనేరక — కౌగలింపబోయి యంత తెలివిదెచ్చుకొని కట్టా! వచ్చినపని మరచి ముప్పుదెచ్చుకొన యత్నించుచుంటిని గదా యని తలపోసి తానరుదెంచి పోయినట్లామె దెలిసికొనవలయునని యామె చేతనున్న యుంగరమును తనచేతనిడుకొని తనయుంగరమామె వ్రేలినిడి |సమీపముననున్నచందనమును కొంచెమెత్తి యామె చెక్కిళ్ళకు బూసి బుద్ధిమరలించుకొని వెలికరుదెంచి యాప్రాసాదమున కెదుట నొకజలయంత్రమునకు మధ్యను విలాసముగా నుంప

వెల్లడియగును. అపుడు నాకేగాక మీకుగూడ మోసమురాగలదు. కావున మీరిరువురును వెంటనే బయలుదేరి యెచ్చటికైనపోయి హాయిగా నివసింపుడు అని పల్కి యామె నెడబాయవలసివచ్చి నందులకు చింతించుచు యామెను కౌగిలించుకొని శిరము ముద్దాడి కుమారీ! పెంచినప్రేమ చేతనే నను విషవజాలక నింతిగా విలపించు చుంటిని. కన్నకుమార్తె నత్తింటికనుపునపు డింతగా విలపించియుం డదుసుమా! అనిపల్కి వెండియు కుమార్తెకిట్లనియె. పరాక్రమ కేతుడు సకలకళావిశారదుడు వేదవేదాంగ పారీణుడు శాస్త్రజ్ఞుడు వేయేల? ఆతనిని మించినవా డీయిలాతలంబుననే గాదు ముల్లోకం బులనైన నుండజాలడనుట నిక్కము అతని నెట్లు మెప్పించి నాకెన లేని కీర్త్యున్నతుల గూర్చెదవో సుమా! ఆతడు నీపై కోపించినను నీవు మరల కోపింపక యాతనిని ప్రార్థించుచుండుము. నీవును యుక్తా యుక్తవిమర్శనజ్ఞానము గల్గినదానవు. నీకొరులు జెప్పవలసినదియు లేదు. కావున నీవు నీవిభుడరుదెంచినతోడనే యాతనితో నేగుటకు సిద్ధపడియుండుము. నీయాభరణములన్నియు ధరింపుము. నీకువలయు దుకూలములన్నిటిని గొనిపొమ్ము. ఇదే బీగములుగుత్తి. నాపెట్టెను దెరచి బరణిలో దాచియుంచిన యమూల్యరత్నములను నీవెంటగొని పొమ్ము. అని యామెను లోనికిబిల్చి యొకమంచము నభిమంత్రించి యుద్యాన నాకసమున పవనవేగమున నెచ్చటికైన బోవగలశక్తినిచ్చి యల్లున కొసంగవలసిన బహుమతులను సిద్ధపరచుటకై లోనికేగెను.

అఘటితచరిత కుమార్తెకును అల్లునకును అరణమిచ్చి పంపుట

అల్లుడు రాగానే కుమారా! ఇంక నిచ్చట నిలుచుట మంచి దికాదు. ఇదే యీమంచమును యీద్రవ్యమును గొని నీయిచ్చ వచ్చిన స్థలంబున కరుగుము. ఈమంచముపై గూరుచుండి ఎచ్చటికి

బోవలయునన్న యచ్చటికి క్షణమాత్రమున నినుగొనిపోగలను. ఇదిగో భద్రముగా నీచెంత నెల్లప్పుడును యీనాశిరోజమును నీకడ నుంచుకొనుము. నీవు కష్టకాలమున నున్నపుడు నన్నుదలంచి యీ శిరోజమును నిప్పుపై నుంచినతోడనే నీయొద్దకు రాగలను. ఇట్టిదే నాకుమారితకును నొసంగితిని. ఇంక త్వరితముగా పయనముగండని వారిని తొందరబెట్టి పంపివైచెను.

పరాక్రమకేతుండు తనభార్యయగు మరకతమణితోగూడ తిలదవతి యుపవనంబున దిగి యామెకు దనరాక యెఱింగించెను. ఆమెయు నధికంబగు సంతసంబున కర్పూరహారతులతో స్వాగతమిచ్చి పరాక్రమకేతుని మరకతమణిని తనయంతఃపురమునకు గొనిపోయెను. పరాక్రమకేతుడు తిలదవతికి తానుపోయి కార్యమును సాధించుకొని వచ్చిన విధమంతయు చెప్పెను. అందులకామె సంతోషితస్వాంతయై యాతని నధికముగా కీర్తించెను. నాటిరేయి పరాక్రమకేతుడు దక్షిణనాయకుండై తన్ను వలచియున్న యిరువురునారీమణులను సంతతానందవార్ధి నోలలాడించుచు సంతోషమున గడపెను.

బకావలి గులేబిపువ్వు తస్కరింపబడినటు లెఱుంగుట

సూర్యోదయ మగుచుండగా మేలుగాంచి బకావలి తోటవంకకు జూచెను. అయ్యది యేలకో వన్నె తిరిగియున్నట్టు లామెకు దోచెను. కారణమేమైయుండునా యని యామె యాలోచించుచు మోము దామరపై వ్రాలు తుమ్మెదలోయన వెలుగొందు నలకల సవరించుకొని మోమును దర్పణమందు చూచుకొనగా చెక్కులగంద మగపడియెను. తన చేతనున్న యుంగరముయొక్క ప్రతిబింబ మద్దములో గాన్పించెను. అట్టి యుంగర మెవ్వరిదై యుండునా యని వ్రేలినుండి తీసి పరిశీలించెను. అందు నామాక్షరము లేమియును

లేవుగాని యయ్యది కమనీయమైన యమూల్యరత్నములచేత పొదుగ బడినదై యుండెను. ఆయుంగరమునందున్న వజ్రముల కాంతులు నలుదిశల నున్న దర్పణముల ప్రతిఫలించుటచే యుంగరము మరింత యందముగఁ బ్రకాశించుచుండెను. తనయుంగర మేమైయుండునో యనియు యిట్టి యుంగరము నావ్రేలి కెట్లు వచ్చియుండుననియును ఇందు కాలోచించి సమాధాన మెఱుంగలేక చింతించుచు గులేబి పువ్వును గూడ చూడ సంకల్పించుకొని యాజలయంత్రముకడ కరు డెంచెను. అక్కడ పుష్పములేకుండుటచే నెవ్వఁడో యొకఁడు తోటకు వచ్చి తన పుష్పమును హరించుకొని పోయినదే కాక తన యుంగర మును మార్చుటయేగాక శృంగారచేష్టలగూడ గావించి యుండెనని భావించి యెలుగెత్తి భూతములనెల్ల పిలిచి మీరింత యజాగ్రతగ నెందులకుంటిరి. ప్రాణసమాన మగు గులేబిపువ్వు హరింపబడుచుం డగా మీరేమి చేయుచుండిరి. ఇంత మత్తిల్లి యుంటిరేల మీరు జీతబత్తెముల తిని హాయిగా కూర్చుండదలంచితిరా పొండు. నేడు సూర్యాస్తమయమగుటకు మున్నుగా నీప్రసూనమును హరించిన వానిని గొనితెచ్చి నాముందు నిలుపకపోతిరా మీప్రాణములు మీకు దక్కవని ఖండితముగా పల్కి వారల నలుమూలలకును వెదుక బంపెను.

తదనంతర మా లతాంగి కార్యకరణీయముల దీర్చుకొని జలక మాడి కురులార్చుకొని దువ్వలువల ధరించి యొకసోఫాపై పరుండి యిట్లు తలపోయసాగెను. నానానేకభూతగణసంరక్షితమగు నాయుప వనంబును ప్రవేశించి గులేబిపువ్వును గొనిపోవుటయే గాక లోకైక విఖ్యాతసౌందర్యరాశినగు నను గాంచి నాయుంగరమును గ్రహించి తన యుంగరమును నావ్రేలినిడి గాంధర్వవిధిచేత నను పరిణయమాడి శృంగారచేష్టలు సలిపి నన్ను మేల్కొలుపక నాసౌందర్యమునకు

భ్రమింపక వెడలిపోయెను. ఎంతటి దిట్టతనముగలవాఁడు ఎంత సాహసుఁడు పరికింప నీతఁడొక రాకుమారుఁడై యుండునని తోఁచుచున్నది. కానిమ్ము భటులను పంపితినిగదా! వారైన వానిజాడ లరయకుందురే యని చింతించి కట్టా! ఆతడిట్టివాడని రవంతైన నెఱుంగని యీ పురుషుని జాడలు కనిపెట్టుట వీరలకు సాధ్యమగునా? అంతటి సామర్థ్యము కలవాడు నాభటుల కనుగప్పి పోలేకుండునా? అట్లు పోవంజాలనినాడు యీవనమున ప్రవేశించుటకే జంకియుండును. ఇంక నీభూతములవలన కార్యము సాధింపబడదు. వజ్రమును కోయుటకు వజ్రమే కావలయును. కనుక ప్రచ్ఛన్న వేషమున నేన బయలుదేరి వాని నన్వేషించెదను. అని నిశ్చయించుకొనెను.

పుష్పమును హరించిన యాతని దెలిసికొని చేయవలసిన దేమున్నది. ఆతని శిక్షింపనెంచుటా! అతఁడు గాంధర్వవిధిని నన్ను పరిగ్రహించియుండెనే! అట్టివానిని శిక్షింప జేసిన దోసముకదా! ఇంక నిప్పుడు చేయవలసిన దేమున్నది. ఆతడు కురూపియైన సమ్మతించి యాతనికి భార్యనై పడియుండవలసిన దేనా? కానిమ్ము కానున్నది కాకమానదు ప్రచ్ఛన్న వేషమున బోయి యాతని నన్వేషించి వచ్చెదను. అని నిశ్చయించుకొని పురుషవేషమును ధరించి ఖడ్గమాత్ర సహాయయై బయలుదేరెను.

## పరాక్రమకేతుఁడు సోదరుల చెఱ విడిపించుట

పరాక్రమకేతుడు తిలదవతి కిట్లనియెను. ప్రియురాలా! నా సోదరులు నల్వురును నీవలన నోడింపబడి చెరసాలలో దుఃఖించుచుండిరి. వారిని మన్నించివిడిచిపెట్టుము. వారుబుద్ధితెచ్చుకొని యింత తమపట్టణమునకు బోవుదురు. అనిన విని నాథా! వీరిని విడిచిపెట్టవచ్చును. కాని వారు నాచే యోడింపబడిన ట్లొకగుర్తు నంగీకరించి

లేని విడుదల చేయవచ్చును. లేనియెడల వదలుట మంచిదికాదు. అనుచు యేమేమో రహస్యముగాపల్కి వారలనురప్పించి రాకుమారులారా! మీరు నా నామాంకితమగు ముద్రను మీశరీరములపై నుండుట కంగీకరించిన మీదాస్యమునకు విముక్తియొసంగి విడచి పుచ్చెదను. లేదా! ఇక్కడే కారాగృహమున నవయుచుండవలయును. కావున బాగుగా నాలోచించుకొని సమాధాన మొసంగుడనియెను. వారును చెఱనుండి తప్పించుకొని బయటపడుటకు దినమునకు వేయి దేవుళ్ళకు మ్రొక్కువారగుట కతంబున నాచిన్ని యవమానమునకు సహించిన కలకాలము సౌఖ్యముగ నుండవచ్చునని భావించి యందు లకు సమ్మతించిరి.

తిలదవతియు పరిచారికలచే నిప్పుల దెప్పించి యందు తన నామాక్షరమున్న ముద్రను కాల్చియొక్కొక్కని వీపుపై ముద్రనైచి వారిని సాగనంపెను. తరువాత పరాక్రమకేతుడు తన తొల్లిటిరూపమును ధరించి వారి సంభాషణ మాలించుచుండెను. అట్లు విముక్తి నొందిన నలువురును బ్రతుకుదేవుడాయని యొక సత్రములోనికిబోయి యందు భుజించి ముందేమిచేయవలయునను విషయమును గూర్చివిమర్శన సలుపుచుండిరి. ఒక్కడు ప్రసూనమును సంపాదింపబోయెదమనియెను. కాని మిగిలినవారు ఓయీ! ఈ వేశ్యచేతనే పరాభవ మొందినవారము మాయావులైన భూతముల మోసగించి యాప్రసూనమును గొనివచ్చుటకై పోయిన పరాభవింపకుందురా! కావున ప్రసూనముసంగతి యటుండనిచ్చి గృహమున కేగుదము అనిపలికెను. తక్కినవా రందులకు సమ్మతించిరి. నలువురును పయనమగుటకు సిద్ధపడుచుండ పరాక్రమకేతుఁడు వారల యెదుటకువచ్చి వాని కిట్లని యెను. అన్నలారా! మీరు గుర్తింపకున్నను నేను మిమ్ములను గుర్తించితిని. జనకున కెవ్వరివలన దృష్టిదప్పినదో యీ పరాక్రమ

కేతుఁడుగా నన్నెఱుంగుము. నేనుపోయి గులాబిపుష్పము సంపాదించుకొని వచ్చితిని. మన మెల్లరమును కలిసియే మనసూర్యకాంతిపురము నకరుగుదము. అని వారలకు దన పోకడనుగూర్చియు పుష్పమును దెచ్చిన సంగతినిగూర్చియు విపులముగా నెఱిఁగించి ప్రయాణమున కాయత్తైనై చనుదెంతునని పల్కి తిలదవతిసౌధమున కేగెను.

పరాక్రమకేతుఁడు, మగకతమణి, తిలదవతి ముప్పురును వలసిన ద్రవ్యముల గొని యఘటితఘటనా యొసంగిన మంచముపై గూరుచుండి తన సోదరులచెంత కేతెంచి వారనుగూడ నామంచముపై గూర్చుండబెట్టుకొని యతిత్వరితగమనంబున సూర్యకాంతిపురాభిముఖు చనుచుండిరి.

నలువురు సోదరుల దౌష్ట్యము.

రాకుమారులునలువురునుయసూయావేశులై యాతనినెట్లైన మోసగించి యాపుష్పమును సంగ్రహించుకొనిపోవ నిశ్చయించుకొని యట్లు కొంతదూరము పోయినపిమ్మట పరాక్రమకేతునితో సోదరా! మాకు మిగుల దాహముగానున్నది కావున నించుక యిటప్రయాణము నిలిపిన యావాగునుండి నీరుద్రావి వత్తుమని పల్కిరి పరాక్రమకేతుఁడు మంచమును ముందున కేగకుండ నాపి భూమిపైకి దింపెను నలువురును నీళ్ళుద్రావుటకై బోవుచుండిరి. పరాక్రమకేతుఁడు గూడ దప్పిగొని యుండుటచేత వారితో గలసిపోవ యత్నించెను. అంత తిలదవతి నాథా వారితో నేగవలదు. వారసూయావేశులైనట్లు గాన్పించుచున్నది. అని పల్కుచు నాతని పోవలదని కనుసన్నచే వారించెను. కాని యాపె పల్కులయెడ నిరాదరణము చూపి వారితో నేగెను.

అట్లు పోవుచుండ యానలువురిలో నొక్కరుఁడు సోదరా! గులాబి పుష్పమును గొనివచ్చుచుంటివా? లేక పొరపాటున నెచ్చట

యైన బెట్టి మరచివచ్చుచుంటివా? యని ప్రశ్నించెను. అంత పరాక్ర మకేతుడు అన్నా! నేనంతటి వెఱ్ఱివా? పరాకున నెక్కడనైన జార విడుతునేమోయని నాతొడ చీరి యందాపుష్పమునుంచి కుట్టివేసితి ననియెను. అటుపిమ్మట పరాక్రమకేతు డేమఱపాటున నున్న సమయ మున నలువురును యొక్కపెట్టున నాతనిపైబడి పిడిగ్రుద్దులతో నాతని జావమోద స్పృహదప్పి నేలమీద బడినతోడనే తొడచీరి యందున్న పుష్పమును పరిగ్రహించుకొని తమదారిని పోయిరి.

పరాక్రమకేతుఁడు కొంతవడికి స్మృతివచ్చుకొని నలుమూలల పరికించి తన సోదరులు గావించిన కృత్యము నెఱింగి మెల్లన యానదీ తీరమునెట్టెటులో జేరుకొని కొలదిగ నీటుద్రావి సేదదేరుకొనియెను. ఇంతలో తిలదవతియు మరకతమణియు నాతని నన్వేషించుచు నచ్చటికి జనుదెంచిరి. తిలదవతి నాథుని సమీపించి యాతనిని లేవనెత్తి మరకతమణి సహాయమున తొల్లి తాను మంచమును నిలిపిన స్థలమునకు నడిపించుకొనిపోయి యద్దానిపై నాతని పరుండబెట్టి యించుక తడవు సపర్యలొనర్చిరి. ఆతడు పూర్తిగ బలము చేరుకొనునంతకు సూర్యాస్తమయము గావచ్చెను. పరాక్రమకేతుడు వారలకు తన సోదరుల దురాగతమును జెప్పి నాటి కాయరణ్యముననె భార్యలతో నిలచెను.

### పరాక్రమకేతు డఘటితచరిత సహాయము బొందుట.

మరునాడు సూర్యోదయమైనపిమ్మట చెకుముకిరాళ్ళను రాపాడించి నిప్పునుపుట్టించి యందు తన కఘటితచరిత యొసంగిన తలవెండ్రుకలు వైచెను. తోడనే యామె యనేకభూతములతో ప్రత్యక్షమయ్యెను. పరాక్రమకేతు డామెకు నమస్కరించి నిలువగా నామె కుమారా! మీరు క్షేమముగా నుంటిరా? ఇపుడు నన్ను రప్పింప

నగత్య మేమిగల్గెను తెల్పుడని ప్రశ్నించెను పరాక్రమకేతు డామెకు పునరభివందన మాచరించి తల్లీ! నాకు నివసించుటకు దగిన గృహము లేదు. కావున నీసహాయమున నట్టిలోపంబు దీరునని తలంచితిని. అఘటితచరితకుమారా! నీమనసున కెక్కినట్టి ప్రాసాదము నిర్మించెదను. ఎట్టిదానిని నీవు వాంఛింతువో తెలుపుమనియెను పరాక్రమకేతుఁడు తల్లీ! గులోబకావలి వనమునుబోలిన వనమును యట్టి సౌధమును యున్నయెడల నాకు నివాసయోగ్యముగా నుండుననియెను. కుమారా! అట్టిదానిని మేమెన్నఁడును గాంచియుండలేదు కావున నీవు పటముపైన వ్రాసి చూపించిన నచిరకాలమున నయ్యది సిద్ధపరతునని పల్కెను. పరాక్రమకేతుఁడు పటము వ్రాయగా నట్టిదానిని దిలకించి యఘటితచరిత గులోబకావలీ వనమునుబోలిన వనమును సౌధమును గట్టించెను. ఆసౌధమునకొకయోజనము దూరముననే సూర్యకాంతిపురముండెను. కాని పరాక్రమకేతుడచ్చటికేగరాదని నిశ్చయించుకొనెను. అఘటితచరిత మందిరనిర్మాణము పూర్తయైన తరువాత కూతునియొద్దను అల్లునియొద్దను ననుజ్ఞగొని స్వస్థలంబున కరిగెను.

## నలుగురు రాకుమారులును గులోబీపుష్పాచే తిరిగి జయప్రదునకు దృష్టిగలుగునట్లు జేయుట

పరాక్రమకేతుని మోసగించి యాయోజనమును పవనవేగంబున నడచి పురంబునకు వెలుపల నిలిచి తాము కార్యమును సాధించుకొని వచ్చితిమని భూపాలునకు వార్తబంపిరి. జయప్రదుండును సంతోషాంతరంగుండై సముచిత పరివారమును వారలకు స్వాగతమొసంగుటకై పంపెను. వారును వివిధవాద్యములతోడను వారాంగనలతోడను రాకుమారుల కెదురేగి సముచిత గౌరవంబుల నెరపి రాచనగరునకు గొనివచ్చిరి. రాకుమారులు కదురయమున తమ తండ్రికడకేగి గులోబీపుష్పానలన నాతనికండ్లకు దృష్టినొసంగి యాంత

షు స్వస్థచిత్తుడైన పిమ్మట తాముగులోబీపుష్పమును సంపాదించుటలో తాము పడిన కష్టములన్నియు వివరించి యాతని కధికాశ్చర్యమును కలిగించిరి. జయప్రదు డానందమునంది తనపట్టణమునం దెల్లెడల నుత్సవములు జరుప నజ్ఞాపించెను.

గులోబకావలి పురుషవేషమున సకలదేశములను ద్రిమ్మరుచు నెట్టకేలకు సూర్యకాంతిపురంబునకు జనుదెంచెను. ఆపట్టణంబున నెక్కడఁగు నుత్సవంబులు జరుగుచుండుట జూచి యాపురవాస్తవ్యు నొకని జేరబిలిచి ఒయీ! ఈపురంబున నిట్టియుత్సవంబులు జరుగు చుండుటకు కారణమేమని ప్రశ్నించెను. అందుల కాపౌరుడిట్లనియెను. ఈపురీవరంబును పాలించు జయప్రదుని కుమారులు నలువురు కొన్ని మాసములక్రిందట గులోబీపుష్పమును సంపాదించుకొని వచ్చుటకై పోయి కొలదిదినముల క్రిందటనే లబ్ధవిజయులై వచ్చినారు. ఆ పుష్పమువలన మహారాజు తిరుగ దృష్టిని బడసెను. ఆకారణమున ప్రజలెల్లరును యుత్సవముల సలుపుచున్నారు. అని ప్రత్యుత్తర మొసంగెను. ఆపల్కులాలించి పుష్పమును గొనివచ్చిన తస్కరులు వారలె యైయుందురని భావించి వారి వృత్తాంత మాద్యంత మెఱుంగగోరి యాజయప్రదుని యుద్యోగమున ప్రవేశించుటకు నిశ్చయించెను.

## గులోబకావలి జయప్రదుని కొలువున ప్రవేశించుట

మరునాడు నిండుకొలువున నున్న జయప్రదమహారాజు కొలువుకూటమును గులోబకావలి బ్రవేశించి భూపాలునకు వినయవిధేయు తలతో నమస్కరించి యిట్లనియెను. అయ్యా! నేనొక బీదసైనికు డను దూరదేశమునందలివాడను. అట తాము దీనజనసంరక్షకులని ప్రజలు చెప్పకొనుట విని తమ కొలువులో ప్రవేశించి జీవనమును

గడవ్రుకొనవలయునను నభిప్రాయముతో నిచ్చటికి జనుదెంచియుం టిని. దేవరవా రనుగ్రహించి యేదైన నొక యుద్యోగమును ప్రసా దించిన యెడల యేలికపడి చెప్పినట్లు ప్రవర్తింపగలనని పల్కెను. భూపాలు డాతనిం గాంచి యాతని సౌందర్యమున కలరి ఓయీ ! నీపేరెవ్వరు ? నీరూపమును పరికింపగా నీవు కడుసుకుమారుడవుగా గాన్పించుచుంటివని ప్రశ్నించెను. అంత గులోబకావలి అయ్యా ! తొల్లి సుకుమారముగనే పెంపబడితినిగాని యిప్పుడా విషయమును గూర్చి దడవనేల ? నన్ను వసంతుడందురు. పూర్వపు మైశ్వర్య మంతయును గోలుపోవుటచే నిప్పుడిట్లు పొట్ట చేతబట్టుకొని పరదేశ ములపాలు కావలసివచ్చినదని పల్కెను. జయప్రభు డింకను యీ వసంతు నేమేమో ప్రశ్నింపనెంచెను. కాని యందువలన నాతని మనస్సునకు కష్టముగా నుండునేమోయని సందేహించి యాతనిని సదా తనచెంతనే యుండవలసినదనియు, అప్పుడప్పుడు తాను జెప్పు పనులను చేయవలసినదనియు నాజ్ఞాపించెను.

గులోబకావలియు నాటినుండియు ప్రభుని మదికెక్కునట్లుగా ప్రవర్తించుచు క్రమక్రమముగా సంగతిసందర్భములన్నియు కనుగొ నుచుండెను. ఎవ్వరు చెప్పినను నలువురు రాజకుమారులే ప్రసూన మును గొనివచ్చినట్లు చెప్పుచుండిరి కాని నలువురు తన యుపవనము ప్రవేశించి తన్నుగాంచి యుంగరము మార్చియు బోవజాలరనియు దలంచి తనకు సమీపవర్తులగువారలను ఈ మహారాజున కెందఱు కుమారులనియు, యెందఱు ప్రసూనసంగ్రహణమునకు బోయిరనియు ప్రశ్నించుచుండెను. కాని ప్రజలెవ్వరును పరాక్రమకేతుడు పుష్పము కొఱకై పోవుట వారెఱుగమిచే యానలువురే పుష్పమునకు బోయిరని చెప్పుచుండిరి. బకావలియు నిజము నిలుకడమీద కాని దెలియదని నిశ్చయించి యచ్చోటనే యుండెను.

## పరాక్రమకేతునికోటను సందర్శింప జయుడు చేగుట

ఒక్కనాడు సూర్యకాంతిపురమునందలి కట్టెలుగొట్టువారు కొంద రడవిలో కట్టెలుగొట్టుచుండగా పరాక్రమకేతుని సూతనపరివారము లోని కొందఱు చూచి ఓయీ! మీరేల యిట్లు కష్టపడుచున్నారు. మాతో వచ్చిన మీకు మాప్రభువుగారితో జెప్పి శాశ్వతజీవనోపాధుల గల్గి సుఖముగ జీవయాత్రచేయుట కనుకూలమైనంత ధనమిప్పించెద ము రండని పిలిచిరి. కాని వారు ప్రత్యహమును ఆయడవిలో తిరుగు వారగుటచే నాయడవియం దికోటకోట కలదనుమాటలను ప్రప్రథ మమున నమ్మకుండిరి. కాని పరాక్రమకేతుని పరివారము వారికి నమ్మికబుట్ట వచించి అయ్యా! మాతోగూడ కొంతదూరమురండు అచ్చటికి కోటగోడలు గనబడినయెడల ముందునకు వత్తురుగాని లేని యెడల వెనుకకు పోవచ్చును. అని పల్కిరి. ఆపల్కులయెడ కొంత నమ్మకముంచి యీ భటులతో కొందఱు నడచి ముందునకేగిరి. అట్లు కొంతదూరము పోవుసంతకు వారికి ప్రాకారములు దృగ్గోచరము లయ్యెను తోడనే వారు పరాక్రమకేతునిభటులమాటలు నిక్కువ ములే యని నమ్మి వారిని సంతసముతో నెంబడించిరి.

కతిపయనిముషములకు వారందఱును పరాక్రమకేతుని కోట ప్రవేశించిరి. ఆతనిభటులు సూర్యకాంతిపురమువారిని తమ ప్రభువు నొద్దకు గొనిపోయిరి. పరాక్రమకేతుడు వారికి ధనమొసంగి నివసించు టకు దగినగృహములను గూడ యొసంగి వారల నధికముగా నాదరిం చెను. ప్రభుడు తమయెడల చూపిన యాదరణమునకు వారెక్కుడుగా సంతసించి తమకుటుంబముల గొనివచ్చుట కాతని యనుజ్ఞగొని సంతో షభరితాంతరంగులై తమ పురంబున కరిగిరి.

క్రమక్రమముగా నయ్యడవిలో పట్టణమున్నదనియు, యీ పురంబును పాలించు ప్రభుడు మిక్కిలి దయాళుడనియు ప్రజలను

కన్నబిడ్డలవలె రక్షించుననియు, వెండఱువచ్చినను యాపట్టణమున నివసించుటకు దగిన భవనముల నొసంగుననియు నెల్లరకును దెలియవచ్చెను. తోడనే పెక్కుండ్రు సూర్యకాంతిపురమునుండి నూతనపట్టణమునకు బోయిరి. అనుదినమును పెక్కుకుటుంబములు తన పురమును వదలి యెక్కడికో వలసపోవుచున్నారని జయప్రదునకు దెలియవచ్చెను. అంత నాతఁ డొక వేగులవానిని బిలిచి ఓయీ! జను లేలయట్లు వలస పోవుచున్నారో కనుగొని నా కెఱింగింపవలసినదని యాజ్ఞాపించెను.

ఆ వేగులవాఁడును పురజనులవలన నయ్యడవిలో నొకపట్టణము నూతనముగా నిర్మింపబడినదని తెలిసికొని స్వయముగా నేగి యాపట్టణమును చూచి యధికముగా నానందించి భూపాలునిచెంత కరుదెంచి యీసంగతి నెఱింగించెను. కాని భూపాలుఁ డావాక్యములను బ్రప్రథమమున నమ్మక యింకొకనిని పోయి యాపట్టణమును దిలకించిరమ్మని బంపెను. ఆభటుఁడును పరాక్రమకేతుని పట్టణము బ్రవేశించి యందు గల జనుల పరిస్థితులను రాజభవనముయొక్క సౌందర్యమునుదిలకించి ముగ్ధుడై యక్కడ నొకటిరెండు రోజులు గడపి పరాక్రమకేతుని సందర్శించి యాతనితో తాను జయప్రదమహారాజు పనుపున జనుదెంచితిననియు దెల్పి యాతనివలన నెక్కుడు మన్ననలను బడసి మరల తన ప్రభువునొద్ద కరుదెంచి తానుపోయి చూచివచ్చిన సంగతులన్నియు విశదపరచి తన కాభూపాలు డొసంగిన రత్నములు మున్నగువానిని జూపెను. భూపాలుఁ డాతనిమాటలను విశ్వసించి మంత్రి కిట్లనియెను. ఓయీ నీవేగి యాత డెవ్వాడో యిచ్చటి కెందులకువచ్చెనో కనుగొను మనియు నాజ్ఞాపించెను.

మంత్రియు నచ్చటికిపోయి మరలివచ్చి యాతడొక రాకుమారుడనియును, విలాసార్థముగా నరణ్యమున నివసించుచుండెననియును, జయప్రదమహారాజుతో మైత్రి నభిలషించువాడనియు దెల్పెను.

అంతటినుండి యిరువురు రాజులును పరస్పరస్నేహముతో నుండిరి. గులోబకావలి యావృత్తాంతమంతయును విని, విలాసాస్థ మరణ్యముస పట్నముగట్టి ఆపట్టణములోని కెక్కుడుగా జనుల నాకర్షించుట వింతగా నుండుటచే నట్టి విచిత్రచర్యకు హేతు వేమైయుండునని యాలో చించుచుండెను. ఒక్క దినమునం దామె యానూతన నగరమునకు బోయి చూచి రానెంచెను గాని భూపాలుని యాజ్ఞగొనకుండబోయిన యెడల తన కార్యసాధన కాటంకము గలుగజేయునేమో యను భయంబుచేతను తాను ప్రవేశించినది క్రొత్తగనుక భూపాలు నొక్క దినము సెలవడుగుటకు దగినంత సాహసము లేకుండుటచేతను, పరమేశ్వరు సనుగ్రహ మున్నయెడల తనయత్నము సిద్ధించుననియు, దలంచుచు నట్టిటో కాలయాపన మాచరించుచుండెను.

పరాక్రమకేతుడు, తిలదవతీ మరకతమణులతో సరససల్లాపము లాడుచు భోగలాలసుడై దినంబులను నిముషములట్లు గడపుచుండెను. ఒక్కనాడు తిలదవతి నాథా! దోషులకు దగినదండన విధింపక యెంత కాల మిట్లూరకుండ దలంచితిరి. ఇకనైనను మామగారు నిక్కువ మును గ్రహించునట్లు చేయవలయును అని పల్కెను. మరకత మణియు పరాక్రమకేతు నందులకు ప్రోత్సహించెను. అంత నాతఁడు వారల కిట్లనియెను. నేనును అందులకై ప్రయత్నము చేయుచుంటిని. వారిచ్చటి కరుదెంచుటకు మున్నుగా మనపట్టణమున నెక్కుడు జనులు వసించునట్లుజేసి వారికి మన ప్రజలచే స్వాగత మిప్పించదలంచితిని. అందులకై యొక్క సూర్యకాంతిపురమునందలి జనులనేగాక సమీప పట్టణములనుండికూడ జనులను రావించుచుంటిని. జనసంఖ్య యిప్పటి కధికమై యున్నట్లు తోచుచున్నది. ఇంక నొక శుభదినమున నేదో యొక నెపమున వారి నిచ్చటికి రప్పింతును అని సమాధాన మిచ్చెను.

కొన్ని దినము లేగినయనంతరము పరాక్రమకేతుఁడు జయప్రద మహారాజున కొక యుత్తరమును వ్రాసి యద్దానిని తన సచివుని కొసంగి జయప్రదున కొసంగి జవాబు గొనిరావలసినదని నియమించెను. వాఁడును జయప్రదుఁడు సభలోనుండఁగ భూపాలున కాలేఖ యొసంగెను. భూపాలుఁడు తనచెంత నిలువబడియున్న వసంతున కాకమ్మ యొసఁగి చదువుమనియెను. వసంతుఁ డిట్లాకమ్మను చదివెను,

శ్రీశ్రీశ్రీ శ్రీజయప్రదమహారాజుగారి పాదపద్మములకు నమస్కరించి వ్రాయు విజ్ఞాపనములు. మీసఖ్య మపేక్షించియున్న మేము మిమ్ములను రేపు మాయింట విందునకు రావలసినదని ప్రార్థించుటకు సాహసించినందులకు మన్నింపవలయును. రేపటిదినమున తాము బంధుమిత్రామాత్యులతో జనుదెంచి నాకొకపరి మీదర్శనభాగ్య మొసంగి మాయాతిథ్యము నొంద వినయపూర్వకముగా ప్రార్థించు చున్నాను.

ఇట్లు,

మీయనుంగు హితుడు.

ఆయుత్తర మాలించి జయప్రదుఁడు తన ప్రజలు నిత్యమును వేయివిధముల వర్ణించెడి యాపట్టణము యొక్క సౌందర్యమును స్వయముగా వీక్షింపదలంచి యందుల కంగీకరించినట్లుగా ప్రత్యుత్తరము వ్రాయించి యాభటున కిచ్చి పంపెను.

పరాక్రమకేతుఁడును తనకు యఘటితచరిత యొసంగిన తల వెంట్రుకచే యామెను రప్పించి తాను భూపాలు నాహ్వానించుటయు నాత డందుల కంగీకరించుటయు జెప్పి యాతనికి దగినవిందు గావింప నామె సహాయమును వేఁడుకొనియెను. అందుల కామె యంగీకరించి తన భటులందఱకును పురమును శృంగారముగా నలంకరింపవలసినదని

యును యచ్చటినుండి సూర్యకాంతిపురమువరకును చక్కని రాజమార్గము నేర్పరచి యామార్గమున కిరువంకలను రంభాస్తంభములాదిగాగల వానిని నాటి చలువపందెళ్ళను వేయించి భూపాలుఁడు నడచివచ్చుమార్గమున రత్నకంబళముల పఱచి యెడనెడ నాతఁడు విశ్రమించుట కనువగునట్లు హంసతూలికాతల్పములనుంచి వలయు నేర్పాట్లన్నియు గావింపవలసినదనియు నాజ్ఞాపించెను. తలచుటయే తడవుగా సర్వమును సమకూర్పబడియెను. పట్టణమంతయును స్వర్గమును మించునట్లుగా నలంకరింపబడియెను. అమూల్యతరములైన వస్తువులు నధికముగా సంగ్రహించిరి. జయప్రదుఁడు మున్నెన్నఁడెఱుంగనిరీతి నాతిథ్యమీయ సంకల్పించుకొని పరాక్రమకేతుఁడు ప్రతివిషయమునను స్వయముగా కనుగొని లోటుపాటును సవరించుచుండెను.

మరునాడు సూర్యోదయమైనతోడనే జయప్రదుఁడు మంత్రిసామంతులతోడను కుమారులతోడను బయలుదేరి మార్గమున నరుగుచు యామార్గముయొక్క రామణీయకమున కచ్చెరువందుచు నెడనెడ మార్గాయాస మపనయించుకొనుటకును, అందందుగల చిత్రవిచిత్రముల జూచుటకును విశ్రమించుచు కొంతకాలమునకు పరాక్రమకేతుని పట్టమును జేరబోయెను. పరాక్రమకేతుఁడు, జనకునకు స్వాగతమీయ నెదురుగాజని పట్టములోనికి గొనివచ్చి సమస్తోపచారముల గావించెను. వసంతుఁడు జయప్రదునితోనుండి యావింతలన్నియును దిలకించి, ఆహా! యిదేమి నాయుపవనమున నెట్టి చిత్రవిచిత్రములుండెనో యాచిత్రములన్నియు నిటనున్నవి. కారణమేమైయుండును. అదే ఆసౌధమే నాశయనసౌధమును బోలియున్నది. అదే ఆసౌధమున కెదురుగనున్న జలయంత్రమునందే ప్రసూనరాజమునుంపబడినది. ఆపుష్పమునకు మారు వేరొకపూలమొక్క యమర్పబడియుండుట తక్క యాకారమునందును, పరిమాణమునందును భేదమిసుమంతయు

ను గాన్పింపదేయని తలపోయుచుండెను. పరాక్రమకేతుండు జనకుని కావింతలన్నియును జూపిన యనంతరము విందుగావించెను. జయప్రదుడు మున్నెన్నడును రుచిచూచియెఱుంగని వింతపదార్థములదిని వాని మాధుర్యమునకు సంతసించుచుండెను. ఆసమయమున పరాక్రమకేతువు రాకుమారులు నలువురిని జూచి వీరెవ్వరని ప్రశ్నించెను. జయప్రదు డాతండు తనకుమారులనియు వారు గులాబిపువ్వును సాధించుకొనివచ్చిరనియు జెప్పెను. అంత పరాక్రమకేతుడు జనకుని పాదముల వ్రాలి తన్నాతని కెఱిగించుకొని జనకా! మీరు విస్మృతించిన మీ యేనవకుమారుడను. తమ యాశీర్వచనమున నిప్పటికి క్షేమముగా నుంటినని పల్కి మీకోడండ్రు తమ యాశీర్వచనము బడయుటకు వచ్చుచున్నారని పల్కి సన్నగావించెను. మరకతమణి చనుదెంచి జయప్రదునకు నమస్కరించెను. కాని తిలదవతి వెలికరుదెంచి నలువురు రాకుమారులను చూచి, లోనికేగి, నాకు తొల్లి దాసులైనవారి యెదుటకు రాజాలను. వారి నావలకు బోవలసినదని యాజ్ఞాపింపుడనియెను. ఆపలుకులాలించి జయప్రదుడు వెఱగుపడుచుండగా రాకుమారులు నలువురును విన్ననగు మొగంబులతో నావలికేగిరి. వారావలికేగిన తరువాత తిలదవతి ప్రవేశించి జయప్రదునకు నమస్కరించెను. జయప్రదుడామె నాశీర్వదించి తరుణీ! నాకుమారులు నల్వురును నీకు దాసులైనట్లు పల్కితివే కారణమేమి? సవిస్తరముగా దెలుపుమన నామె మరల యాతనికి నమస్కరించి యిట్లనియెను.

రాజా! తమ కుమారులు నలువురును నాచే జూదమున జయింపబడిరి. పిదప వీరలను నాచెరసాలలోనుంచి యొకటిరెండు మాసముల క్రిందటనే విడచిపుచ్చితిని. అదియును మీయాకుమారుని నిర్బంధముననే విడచితిని. ఆ బకావళి ప్రసూనరాజమును కొనివచ్చిన మీకుమారుం డన్నలమీద దయగల్గి వారినిగూడ తనతోడ దీసికొని

మమ్ముల వెంటబెట్టుకొని వచ్చుచుండగా వారితని మోసగించి పుష్పమును గ్రహించి యాతని వధింప సమకట్టిరని జెప్పి నిదర్శనముగా వారి పీపులపై తన నామాక్షరములు ముద్రవేయబడి యుండునని జెప్పెను. భూపాలు డెంతయును సంతసించి కుమారకా! నిక్కువ మిప్పటికి బోధపడియెను. నీవెట్లా ప్రసూనమును గొనివచ్చితివో జెప్పుమని వాతం డఘటితను మనంబున దలంచెను. తోడనే యామె యొక పెద్ద ధ్వని చేయుచువచ్చెను. భూపాలుం డాభూతమునుగాంచి నెఱిగొంది చేష్టలు దక్కియుండెను. పరాక్రమకేతు డాతని సేద దేర్చినపిదప భూతమువలన సంగతులన్నియు సవిస్తరముగా నెఱింగి తన జ్యేష్ట కుమారుల దండింప నిచ్ఛగింపక వారిని పురము వదలిపొండని శాసించెను. వసంతుడా సంగతులన్నియు విని పరాక్రమకేతుని దిలకించి యాతని యందు బద్ధానురాగియై యాతని నెట్టైనను దన సౌధమునకు రప్పించుకొననెంచి జయప్రదునితో నీదో యొక సాకుజెప్పి వెడలిపోయెను. జయప్రదుఁడు కొన్నిదినములవఱకును పరాక్రమ కేతునితో గడపి పిమ్మట నాతనితోగూడ నేగి తనభార్య కాతని జూపి యామె సంతోషసాగరమున నోలలాడునట్లు చేసెను.

ఇది ప్రథమఖండము

---

# గులోబకావలి

## ద్వితీయ ఖండము

### గులోబకావలి పరాక్రమకేతుని తనవిద్దకు రప్పించుకొనుట

గులోబకావలి జయప్రదునికడ సెలవొంది తన మనోహరుని కనుగొంటిని కదాయను సంతసంబునను, తన యనుచరులే తన్ను మోసగించి యాతనికి ప్రసూనమొసంగిరను విచారముతోడను, తన కా నవమోహనాకారుడు లభించునాయను సంశయభరంబుతోడను, నిరంతరప్రయాణమొనర్చి యెట్టులో తనయుపవనమును చేరబోయెను. ఆమె చిరకాలమునుండి ఇంట లేకుండుటచే తత్తరపడుచు చింతాక్రాంతులైయున్న యామె తల్లిదండ్రులు బకావలిని చూచినతోడనే సంతోషభరితులై అమ్మా! ఇంతకాల మెక్కడి కరిగియుంటివని ప్రశ్నించిరి. అంత నామె తన మనోగతమును మరుగుపరచి జననీ జనకులారా! దేశసంచార మొనరింపవలయుననిబయలు దేరితిని. పెక్కులగు దేశములగాంచి వచ్చితినని వారిని నమ్మించెను.

తదుపరి యామె తన సౌధముననేగి యఘటితచరితను బిలువ నంపెను. ఆమెవచ్చునంతకు తనచేతనున్న పరాక్రమకేతుని యంగుళీయకమునుదీసికొని యాయంగుళీయకమునే ముద్దిడుకొనుచు నేమేమో తలపోయుచుండెను. అఘటితచరిత సమీపించినతోడనే యామె ఓసీ! దుర్మార్గురాలా! నాసొమ్ము దినుచు నాకే మోసము తలపెట్టితివా నీయల్లునకు ప్రసూనరాజము నర్పించి యేమియు నెఱుంగని నంగనాచి

వలె కూరుచుంటివా? తక్షణమే యాతని దీసికొనివచ్చి నాకర్పింప కుంటివా నీమేన ప్రాణములు నిలువవని నమ్ముము తత్క్షణమే బయలుదేరి పొమ్ము. అని పల్కెను. అఘటితచరిత యామె పలుకులను బట్టియు నామె పరాక్రమకేతుని ముద్దుటుంగరమును పలుమారు ముద్దిడుకొను చుండుటను బట్టియు నామె యాతనియందు బద్ధానురాగయై యున్నట్లు తెలిసికొని అమ్మా! తమకు నాపై నాగ్రహమేల! క్షణములో నాతని గొనితెత్తును. పుష్పము నాతఁడు సంగ్రహించుకొని పోయినట్లు మొదట నాకు తెలియదయ్యెను. లేకున్న పోనిచ్చియుందునా? అని యామె మదికెక్కునట్లుగా బలికి యచ్చోటవాసి చనియెను.

గులోబకావలియు యఘటితచరిత యాతని గొనివచ్చునా? గొనిరాక నాతఁడు రానని పల్కెనని తిరిగివచ్చునా? పెట్టుపోతల నాశించువారె గాని యల్లుండ్రవసరము దీర్పవచ్చెదరా! కల్ల ఏమో! ఆతనికిగూడ నాయందనురాగమున్నట్లే దోచుచున్నది. లేని నాడిట్లుంగరములను మార్చియుండడు. అఘటితచరిత తనతో రావల సినదని కోరినంతనే బయలుదేరి నాచెంత కరుదెంచునని వితర్కించుచు కాలమును గడపుచుండెను.

అఘటితచరితయు పరాక్రమకేతుని చెంతకు బోయి ఓయీ కుమారా! బకావలి నిన్ను వలచియున్నది. మిక్కుటమగు విరహ వేదనజెంది నిన్ను దోడ్కొని రావలసినదని నన్ను బుత్తెంచినది. కావున తక్షణమే బయలుదేరి రమ్మనియెను పరాక్రమకేతుఁడును యేయంతరాయమును లేకుండ గులోబకావలి వనమునకరిగెను.

బకావలి యాతనిగాంచి కొంతతడవట్టె నిలువంబడి పిమ్మట స్మృతిదెచ్చుకొని అయ్యా! తమరు భూపాలురు. న్యాయవర్తనులరు. ధర్మసంరక్షణ తత్పరమతులు కావున న్యాయము దయచేయవలెను. నాయుపవనమును ప్రవేశించి నాకెఱుక లేకుండ నాప్రసూనమును

కొనిపోవుటయేగాక నాకన్యకాత్వమునకుగూడ భంగము గల్గిం
చిన యాచోరున కెట్టిశిక్ష విధింపవలయునో తమవలన తెలిసికొన
గోరి రప్పించితిని. సెలవీయ వేడెదననియెను. ఆపల్కు లాలించి
చిఱునవ్వున యాభూవరకుమారుం డామె కిట్లనియె బాలా! ఇందు
న్యాయమున కేమున్నది. ఆతఁడు నీయెడ నపచార మాచరించి
యుండుటచే నాత డవశ్యము శిక్షార్హుఁడే. కాని ఇచ్చటనే ధర్మ
సూక్ష్మమున్నది. అద్దాని ననుసరించి నీపోషణభార మాతని తలపై
నైచి యాతనిని నీకటాక్షమాలికలచే బంధించి యిచ్చవచ్చిన ట్లేలు
కొనుచుండుము. అంతకంటె నాతనికి విధింపవలసినది గాన్పింపదని
యెను. ఆపల్కు లాలించి చిఱునగవున అయ్యా! ఇదెక్కడి న్యాయ
మని పలుకుచుండి నఘటితచరిత ప్రవేశించి కుర్రా! ఏల బింకములు
చూపెదవు. ఇరువురును హాయిగా కాలయాపనముసేయక వృథా
జాగొనర్చెద రేల? అని మందలించుచు బకావలి నాతని సమీపము
నకు దెచ్చి అయ్యా! ముగ్ధయగు నీబాలామణి నెట్లేలుకొనెదో
కడుంగడుముగ్ధ అని యాతనిచేత నామె చేయనిడి తానవలకు బోయె.

బకావలీ పరాక్రమకేతు లిరువురును పరస్పరాలింగన మాచ
రించుకొని పెన్నిధినిగాంచిన పేదలవలె పారవశ్యము జెందిరి. నాడు
మొదలు వారిరువురును యాయుపవనంబున ద్రిమ్మరుచు వివిధభోగ
ముల ననుభవించుచు కాలము గడపుచుండిరి. ఇట్లు కొన్నిదినములు
గడచి చనినయనంతరము బకావలి చెలికత్తెలలో గొందఱు ఆమె
యొక మానవమాత్రున కధీనురాలై యుండుట సహింపజాలక
బకావలి తల్లియగు కాలఘటితయొద్దకు బోయి బకావలియొక్క
గోప్యవర్తనమంతయును నామె కెఱుకపరచిరి. కాలఘటితయు చెప్పు
డుమాటలు విని నమ్ము స్వభావముకలది కాకపోవుటచే స్వయముగా
నామె సౌధమున కరిగి పరీక్షింపనెంచెను.

ఈసంగతి యఘటితచరిత గుఱించి పరాక్రమకేతుని యొక సురక్షితస్థానమునకు జేర్చి బకావలితో నోయమ్మా! నీతల్లికి నీపై ననుమానముగల్గి నిన్ను పరీక్షింపనెంచి నేడిచ్చటికి కరుదెంచుచున్నది. ధైర్యమూనియుండుమా యని సకలమును దెలియపరచెను. కాలఘటిత చనుదెంచి కూతుఁజూచి యామె ముఖలక్షణమువలన చెలికత్తెల పల్కులు యదార్థములని గ్రహించి యేమియు నెఱుంగని పోలిక మిన్నకుండెను. నాటిరాత్రి బకావలి తల్లిచెంత శయనించెను. కాని ప్రియవిశ్లేషముచే నిద్దురబట్టక తల్లి బాగుగా నిద్రించిన తరువాత మంచముపైనుండి లేచి తాను పఱున్నరీతిగా నగపడుటకై యొకదిండును పాన్పుపై బెట్టి యుపవనమున తనకై నిరీక్షించియున్న పరాక్రమకేతుని గలసి యాతనితో పెద్దయుం బ్రొద్దుసుఖించి యలసి యా పొదరింటిలోననే నిదురించెను. అతడును ప్రియురాలినిబాసి పోనేరక యందేపరుండి నిద్రించెను.

కొంతరాత్రియైన తరువాత కాలఘటిత మేల్కాంచి కుమార్తె శయనతలమును పరీక్షింపనం దామె కాన్పింపమిచే దిగులొంది యామె యెచ్చటికేగి యుండునాయని యించుకతడ వాలోచించి నలువురు నమ్మకమైన పరిచారికలను పిలచి బకావలిని యుపవనంబున వెతకి రమ్మని పంపెను. మరికొందరిని సౌధోపరిభాగమంతయు నన్వేషింప బంపెను. తానును యామె యుపవనంబులో తప్పక యుండగలదని తలంచి యుద్యానవనమునకు పోయి యొక్కొక్క నికుంజమునే యన్వేషించుచుండెను.

కాలఘటిత ఎట్టకేలకు పరాక్రమకేతుని యంకమున శిరమిడి నిద్రవోవుచున్న బకావలిని గాంచెను,

## తిలదవతి విచారము మరకతమణి యూరడించుట

పరాక్రమకేతుఁడు తిలదవతీ మరకతమణుల నింట దిగవిడచి యఘటితచరిత వెంట బకావలి యుద్యానవనమున కేగెను, ఇట తిలదవతి ప్రియునితో తిడుగ యెడబాటు గల్గినది గదాయని విచారించుచుండెను. ఆమె నింకొక్క విషయముకూడ కొందలపడసాగెను. పరాక్రమకేతు డనేక భూతములచే రక్షింపబడుచున్న బకావలి యుద్యానవనమున కేగియుండెను. అతఁడు దన వెంట సైన్యమును గొనిపోవకుండుటచే నా భూతములవల నాతని కేమైన నపాయము గలిగెనేమోయను విషయ మామెను మిక్కుటముగా బాధింపసాగెను. అనవరత మామె తనభర్త సౌఖ్యముగ నిలుసేరవలయునని నిత్యమును దైవమును ప్రార్థించుచుండెను. పరమేశ్వరప్రీతికై యనేకములగు వ్రతములను దానములును సలుపుచుండెను.

మరకతమణి యొక్కనాఁ డామెతో సంభాషించుచు నక్కా! నీ వేలనో విచారముతో నుంటివని దోఁచుచున్నది. నిక్కముగా నట్లుంటివా? లేక నాకేయట్లు దోఁచుచుంటినో తెలుపుమని ప్రశ్నించెను. తిలదవతి తనమనంబున గలవిచార మామెకడ దాపరిక మొనరింపక సర్వమును దెలిపెను. అంత మరకతమణి అక్కా! నీవుట్టిగోలవుసుమీ! అపాయముతో గూడియున్న స్థలమని శంకించుచుంటివా? ఆస్థలమున కిదివరకొకమారు పోయియుండలేదా? పైగా నిపుడు పోవుటలో నొక విశేషమున్నది. బకావలి యాతని వరించియున్నది. కావుననే నాజనయిత్రి యాతనిని దన వెంట గొనిపోయియుండెను. లేనియెడల నట్లు గొనిపోవునా? అతని కెవ్విధమగు నపాయమున గలుగకుండ నాతల్లి రక్షించుచుండును. ఇందునుగూర్చి నీవు లేనిపోని విచారమును నీమనసునందుంచుకొనకుము. అతఁడు బకావలిని విధివిధానంబున పరిణయమాడి కొలది దినములలోననే యాతఁ డిచ్చటికి రాగలఁడు అని యూరడించి యామెకు తొలుతటిపర్యాయ మాతఁడు గులోబీపువ్వును

సంపాదించుట కేగిన విధంబును యాతండు మరలివచ్చుటకు తాను పడిన సంతాపమును యాతడు సురక్షితముగా మరలివచ్చి యావన మందలి విచిత్రములన్నియు దనకుఁ దెలియబరచుటయు జెప్పి యామె ను సంతసింపఁజేసెను.

తిలదవతి మఱల యామె కిట్లనియెను. అక్కా! నీజనయిత్రి నాథుని సంరక్షించుచుండ నాతడు సురక్షితముగా నుండుట కేమియు సందియముండదు గాని బకావలి చెలికత్తెలు యామె ప్రవర్తనమును దెలిసికొని యామె తల్లిదండ్రుల కెఱింగింపరా? వారల కీవృత్తాంత మొకింత దెలిసిన నాపద సంభవించుటన నెంత కావున నామది యింకను సంశయించుచునే యుండెను. కావున నీవు నీతల్లి నొకసారి రప్పించి యామెవలన నాతనిక్షేమ మరయుట మేలని దోచుచున్న దనియెను. మరకత మందుల కంగీకరించి దన జనయిత్రి యొసంగిన తలవెండ్రుకలను నిప్పుపైనిగాల్చెను. తోడనే యఘటితచరిత ప్రత్య క్షమయ్యెను. మరకతమణి యామెకు నమస్కరించి తల్లీ! నాథుఁడు మమ్ములవిడచి చాలదినములైనది. అతఁ డెక్కడనుండెనో యేమి సేయుచుండెనో సురక్షితుఁడై మమ్ముల నెపుడేని తలంచుచుండెనో లేదో దెలియగోరియుంటిమి అని పల్కెను. అఘటితచరిత కుమారీ! ఆతడు బకావలితో గలసి నిరంతరసౌఖ్యముల దేలుచున్నాడు. ఆతని కెట్టికొరంతయు కలుగకూడదని తలంతును. సురక్షితముగా నాతఁడు కొలఁది దినములలో నిచ్చటి కరుదెంచునని తలంతును అని పల్కి కుమార్తె నాశీర్వదించి వెడలిపోయెను.

తిలదవతీ మరకతమణులు దమ విభుడు సుఖస్థుఁడైయున్నాడని సంతోషించిరి.

## కాలఘటికచే పరాక్రమకేతుని సముద్రములో బడునట్లు విసరివైచుట

కాలఘటికచే పరాక్రమకేతుని గాంచినతోడనే మితిమీరిన కోపంబున నాతని చెట్టవట్టుకొని యెత్తి నడిసముద్రమున బడునట్లు విసరివైచెను. బకావలి తత్తరపడి లేచెను. ఆమె బకావలిపై మండి పడుచు ఓసీ! దుర్మార్గురాలా! కులమునకెల్ల చెడపుట్టితివిగదే! నీవుట్టు కబుద్ధిగాను భూతకులంబులజనియించి యొకమానవునిపొందుగూడితివా అగౌరవప్రదమైన యిక్కార్యమున కొడిగట్ట నేలసాహసించితివి అని తిట్టుచునామెనులోనికిగొనిపోయి యచ్చటనుంపక తనతోగూడ విభుని యొద్దకు గొనిపోయెను. అతడును కుమార్తె మానవుని వరింపరాదని పెక్కువిధముల బోధించియు విఫలమనోరథుడై చేయునదిలేక కులగౌరవముల నిలువబెట్టుకొనుటకై యామెను చెఱలోనుంచెను అట పరాక్రమకేతుడు సముద్రమున పడినతోడనే స్మృతితెచ్చుకొని జరిగినదానికి విచారించుచు దవ్వుల గాన్పించుచున్న యొడ్డుచేరుకొనవలయునని యీదుకొట్టుచు నాదిక్కునకు బోవుచుండెను. దైవబలముకూడ దోడుపడిన పురుషకారమక్కరకువచ్చునుగదా? అట్లాతడు యత్నించుచుండగా రెండుమూడు కెరటము లాతని సమీపముననేపడి విరుగుటచే నాతడు యొడ్డునకు సుఖాయాసముతో చేరెను. ఆతడాసముద్రతీరమున చాలవఱకు కూర్చుండి యాయాసమునుతీర్చుకొని తానెట్టి స్థలమునకు జేరుకొనియుండెనో చూడవలయునని లేచి మెల్లననడుగులిడుచు నొకమార్గము ననుసరించిపోవుచు పెక్కులగు విచిత్రములను గాంచెను. కొన్నిచెట్లు మనుష్యుని తలవంటికాయలుగల్గి యాతనిచూచిన తోడనే పకపకనవ్వి క్రిందబడెను. కాని మరల యొకటిరెండు నిముషములలో నా పండ్లన్నియును పైకెగిరి చెట్టునకు మరల యంటుకొనిపోయెను. ఆతడు [illegible] యొక ఫలమునుదీసి కోయగా

నందు రెండు గ్రద్దలుండి చివాలున లేచి యారెండును గగనతలమున కెగిరిపోయెను. ఇట్టి యనేకములగు వింతసంఘటనములు గలుగుటచే నయ్యది నివాసయోగ్యము గాదని తలంచి కొన్ని యెండుపుల్లలను ప్రోవుజేసి యొక నిడుపైన యాకులచే నాపుల్లలను కట్టగా కట్టుకొని సముద్రమున పడవైచి యా మోపుపై నెక్కి పరాత్పరునిపై భారము వైచి యీదుకొనుచు ముందునకు బోవుచుండెను.

అట్లాతడా కట్టెలమోపు నాధారముగాగొని యాకలి బాధచే నవయుచు దప్పిక నోర్వజాలక శ్రమనొందుచు కొన్నిదినములు ప్రయాణము గావించి వేరొక ద్వీపమును చేరుకొనియెను. అతడా ద్వీపమును ప్రవేశించి కొన్ని ఫలములను భక్షించి కొండవాగులనుండి దప్పికదీర్చుకొని యొక బండరాతిపై గూరుచుండి, ఆహా! ఎంతటి దురవస్థ వచ్చెను. దీపమునుగాంచి ఫలమని భ్రమించి సమీపించి చెడుశలభంబుగతి గతైనే యేమిచేయుదును. క్షణమైన నెడబాసి యుండుట కిచ్చగింపని నా లతాంగి బకావలి మద్వియోగమున నెంతగా కుందుచుండెనోగదా? ఆహా! అట్టి త్రిజగన్మోహినిని మరల చూచుభాగ్య మింకెన్నటికైన నాకు లభించునా? దైవమా! నేల నన్నిట్టి యిడుములపాలు జేసి పరీక్షించుచుంటివో గదాయని పరిపరి విధంబుల విచారించుచు సూర్యాస్తమయమాటచే క్రూరజంతువుల బారినుండి తప్పించుకొనవలయునని యొక చెట్టుపైకెక్కి కూరుచుండెను.

## పరాక్రమకేతునకు దివ్యమణి లభించినవిధము

కొంత రాత్రియైన పిమ్మట నొకసర్ప మాతడున్న మహీరుహాముచెంత కరుదెంచెను. ఆసర్పము ఆవృక్షమున కించుక సమీపమున నాగి యొకమణిని తన నోటనుండి క్రక్కెను. ఆమణిని కోటి సూర్యు లుదయించినట్లుగా ప్రకాశించుచుండెను. ఆ ప్రకాశమును

గాంచి నయ్యారణ్యములోనున్న జంతువు లన్నియును కలగుండుపడి [illegible] [illegible] భక్షించెను. తదుపరి యాసర్పము మణిని సమీపించి దానిని నురల [illegible] వెడలిపోయెను.

పరాక్రమకేతుఁ డామణి నెట్టులైనను సంపాదింప కృతనిశ్చయుడై సూర్యోదయమైనపిమ్మట సముద్రతీరమునకుపోయి జింక మన్నును నీట నానబెట్టి పిసికి యొక గుమ్మడికాయంత ముద్దను సిద్ధపరచి యాముద్దను గతదినంబున తా నారోహించియున్న చెట్టుపైకి గొంపోయి జాగ్రత్తగా నొకచోనుంచెను. అతఁడా దినమున కొన్ని ఫలములను భుజించి సెలయేళ్ళనుండి జలమును గ్రహించి దప్పిక దీర్చుకొని యందందు దిరుగుచు దినాంతము వఱకును కాలయాపన మొనరించి సాయంకాలమైనతోడనే దాను మట్టిని జాగ్రత్తపఱచిన వృక్షమునుగురుతుచూచుకొనియద్దానిపై కెక్కి కూరుచుండెను. కొంత రాత్రియైన తరువాత సర్పమరుదెంచి యెప్పటియట్లు మాణిక్యమును వెలికిగ్రక్కి యొకించుక దూరమునకరిగెను. పరాక్రమకేతు డయ్యది దిలకించి తాను జాగ్రత్తపఱచియుంచిన బంకమట్టిముద్దను నేర్పుతో యామాణిక్యముపై బడునట్లువిసరెను. మట్టిపడుటతోడనేమాణిక్యము యొక్క కాంతులంతరించెను. సర్పమామాణిక్యముయొక్క కాంతులు లేకుండుట చూచి తన కవసానకాల మాసన్నమైనదిగా భావించి శిరమును నేలపై గొట్టుకొని మరణించెను. తదనంతరము పరాక్రమకేతుడు చెట్టుపైనుండి క్రిందకుదిగి మట్టినిపిసికి మాణిక్యమును వెదకి శుభ్రముగా కడగి తనతోడ చీరి యందామాణిక్యమును నుంచి కట్టివైచుకొనియెను.

## పరాక్రమకేతుడు సర్వార్థసిద్ధియను వృక్షమును జేరుట

తదనంతరము పరాక్రమకేతుఁ పగలెల్ల నొకదిక్కుగా నడచుచు రాత్రుల చెట్లయందు విశ్రమించుచు కాలముగడపుచు నొక్కనాఁ డొక మహీరుహమెక్కి తన యవస్థను దలపోసి విచారించుచుండగా చెట్టుపైనున్న పక్షులు రెండు ఈక్రింది విధముగా సంభాషించుకొనుచుండెను.

పిల్లపక్షి—జననీ! మాకు లోకమున గల వింతలను గూర్చి చాలమారులు చెప్పితివి. కాని యొక్కనాఁడైనను యీయడవిని గలుగు వింతలను జెప్పవైతివి. కావున మాకోర్కె నేడు దీర్పుము.

తల్లిపక్షి—కుమారా! లోకములో నెన్నివింతలున్నను యీయరణ్యమున గల వింతను మించినవికావు. అయ్యది దెలిపెదనుసావధానమనస్కుడవై యాలింపుము.

అని యాపక్షి పల్కుచుండెను. పరాక్రమకేతుడును యావింతయేమో తెలిసికొనిన యెడల తానచ్చటనుండి తప్పించుకొనిపోవుట కనువగు మార్గము లభించునేమోయను తలంపుతో శ్రద్ధాళుఁడైయాపక్షి వాక్యముల నాలించుచుండెను.

కుమారా! ఇచ్చటికి మూడుయోజనముల దూరమున నుత్తరమున నొక గుంట గలదు. ఆసమీపముననే యొక గొప్ప ద్రవ్యనిధి పూడ్చిపెట్టబడి యున్నది. ఆగుంట సమీపమున నొకపెద్దవృక్షము కలదు. అద్దానిని సర్వార్థసిద్ధి యని చెప్పుదురు. ఆవృక్షము యొక్క చర్మములతో నొక కుళ్ళాయినిచేసి ధరించిన వానికి లోకముననుండు నిధులన్నియు దృష్టిగోచరములగును. మరియు నాపురుషుఁ డితరుల కంటికి గాన్పింపబడు ఇతరుల వర్తనములన్నియు గనుగొనగలడుఅని చెప్పునంతకు కుమారుఁడు అమ్మా! ఆవృక్షము సమీపించుట కెట్లు

పిలగును. ఇదివర కెవ్వారేని యత్నుగావించి నిధులను వడసినవారు న్నారాయని ప్రశ్నించెను. అందులకా తల్లిపక్షి యిట్లని చెప్ప నారంభించెను.

కుమారా! ఆమహీరుహమును జేరవడుగుట యెట్టివానికిని సాధ్యముకాదు. ఏలయందువా? ఆవృక్షమున నొక సర్పము సర్వకాల సర్వావస్థలయందు కాచికొనియున్నది. ఆపాము కత్తిదెబ్బలచేగాని కర్రదెబ్బలచేగాని చావదు. దానిని సంహరించునట్టి సామర్థ్యమెవ్వరి కిని లేదు. ఇంతవఱ కావృక్షమును సమీపించిన వారెవ్వరును లేరు. అని పల్కెను. కుమారుఁడమ్మా! ఆవృక్షమును జేరుటకు సాధనము కూడ నెఱింగింపవే యని పల్కెను. ఆపల్కులకు తల్లిపక్షి మరల యిట్లు చెప్పనారంభించెను. కుమారా! శ్రద్ధతో వినుము. ఆవృక్షము ను జేరనెంచువాఁ డావృక్షము సమీపమునకు బోవ యత్నించునంత యాసర్పము వానిపై బడును. అందులకు వాడు వెఱగొందక యాసమీ పముననున్న గుంటలో దుముకవలయును. తోడనే యాతని రూపము మారి కాకిరూపము ధరించును. అప్పటికిని ధైర్యము విడువక యా చెట్టుపై కెగిరి తూర్పుముఖముగాపోయి తూర్పుతట్టున నున్నకొమ్మపై గూరుచుండవలయును. దానిపైగల మిక్కిలి మనోహరమైన పం డొకటి గలదు. ఆపండును భక్షించినతోడనే ఆతనికి తొలిరూపము గలుగును వాడు ఆకొమ్మపై స్థిరముగా కూర్చుండి కుళ్ళాయిని తయా రుచేసి నెత్తిపై ధరించుకొనవలయును. తదనంతరము ఆకొమ్మనున్న పచ్చని పండొకటి కోసి నడుమునకు కట్టుకొనిన యెడల ఆకాశమున కెగిరిపోగల శక్తి గలదు. మరియు నింకొకవిశేషముగల దాకర్ణింపుము దాని యాకులను నూరిపైచినయెడల యెట్టిగాయమైనను ఎట్టివ్రణమై నను నిముషములో మానిపోవును. ఆవృక్షముయొక్క కొమ్మను గోసి చేత ధరించువానికి యెల్లరును సులభముగా జయింపబడుదురు.

ఆకొమ్మవలన నెట్టి యినుపపెట్టెలనైనను సులభముగా తెరువ వచ్చును. అయ్యది సాధించినవానికి సాధింపరాని కార్యము లుండవు అని చెప్పి కుమారుని నిద్రబుచ్చి తల్లిపక్షికూడ నిదురబోయెను.

పరాక్రమకేతు డాపలుకుల నన్నియు తలపోసికొనుచు యా నిశాశేషమును వేగించి సూర్యోదయమైనతోడనే కాలకృత్యములను దీర్చుకొని అధికోత్సాహంబున నుత్తరాభిముఖుండై మూడు యోజనముల దూరమును మూడునిముషములలో చనియెను. అచ్చట గల గుంటను, దానియొడ్డున గల వృక్షమును, వృక్షమును చుట్టుకొని సంరక్షించుచున్న సర్పమును దిలకించి పక్షిపలికిన పలుకులన్నియు నిక్కువము లే యని తలంచి వృక్షమును సమీపింపబోయెను. అంతట ఆసర్పము ఆతనిపై నురికెను. పరాక్రమకేతుడును వెరువక గుంటలో నురికి కాకి రూపమును బొందెను. తదుపరి యాతడు పక్షి యెరిగించిన రీతిని తూరుపుకొమ్మపై కరిగి కూరుచుండి తన తొంటిరూపమును దాల్చి కుళ్ళాయిని చేసికొని ధరించి పక్షి చెప్పిన వస్తువుల నన్నింటిని సంగ్రహించుకొని ఆకాశగమనమున పోవుచు నొకపట్టణమునుగాంచి యచ్చటదిగి పట్టణమునకు బోవుటకై యొక మార్గము ననుసరించి నడువ నారంభించెను.

## పరాక్రమకేతుడు స్త్రీరూపము ధరించుట, తిరిగి పురుషుడగుట

అట్లు పోవుచు నొకచో బంగారు వికారమైన సోపానములతో నలరారుచున్న యొక తటాకమును జూచి దప్పికొని యున్నవాడగుట చేత తనవస్తువుల నొక్కచో భద్రపఱచి యాతటాకములోస్నానము చేసెను. తోడనే యాతడు స్త్రీరూపమును బొందెను. ఆతడందులకు లజ్జించి యిపుడేమిచేయగలనని దుఃఖించుచు యా తటాకపుతీరమున

గూరుచుండెను. ఇంతలో నొక బాటసారి యామార్గమున బోవుచు నయామెను జూచి మోహించి మిక్కిలి దీనుఁడై యామెను ప్రార్థించి సమ్మతింపజేసి యామెతో కామోదభోగంబులను దేలుచు ఆయరణ్యమునసే కాలమును గడుపుచుండెను. అనంతరము కొన్ని దినములకు స్త్రీరూపముననున్న పరాక్రమకేతుఁడు గర్భమును ధరించి నవమాసమ్పూర్తియైన పిమ్మట నొక చక్కని మగబిడ్డను గనియెను. కాని ఆతడనుదినమును తన పురుషరూపము పోయినందుకు వగచుచు ద్రిమ్మరుచు మరల నొక్కనాడు యదృష్టవశమున ఆతటాకమునందే స్నానము చేసెను. ఆతని స్త్రీరూపము నశించి యొక కిరాతనాయకుని రూపమును ధరించెను. అతి డందులకు వింతనందుచు సమీపమున దిరుగుచుండగా నొక కిరాతస్త్రీ యాతనిచెంత కరుదెంచి ఓరీ! మగడా! మమ్ముల నిట్లాకలితో చచ్చుటకు విడచి యెచ్చటికేగి యుంటివి. లెమ్ము ఈగొడ్డలి చేకొనిపోయి కట్టెలను గొట్టితెచ్చి పురమున విక్రయించివలసిన బియ్యము మొదలైనవి తీసికొనిరావలసినదని బలవంతపరచెను. ఆతడామెను వదలించుకొనుటకై ఎక్కువగా ప్రయత్నించియు సఫలమనోరథుఁడు కాలేమికి చింతించుచు యాగొడ్డలిని గైకొని యరణ్యమున కేగి కట్టెలను గొట్టి శ్రమజెంది సమీపముననున్న మరియొక సరోవరమున స్నానముచేసెను. తోడనే యాతడు వెనుకటి రూపమును బొందెను.

పరాక్రమకేతుఁడు నిజరూపమును బొంది ఇంతవరకు నడచిన తన చరిత్రమును దలచుకొని వింతపడుచు తాను తొల్లిస్నానము చేసిన తటాకమును వెదకికొనుచు పోయి యెట్టకేలకు దానిని గనుఁగొని తన వస్తువు లచ్చటనే యుండుట జూచి సంతసించి వానిని గైకొని యొక మార్గము ననుసరించి పోవుచుండెను.

## పరాక్రమకేతుఁడు రూపావతిని సందర్శించుట

ఆతఁడాకాశగమనమున నడుగుచు నొక్కచో నొక్క పెద్ద పర్వతమును జూచి యాపర్వత శిఖరముపైని నవరత్నఖచితమైన ప్రాసాద మొండుట గని అందు కొండొకసేపు విశ్రమింపదలంచి యందు దిగెను. ఆభవనమున బ్రవేశించి శోధింపగా ప్రాణియుతం బైన జీవజంతు వొకటియు కాన్పింపమి వెరగుపడుచు అంతర్భవన మునకేగి రంభాద్యప్సరః కామినీజనంబుల ధిక్కరించు సోయగంబు గల నొక చక్కని చిన్నదానిని జూచి యామెను సమీపించి యిట్లని యెను. ఓలతాతన్వీ! ఈనిర్జనవనంబుల నుండు ఈ ప్రాసాదమేమి? ఇందొక జీవజంతువైనను లేకుండుటేమి? నీవొంటరి విన్నవై యుండు టకు కారణమేమి? నీవేల యిచ్చట నొంటిగా నుంటివి? అని ప్రశ్నింప ఆమె యిట్లనియెను. దేవా! నన్నొక్క రాక్షసుఁడు బంధించి యిచ్చ టకు తీసికొనివచ్చి తనతో కామోపభోగములను తేలియాడుమని నిర్బంధించుచుండెను. ఆతడు చనుదెంచిన మీ కపాయము కలుగు నేమో కనుక త్వరితముగా నిచ్చటినుండి వెడలిపోవలసినదని తొందర పెట్టసాగెను. ఆతఁడును వెరగొందక ఓలతాంగీ! కష్టసమయమునందు చిక్కుకొని యున్న నిన్ను రక్షింపక వెడలిపోవుటకు మనస్కరింప కున్నది. రానిమ్ము వాడెంత బలశాలియో చూచి వానికి తగినట్లు బుద్ధిచెప్పి నిన్ను విడిపించెదను నీవేమియును భయపడవలసిన యగ త్యము లేదు. నీ వెట్లు యీరక్కసునకు చిక్కితివి. నీవృత్తాంతము సవిస్తరముగా దెల్పుమని ప్రశ్నించెను. ఆమె యాతనికి తన వృత్తాంత మిట్లు చెప్పదొడగెను.

అయ్యా! నాపినతల్లి కుమార్తెయైన బకావలి పరాక్రమకేతు డను రొయొక మానవాధీశ కుమారునివరించి యాతనితో కొంతకాలము సుఖించిన పిదప గల్గిన వియోగముచే మిక్కిలి వ్యధజెందుచున్నదని

విని ఆమెను చూడఁబోయితిని. దేవా! ఆమెపడు నవస్థ యిట్టిదని చెప్పుటకు నలవికాదు. జనకునిచే కరచరణంబులకు సంకెళ్ళు వేయబడి యుండుటచేత పరితపించుచు నిద్రాహారము లెఱుంగక తన మనోహరుని నామమే జైవనామముగా దలంచుచు నిముషమొక యుగముగాఁ గడపుచుండెను. అప్పటికిని జనకున కామెపై ననుగ్రహము కలుగదాయెను. ఆమెను యెట్లో యూరడించి నేను మాగృహమునకు దిరిగిపోవుచుండగా ఈరక్కసుడును నన్నుపట్టి బంధించి యిచ్చటకు దీసుకవచ్చినాడు. అని తన నామధేయాదుల నాతని కెఱింగించిన విని పరాక్రమకేతుడు యామెకు తన సంగతి నంతను యెరింగించి ఆమెను వెంటబెట్టుకొని వెలికడుదెంచి రాక్షసుని రాకకు నిరీక్షించుచుండిరి. ఇంతలో నారక్కసుడు బడుగుసన్యాసి రూపమును ధరించి పరాక్రమకేతుని గాంచి ఆకన్య నట విడిచి వెడలిపోవలసిన దనియును కానియెడల తనచే సులభముగా వధింపబడుదువనియు నని బెదరించెను. పరాక్రమకేతు డాతని మాటలకు ప్రత్యుత్తరమీయక అవక్రపరాక్రమంబున నాతని సులభముగా నోడించి ఆతని జుట్టుపట్టుకొని ఓయీ! ఇంకనైనను బుద్ధితెచ్చుకొని తిన్నగా మసలెదవా? లేకున్న నిన్ను సంహరింపవలయునా? యని ప్రశ్నించెను. ఆజడదారి యెట్లో తప్పించుకొని మాయాసంగర మొనరింప నారంభించెను. పరాక్రమకేతుఁడు వెరవక తనచేతికర్రతో నొక దెబ్బకొట్టి యాతనిని యమసదనమున కనిపెను.

### రూపావతితో పరాక్రమకేతుఁడు ఆమె తలిదండ్రుల యింటికి వచ్చుట

అట్లా రాక్షసుని నతిశ్రమంబున నిర్జించి రూపావతిని తనవెంట నిడుకొని ఆమె దారిచూపుచుండ నరిగి యరిగి ఆమె తలిదండ్రుల

యింటిసమీపమున నున్న ఉద్యానవనములో దిగిరి. ఆమె యాతనిని ఉద్యానవనములో నున్న సౌధమున విడియించి తాను మరల వచ్చు వరకు నచ్చటనే యుండవలసినదని ప్రార్థించి తాను తలిదండ్రులను గాంచుటకై వెడలెను.

రూపావతి తలిదండ్రులు ఆమెను గానక యింతవరకు అపారమైన దుఃఖమునుపొంది ఆకస్మికముగా ఆమెను పొడగాంచుటచే వచింపరానంత సంతోషమును బొంది, ఆమెను పలుమారు కౌగిలించుకొని ముద్దాడుచు కుమారీ! ఇంతవర కెచ్చటనుంటివి. మమ్మిట్లు దుఃఖానలంబున ద్రోసి అరుగుట నీకు పాడియే? యని ప్రశ్నించిన ఆమె తలిదండ్రులకు తన్ను సన్యాసిరూపముననున్న నొక రక్కసుడు గొనిపోవుటయుతనొక్క మానవుడుయారక్కసునితో పోరాడి రక్షించుట యుమున్నగువిషయములనువిశదీకరించి వారికి పరాక్రమకేతునిపై కనికరము గలుగునట్లు పెక్కువిధముల పరాక్రమకేతుని వర్ణనముతో తన సంభాషణము ముగించెను. ఆమె జనకుడు అట్టి సజ్జనపురుషుని వెంటగొనిరాక యూరకవచ్చితివా యని ప్రశ్నింప నామెయు జనకునకు ఆతని సహాయమువలననే తానింత త్వరితముగా వచ్చితిననియు నాతడు నిత్యసత్యసంపన్నుడనియు చెప్పి యాతని దోడ్కొనివచ్చి యుపవనంబున నున్న సౌధంబున విడియించితినని చెప్పెను ఆమె జనకుడు అమందానందమునొంది పరాక్రమకేతున కుచితస్వాగతమొసంగి తన సౌధమునకు గొనితెచ్చెను.

రూపావతి తన తల్లియొద్ద కరిగి యేకాంతమున నామెతో బకావలి పరాక్రమకేతుల పరస్పరానురాగము వర్ణించి వారిరువురకును త్వరలో వివాహము చేయకున్న త్వరలో యిరువురును పరస్పర వియోగమునచే మరణింతురని కూడ యెరింగించెను. ఆపల్కు లాలించి యామె యమ్మేదులకు దగిన యేర్పాటు గావింతుననియు నంతవర

కాతని రహస్యముగా నుంచి తగిన పల్కులచే ప్రోత్సహించుచుండ వలసినదనియు జెప్పెను,

ఆ మరునాడు రూపావతియు నామె జననియు బకావలిని చూచుటకు బయలుదేరి వెడలిరి. కాలఘటితయు వారికి స్వాగతమిచ్చి బకావలినిగూర్చి తనకుగల్గిన విచారమునంతయు వారికడ వెళ్ళబోసెను. రూపావతియు బకావలియొద్దకరిగి రహస్యముగా నామెతో పరాక్రమ కేతుడు సురక్షితుడై యున్నాడనియు, ఆతడే తన్ను రక్కసుని బారినుండి రక్షించెననియును ఆతని సాంగత్యమును బకావలికి గూర్చుటకే తామిప్పుడు వచ్చితిమనియు దెల్పి, మరియు నిట్లనియెను. నీవు మాతో వచ్చుటకు నీ జననియొక్క యనుజ్ఞను గొనవలసినది. నాతో వచ్చిన యెడల నిన్ను పరాక్రమకేతుని పజ్జచేర్చెదననియు వచించెను. రూపావతియు నామె జననియు గొన్నిదినంబు లటనుండి మరల తమపురమున కరుగుటకు బయలుదేరిరి. అంత బకావలియు రూపావతి జెప్పినటుల తల్లియొక్క యనుజ్ఞ గొనుటకై యామెను సమీపించి యామెకు నమస్కరించి జననీ! ఇన్నిదినములు రూపావతి యిచ్చట నుంచుటచే నామనోగత దుఃఖ మించుక మరుగుపడినది. ఇప్పుడొకసారి యామెతో బోయి కొన్ని దినంబులుండి మరలివచ్చెద నమజ్ఞ యొసంగవలసినదని ప్రార్థించెను. కుమార్తె యంత దీనముగా ప్రార్థించుటచే నిరాకరింపజాలక కాలఘటిత యందులకంగీకరించి తగిన సన్నాహము గావించి యామెను వారితో బంపించెను.

## బకావళీ పరాక్రమకేతుల పునస్సమాగమనము

బకావలీ రూపావతులును రూపావతి జననియు సురక్షితముగ ప్రయాణము సల్పి తమ గమ్యస్థానమును చేరుకొనిరి. రూపావతి బక

వలిని పరాక్రమ కేతుని చెంతకు గొనిపోయి యాతని కర్పించి మహా త్మా! నామానమున కెట్టిభంగమును గలుగకుండ రక్షించినందులకు కృతజ్ఞురాలనైన తమకు సమ్మోదములుఁగూర్చి నాయోపినకొలది యత్నించి యింతవఱకు కృతకృత్యురాలనైతినని పల్కి వెడలిపోయెను.

చిరవియోగ పరితప్తహృదయులగు నాదంపతు లిరువురును మెట్టి మహదానందమునందిరో వ్రాయుటకు కవుల కెవ్వరికిని శక్తిలే దనుట యత్త్యుక్తిగాదు వారిరువురును పరస్పరాలింగన మాచరించు కొని పారవశ్యముఁజెంది యట్లే పెద్దయుం బ్రొద్దుండిరి.

నాటినుండి కొన్ని దినంబులవరకు వారు సకలభోగంబులంది సుఖంబుగ గడపిరి తదుపరి కాలఘటిత వార్తబంపుటచే గులోబకా వలి స్వగృహమున కరుగవలసిన పరిస్థితులేర్పడియెను. అంత నామె పరాక్రమ కేతునియొద్దను. రూపావతియొద్దను, యామె జననియొద్దను. సెలవుగైకొని విచారముతో నరిగెను. కాని యామె మనంబు మాత్రము రథమేగుచుండ పతాకము వెనుక కేగునట్లె వడి వెనుక నున్న పరాక్రమ కేతుని చెంతకే పోవుచుండెను. పరాక్రమ కేతుడును యామెపైగల మోహముచే నామెవంకకే తన దృక్కుల బరపి జూచుచు యామె కనుబ్రేటును మరుగైనతోడనే విచారభరంబున శయ్యపైవ్రాలెను.

రూపావతి జనని రూపావతి వలన వారిరువురకును వియోగ సమయంబున గల్గిన విచారభరమంతయును నెఱింగి వారినెట్లైనను వివాహమగునట్లు చేయవలయునని సంకల్పించి యొకటిరెండు దినంబు లరిగిన పిమ్మట తన యభిప్రాయమును భూతరాజైన తన విభునకు జెప్పి యాతని నందుల కొడంబడు నట్లొనరించి యాతనితో గూడ బకావలియొక్క తండ్రియొద్ద కరిగిరి భూతరాజు బకావలి తండ్రితో బకావలియొక్క యవస్థనంతయు దెల్పి యామె యభీష్టము దీర్పకున్న

ముప్పుగల్గుననియు ఇంతవఱ కామెకు వివాహ మొనర్పకుండుట యాతని తప్పనియు వచించి యామె వరించిన యాతడును సామాన్యుడు కాడనియు, దివ్య సత్వసంపన్నుడనియును దెల్పి యాతని నెట్లో సమ్మతింపజేసి తన మాటల యథార్థము దెలుపుటకై యాతని గొనివత్తునని చెప్పి వెండియు నిట్లనియెను ఓయీ! మరచితివా! బకావలి జాతకము లిఖించిన దైవజ్ఞు లేమనిరో! యొకపరి యామె జాతకమును దెప్పించి చూడుమనియెను. తోడనే యాతడు స్మృతిదెచ్చుకొని తన యినుపమంచములోనుంచిన జాతకముదెప్పించి చూడగా నందు గుల్బపుష్పము హరించుకొని పోవగల పురుషుని యామె పెండ్లియాడునని వ్రాసియుండుటచే సంతోషభరితుడై యాతనికి తన కన్య నిచ్చుట కంగీకరించెను.

బకావలీ పరాక్రమకేతుల వివాహము

రూపావతితల్లియును కాలఘటితతో పరాక్రమకేతు డనన్యసామాన్యగుణధురీణుడనియును పరాక్రమవంతుడనియును. బకావలి కెల్లవిధముల తగినవాడనియును, జెప్పి యొప్పించెను. అంతట భూతరాజు పరాక్రమకేతుని రప్పించి వారికి జూపి మరల నిట్లనియెను. ఇంతకంటె చక్కనివానిని ఇంతకంటె పరాక్రమ విక్రముని ఇంతకంటె బలశాలిని ఇంతకంటె సజ్జనుని మూడులోకములు వెదకి చూచినను గొని రాజాలము అట్టి వానియందు కుమార్తె మనంబు నిలిచియున్నదని తెలిసి సంతోషమున వివాహము గావించుటకు మాఱుగా వానిని పెక్కులగు నిడుములకు లోనగునట్లు గావించిరి. ఇంకనైనను సత్వరమే వారికి యథావిధి వివాహము గావింపుడనియెను.

బకావలి తండ్రియు, కాలఘటితయు అల్లుని చూచి సంతుష్టులై వారిరువురకును యొక శుభముహూర్తమున నఖండవైభవంబున వివాహము గావించిరి.

గులోబకావలీ పరాక్రమకేతు లిరువురును సర్వసౌఖ్యము లనుభవించుచు కొన్నిదినంబులు గడపిరి. తదుపరి యొక్కనాడు పరాక్రమకేతుఁడు ప్రియురాలి కిట్లనియెను. ప్రియా! నేనిల్లువిడచి వచ్చి చిరకాలమైనది. మద్వియోగమున తిలదవతియు, మరకతమణియు నెంతగ కుందుచుంటిరోగదా! వారిసంగతి దలంచినంతమాత్రముననే మనం బేలకో కలగుండు వడుచున్నది. ఇదియేగాక పెక్కుదినముల త్తవారింట గూరుచున్న యెడల లోకులేమందురో యించుక యాలోచించితివా? కావున మనపట్టణమునకు బోవుటకు మీజనకుని యొద్ద సెలవు గైకొనుము. వలయునేని మరల కొలదిదినము లచ్చట నుండి తిరిగి రావచ్చును. అని అనునయోక్తుల పల్కిన విని యామెయు నాథా! అట్లనే కావింతము. నాకును మరకతమణిని చూడవలయు నను నభిలాష జనించుచున్నదని బల్కెను.

మరునాడు బకావలి తండ్రియొద్దకేగి జనకా! తమకొక విన్నప మొనరించుకొనుటకు జనుదెంచితిని. మీయల్లునకు స్వగ్రామమును తల్లిదండ్రులను చూడవలయునని యున్నదట. కావున మాకనుజ్ఞ యొసంగిన పోయి వచ్చెదము. అని పల్కి మిన్నకుండెను. ఆతఁడు తన కూర్మిపుత్రిక తమ్ము విడచి పోవుటకు నెంచెనని కంట నీరిడి అమ్మా! ఇన్నిదినములు పెంచి పెద్దగావించిన నీవు నేడు మమ్మువదలి యరిగెద ననుచుంటివి. నీవియోగము నెట్లు సహించగలము. కాని అల్లునకు గల్గిన యభిలాష దీర్పకుండుటయు లగ్గుగాదు. అయిన మాయెడ నాదరముంచి మరల శీఘ్రకాలములో మాకు సందర్శన మొసంగుదుమని బాసయిండు. లేకున్న మేమిచ్చట నిలువజాలము, అని విచారింపదొడంగిన జనకు నోదార్చి జనకా! మరల నొక్కమాసము దిరుగునంతకు జనుదెంచెదను. మాసమననేల మీరు కాకిచే వార్త పంపిన జాలును. మేమిరువురమునుగూడ బయలుదేరి వత్తుము, అని

పల్కి తల్లివద్ద ననుజ్ఞగొని, యితర చెలికత్తెలకు జెప్పి ప్రయాణము నకు గావలసిన వస్తుజాలములు సవరించుచుండెను.

ఆమె తండ్రియును అల్లునకు కానుకగా వెలలేని రత్నములును గజతురగాదులు దాసదాసీజనంబులు నొసంగి మార్గమున వారికి యాటంకములు కలుగకుండ రక్షింపవలసిన దని భూతముల సైన్యము నకు కట్టడి యొసంగెను కుమార్తెకు నమూల్యములైన రత్నాభరణ ములను వస్త్రమును తక్కుగల గృహోపకరణంబులును యొసంగి వారిని ప్రయాణము గావించి యొక్క శుభముహూర్తమున వారు ప్రయాణము సాగించుటకు వలయు యేర్పాటులన్నియు గావించెను.

బకావలి తలిదండ్రు లిరువురును అల్లుని కూతుని కొంతదూర మువరకును సాగనంపి వారిని వదలి వెనుక కరుగలేక నరుగలేక వెను కకు మరలివచ్చిరి. పరాక్రమకేతుడును, చతురంగబలసమన్వితుడై పరిచారికా సహస్రంబులు గొలువ దేవేంద్రవైభవంబున ప్రయా ణము గావించి యెట్టి యవరోధములను మార్గమున సంభవింపకుండ సౌఖ్యమున తనపట్టణమును ప్రవేశించెను.

## బకావలి ఇంద్రసభకు పోవుట పరాక్రమకేతు డామె వెంబడి ఇంద్రలోకమున కరుగుట

బకావలీపరాక్రమ కేతులు పట్టణము ప్రవేశింప నున్నారని తెలిసినతోడనే తిలదవతీ, మరకతమణు లిరువురు కర్పూరసిరాజముల నాతనికి స్వాగతమొసంగి కైదండయిచ్చి, పురంబులోనికి తీసికొని వచ్చిరి. మరకతమణియు బకావలి ననేకవిధముల నగ్గించి యామెను తన యంతఃపురమునకు గొనిపోయి “చెల్లెలా! విభుండు నీయుద్యాన వనమును జూచి ముచ్చటపడి కట్టించుకొన్న ఈ అంతఃపురము నందు నీవే వసింపుము. అనుజ్ఞ నొసంగిన నేనుగూడ నీపజ్జనుండెదను”

అని పల్కెను బకావలియు ఆమె సౌమనస్యత కెంతయో యానంధించెను. "చెల్లెలా! ఇవన్నియును తొంటి నే జూచినవే యెఱుంగవో జయప్రదునితో వసంతుడను పరిచారకుడు వచ్చియుండెను. ఆ పరిచారకుడే ఈ బకావలి యని ఎఱుంగుము" అని తెల్పి ఆమెకు సంతసము గొల్పెను.

పరాక్రమకేతుడు, లక్ష్మి, భూదేవి, నీలాదేవి అను మువ్వురు భార్యలచే పరిచర్య లొందుచుండెడి దక్షిణనాయకశిఖామణి, యగు శ్రీమహావిష్ణువు చందమున, తిలదవతి, మరకతమణి, గులోబకావలి యను పుష్పలీలావతి, తనకు పరిచర్యలు సలుపుచుండ సకలభోగము లందుచు భూలోకమున విహరింప వచ్చిన దేవేంద్రుడో యనునట్లు వెలుంగుచుండెను. ఆనందరసాబ్ధి యందు దేలు మానవులకు యుగంబులైనను నిముషములవలె గాన్పించునుగదా! అట్లే పరాక్రమకేతుడు దినములను, మాసములను గూడ క్షణికములుగా గడపుచుండ కొన్ని సంవత్సరములు చనియెను.

ఒక్కనాటి రాత్రి పరాక్రమకేతునకు అకస్మికముగా మెలకువ గలుగుటచే లేచి పరికింప తన ప్రక్కను పండుకొని యున్న బకావలి గాన్పింపదయ్యెను. ఆతడు ఆమె యుపవనములోని కేగియుండునేమో యని తలంచి శయ్యాతలము దిగి ఉద్యానవనము కలయ వెదకి యామె నెందును గనుగొనజాలక మరల శయ్యాగృహమును ప్రవేశించెను. ఆమె యెందును గానరాకుండుటచే చింతనొంది అట్లే చింతించుచు శయనతలమున పరుండి నిదురరాక పరితపించు చుండెను.

వేకువకా జొచ్చెను. కలకలరవంబులతో పక్షులు యెగురసాగెను. కాని ఇంకను జనసంచారము లేకుండెను. కుక్కుటములు గొంతెత్తి కొక్కురో యని కూయుచుండెను. భయంకరారావ మాలకించిన వండసైనికుని చందమున యా కుక్కుటనినాదము లాలించి

కాబోలును చంద్రుడు వెల్లనై యస్తగిరిని సమీపింప బోవుచున్నాడు. ఆ సమయమున పరాక్రమకేతున కుప్పరిగపై నెవ్వరో మాట్లాడు చున్నట్లు వినవచ్చెను. గవాక్షమార్గమున పరికింపగా బకావలి యొక విమానమునుండి క్రిందికి దిగుచున్నట్లు గానబడియెను. ఆత డయ్యది గాంచి యీమె యెచ్చటికరిగియుండునో తెలిసికొనవల యును. కాని యీమె నెంతమాత్రమును ప్రశ్నింపకూడదు. ఏలనన, ఆమెకు నాపై నున్నవలపనన్యసామాన్య మని యెఱుంగుదును. వేరొక విధిలేని కార్యముపై యామె యరిగియుండెనే గాని తుచ్ఛ వ్యామోహమును దీర్చుకొనుటకై యరిగియుండదనుట నిక్కువము. నని వితర్కించుకొని యేమియు నెరుంగని పోల్కి నిద్దురనటించెను. బకావలి యాతని చెంతకు వచ్చి శయ్యపై నెప్పటియట్ల పరుండెను.

పరాక్రమకేతుఁ డామరునాఁ డంతయు నేదోయొక విధముగా గడిపి చీకటి పడినప్పటినుండియు నెప్పుడు బకావలికొరకు విమానమరు దెంచునా ఎప్పు డామె ననుసరింతునా యని తలంచుచు నిద్రించువాని పగిది శయ్యపై పరుండియుండెను. అర్ధరాత్రమునకు విమానమరుదెంచి యుండెను అది యరుదెంచినతోడనే బకావలి లేచి ఆభరణములను సరిజేసికొని విమాన మెక్కుటకుగా నవ్వలిగదిలోని కేగెను. ఈ లోపున నాతడు లేచి దేవభటులకు తెలియకుండ ఆవిమానము నెక్కి యొక్క విగ్రహముచాటున నక్కి కూరుచుండెను. బకావలి చనుదెంచి విమాన మెక్కినతోడనే దేవభటు లావిమానమును నడిపింపసాగిరి. తృటికాలములో నావిమానము దేవేంద్రుని సభ చెంతకుపోయిఆగెను. బకావలి యందుండి దిగినతోడనే దేవభటు లామెను గొనిపోయి అగ్నిగుండమునం పొరలించి అమృతోదకములచే తడపి దేవేంద్రుని యెదుటికి తీసికొనిపోయిరి. ఆమె దేవేంద్రుని యాజ్ఞానుసారముగా కొంతతడవు నృత్యముసల్పెను. తదుపరి దేవదూతలు ఆమెను మరల

విమానముపై నెక్కించి భూలోకమునకు దోడ్కొనివచ్చిరి. పరాక్రమకేతుడును ఆమెతోగూడ భూలోకమునకు చనుదెంచి యామె లోని కరిగిన తరువాత పడుల కగపడకుండ విమానమునుండి డిగి తన శయనాగారమును ప్రవేశించి యెప్పటియట్ల శయ్యపై పరుండెను. బకావలి కూడ లోని కరుదెంచి యాతనిప్రక్కనే పరుండెను.

మరునాడుకూడ నిట్లే జరిగెను. పరాక్రమకేతుడు నాడెట్లో వీలుచేసికొని మృదంగము వాయించు వానిసన్నిధి కరిగి ఓయీ! ఆమెపాట కనుగుణ్యముగా నీవు మృదంగమును వాయించుటలేదు. అందుచేత ఈరంగము శోభించుటలేదు. నాకొకపరి యామృదంగము నొసంగుము. ఒకింతలో సభారంగమును రంజింపజేసెదను. అని సవినయముగా ప్రార్థించెను. ఆమాటల కాతడుగూడ సదయహృదయుడై యాతని కామృదంగము నొసంగెను. బకావలి నాట్యము చేయుచుండ పరాక్రమకేతుడు దివ్యముగా మృదంగము వాయింప సాగెను. అపూర్వశోభగలదియై ప్రకాశించెను. ఇంద్రుడు అత్యంత సంతోషస్వాంతుడై పరాక్రమకేతున కొక పచ్చలపతకమును బహుమానముగా నొసంగెను.

బకావలి ఇంద్రునిచే శపింపబడుట

పరాక్రమకేతుడు గృహమున కరుదెంచి యాపచ్చలపతకమును ఒక్కచో మరుగుపరచి యెప్పటియట్ల సెజ్జపై పరుండియుండెను. బకావలికూడ లోపలికి చనుదెంచి ఆతనిప్రక్కనే పరుండెను. నాడు తెల్లవారిన తరువాత బకావలిని తన రహస్యాగారములోనికి పిలచి ఆమె కా పచ్చలహారమునుజూపి ఇదియేమో యెరుంగుదువా? యని ప్రశ్నించెను. ఆమెయు సంగతిసందర్భములన్నియును గ్రహించి నాథా! . అనుమానపడి జనుదెంచితిరా యని ప్రశ్నింప పరాక్రమకేతుడు "ప్రియా! నీపై నాకెన్నడును అనుమానములేదు. నేనట్లు

వెంబడించుట యూరక కుతూహలమువలననే యని యెరుంగుము. నీకిట్టి అవస్థ ఏల కలిగెను. సాధ్యమైనయెడల దానిని తప్పింప యత్నించెదను'' అనిన బకావలి యిట్లనియెను. "నాథా! ఆయ్యది తప్పించుట కొక్కటే మార్గమున్నది. అది ఏమన, ఇంద్రుని మెప్పు బడయుటయే. అందుకే నేను మనస్ఫూర్తిగా యత్నించుచుంటిని. ఇంతటిలో మీరువచ్చుటకే చనుదెంచితిరి. ఇందువలన కార్యము రసాభాసమగునని తలంచుచుంటిని. కానున్నది కాకమానదు. నేడు కూడ నాతోరండు. అక్కడి సంగతిసందర్భముల గమనించి ప్రయత్నించినయెడల కార్య మనుకూలించిన యనుకూలింప వచ్చును'' అని బల్కెను.

నాటిరాత్రికూడ పరాక్రమకేతుడామె ననుసరించెను. నాడును పరాక్రమకేతు మద్దలవాయించి సభను యెక్కుడుగా రంజింప జేసెను. ఇంద్రుడెంతయో మెచ్చి బకావలికోరికదీర్చుటకు సంకల్పించుకొను సమయమున బకావలి అతి సంతోషముచే ఇంద్రునిపై నభినయించుటకు మారుగా పొరపాటున పరాక్రమకేతునిపై నభినయించి సభయంతయు రసాభాసమగునట్లు చేసెను. ఇంద్రుడు మండిపడిసంగతినంతయు దివ్యదృష్టిచే తెలిసికొని యెక్కుడగు కోపమున, ఓసీ దుర్మార్గులారా! ఇంతటియానందమును యెంతటిలో భగ్నమొనరించితివి. ఇట్టి నీవు అనుగ్రహామునకు అర్హురాలవుకావు. భూలోకమున సగమువరకు చిత్రాతివై యుండుమని శపించెను. పరాక్రమకేతుడు ఇంద్రు నెంతయో ప్రార్థించెను. కాని లాభమినుమంతయును లేక పోయెను. దేవదూతలు బకావళిని పరాక్రమకేతునుండి తీసికొని పోయిరి. అతనిని గూడ వేరొక కొందరు తీసికొనిపోయి యొక నిర్జన ద్వీపములో విడిచిపెట్టిరి.

పరాక్రమకేతుడు బకావళిని తిరుగ కలసుకొనుట.

పరాక్రమకేతుఁడు ప్రియవిరహముచే మూర్ఛనొంది నాలు గైదు దినములవరకును కదల మెదల లేనంత స్థితిలో నుండి అనంత రము స్మృతి తెచ్చుకొన్నవాఁడై మెల్లగలేచి నలుదిక్కుల పరికించి బకావళియం దెచ్చటైన నుండునేమో యని వెదకుచు పరిభ్రమించుచు ఉన్మత్తుండై యొక్కనాఁ డొక సరోవరముచెంత కరుదెంచెను. పెక్కు దినములనుండి నిద్రాహారములు లేకుండుటచేతను నిరంతర ప్రయాణ ముచే గలిగిన ఆయాసముచేతను సొమ్మసిల్లి యాసరోవరతీరముపై పడెను. ఆసమయమున కొందరు దేవకన్యకలు జలక్రీడలాడుకొనుట కై సరోవరమున కరుదెంచి పరాక్రమకేతుని జూచి వారిలో వారిట్లు సంభాషించుకొనిరి.

"అక్కా! చూచితివా! ఈతనిని, కొన్నిదినములక్రిందట దేవేంద్రుని సభలో బకావలి నాట్యముసల్పు సందర్భమున మృదం గము వాయించిన దీతడే సుమా!

"అలాగా! పాప మాబకావలి కెట్టి యనర్థము సంభవించినది ఈతని కామె యున్నచోటైనను దెలియదని తలంతును."

"ఆమె యున్నచో టీతనికి తెలియనే తెలియదు, తెలిసిన మాత్రము ప్రయోజన మేమున్నది."

"ఆమెకు శాపవిమోచన మెప్పటికగునో తెలియునా"

"నాకుఁ దెలియదు."

వీరిట్లు మాట్లాడుచుండగా పరాక్రమకేతునకు మెలకువ వచ్చెను. ఆత డాదేవకాంతలను గాంచి వారిని మెల్లగా సమీపించి ఓపుణ్యాత్ములారా! మీ రిప్పుడేమో బకావలిని గూర్చి మాట్లాడు చుంటిరి ఆమె యున్నతావు మీ రెరింగి యున్న నాకెరిగించి పుణ్యము

గట్టుకొనుడు. లేనియెడల చెప్పవలసిన దేమున్నది నిష్కారణముగా జీవముల గోల్పోవలసివచ్చును. అని పరిపరివిధముల వారల ప్రార్థింపగా వారలు కనికరముగలవారలై ఓయీ! మేమామె యుండు తావెరుంగము. అయినను ప్రయత్నించి కనుగొని నీకు తెల్పెదము. కావున నచ్చోటనే యుండుమని పల్కిరి. అంతట పరాక్రమకేతుడు వారలకు తనపై నత్యధికమగు కనికరముకలుగునట్లు జేయనెంచితరుణీమణులారా! మీరెప్పుడో యనుచుంటిరి. అప్పటివరకే ప్రాణములు నిలుచునట్లుగా తోపవు. నిరాశాపీడితుడనై దుఃఖతోయధియందు మునిగి జీవింపజాలను. మీరామె యెచ్చటనున్నదో తెల్పిన తెల్పుడు. లేకున్న ప్రాయోపవేశమొనర్చి మీరు చూచుచుండగనే నీ జీవములను గోల్పోయెదను. అని పల్కుచు తన శిరమును నేలపై గొట్టుకొని మరణించుట కుద్యమించెను. వా రాతని వారించి ఓయీ! సాహసముమానుము. చచ్చిఎవ్వనిసాధింపగలవు. బ్రతికియుండిన నెన్నటికైనసుఖములను బడయవచ్చును. ఏలనిష్కారణముగా జీవములను బోగొట్టుకొందువు. దేవేంద్రుని భయమువలన నీకు మేమామెయున్న చోటును దెల్పమైతిమి. లెమ్ము నన్ను మా యోగబలంబున ఆమెయున్నద్వీపములోనికి గొనిపోయి విడచిపెట్టెదము. ఎట్లో ప్రయత్నించి యామె యున్నతావు తెలిసికొనుము అని చెప్పి యాతని నూరడించి అతనిని తమతోగూడ తోడ్కొనిపోయి యొక ద్వీపమున విడచి చనిరి.

అతని యాశాలతలు దేవతాకన్యల వాక్యములను దోహద విశేషముచే చిగిరింప నారంభించెను. ఆశాపీడితుడై లేనిసత్తువను దెచ్చికొని మెల్లమెల్లన నడచుచుయొక పట్టణమును ప్రవేశించి యందు తనకు గాన్పించిన యొక పూరుషుని సమీపించి యీగ్రామమున నేమైన వింతగలదా యని ప్రశ్నించెను. ఆపూరుషుడును

అయ్యా! మీరెఱుగరా కొన్నిదినములనుండి ఈపట్టణమునందలి జను లందరు అదేపనిగా చెప్పుకొనుచున్న విషయమును మీరెఱుంగరా ఈయూరనొక దేవాలయము వెలసినది. ఆదేవాలయము తలుపులు పగలెల్లప్పుడును మూయబడియే యుండును కాని రాత్రిభాగమున తెరవబడును. అందు ఒకస్త్రీవిగ్రహము గలదనియు నడుమువరకు మాత్రమే ఆవిగ్రహము రాతితో చేయబడినట్లుండెను. తక్కిన భాగ మంతయు మానవశరీరముగా నుండెనట ఇద్దానినే ప్రజలెల్లరును చెప్పుకొనుచున్నారు. కొందరయ్యది పిశాచమనియు మరికొందరు భూతమనియు ఇట్లే ఎవరికి తోచినట్లు వారు పల్కుచు తక్కినవారిని వెరపించు చుండుటచే నిప్పుడెవ్వరును ఆదేవాలయముచెంతకే పోవు చుండుటలేదు. అనిచెప్పి తనదారి నేగెను. పరాక్రమకేతుఁను ఆ విగ్రహము తనభార్య బకావలిదే యని గ్రహించి త్వరితగమనమున చీకటిపడకుండ పురము ప్రవేశించి ఆదేవళమును గుర్తించుకొని చీకటి పడునంతవరకును వేచియుండెను.

చీకటి పడినతోడనే ఆదేవాలయముయొక్క తలుపు తెరవ బడెను. అతడందు ప్రవేశించి బకావలినిగాంచి హాప్రియా! యని కౌగిలించుకొని పెద్దయుంబ్రొద్దు చింతించెను. ఆమెయు అతనితో మాట్లాడుచు ఆనిశాశేషమును వేగించి వేకువ యైనతోడనే "నాథా ఇంక మీరావల కేగవలయును. లేకున్న మీకుగూడ నాగతియే సంభ వింపగలదు మరల మనము రాత్రిభాగమున కలిసికొందము అనిచెప్పి యాతని నావల కంపివైచెను.

## పరాక్రమకేతుడు చిత్రకేసినిని పెండ్లియాడుట

పరాక్రమకేతుఁను అనుదినమును రాత్రిభాగమున బకావలితో మాటలాడుచు పగలెల్లను ఆపట్టణమున దిరుగుచు కాలయాపనము

చేయుచుండెను ఇట్లుండగా నొక్కనాడు కొందరు సుందరులగు యువకులు వికార వేషములను ధరించి వీధియందు భ్రమ్మరుచుండుట గాంచి సమీపమునసున్న యొక వర్తకుని దరిజేరి అయ్యా! వీరెవ్వరు? ఇట్లు వికార వేషములతో భ్రమ్మరుటకు కారణమేమి? వీరి యాకార ములు జూడగా రాకుమారులని తోచుచున్నది. వీరి వేషములు గాంచిన బికారులని తోచుచున్నది. వీరిట్టి వింతనడవడి గలిగియుండుటకు గారణ మేమి? దయచేసి తెల్పుడని ప్రశ్నించెను అంతనావర్తకుడు "అయ్యా! మీరు తలంచినట్లు వీరు రాకుమారులే యగుదురు ఒక్కొక్కడు ఒక్కొక్క మహారాజ్యమునకు అధికారి. కాని వీరందరును మారాజ కుమారియగు చిత్రకేసినిని వరించి యామెయందు బద్ధానురాగులై ఆమెచే తిరస్కృతులై ఇట్టి వేషములను ధరించి మతిలేక తిరుగుచుండిరి' అని చెప్పగా పరాక్రమకేతుడు "ఓయీ! మీరాకుమార్తె అంత చక్కనిదా? లేక యామె మోసముచే వీరలనువంచించి ఇట్లు త్రిప్పు చున్నదా?"యని యడిగెను. ఆవర్తకుడు ఆతని కిట్లనియెను "అయ్యా! ఆమె ఇంత చక్కనిదని చెప్పుటకు వల్లకాదు. రంభాద్యప్సరః కామినీ జనంబులు ఆమె కీడుగాదనుటలో నతిశయోక్తి లేదు. పండువెన్నెలల గాయు యీయామె ముఖబింబమునుగాంచి 'యుబ్బి తబ్బిబ్బుబడని పూరు షు డుండడనియే చెప్పవచ్చును. ఇనుపకచ్చడాలు గట్టుకొను మును ప్రముచ్చులైనను ఆబిబ్బోకవతిని గాంచిన తబ్బిబ్బుపడక మానరు. వేయేల ఆమెను చూడనివారి కన్నులు కన్నులుగావు" అని పెక్కు విధములుగా వర్ణించెను. ఆపల్కు లాలకించి పరాక్రమకేతుడు ఆమె ను కన్గొని వీలున్న యెడల ఆమె నుద్వాహమాడుటకు సంకల్పించు కొనియెను.

ఆత డామరునా డుచితవస్త్రాలంకారముల ధరించి రాకుమారి సౌధమున్న వీధిని పచారు చేయుచుండెను. చిత్రకేసిని తన యంతః

పురమునుండి యాతని జూచి పంచబాణవంచితయై యతని నెట్లైనను తనవద్దకు తీసికొని రావలసినదని చెలికత్తెలనుబంపెను. వారు ఘటనాఘటన సమర్థులు. లక్కినిలిక్కిగను లిక్కినిలక్కగను చేయగలశక్తి గలవారు. వారు తమ చాకచక్యముచే రాజపుత్త్రి వరించిన వానినైనను ఆమెదరిజేర్పక ఆతని యందు లేనిపోని దోషము లారోపించి యాతని యెడల నామెకు విరక్తి గలుగునట్లు చేయగల సామర్థ్యము గలవారు. వారు ఆమె నోదార్చి తరుణీమణీ! ఎన్నడెరుగని రీతిని నీవిట్లు విరహామునొందదగని రేరుగలము. నీవు వరించిన యాతడెవరో మాకు చూపినయెడల నిమిషములో యాతనిని తీసుకొనివచ్చి నీ యంతఃపురమునకు జేర్పగలము. లేక నీవే ఆతురపడిన యెడల యిక చెప్పవలసినదేమున్నది. గౌరవమునకు లోపము గలుగును. నీసౌందర్యప్రసక్తికా కళంకము గల్గును. కావున మాపలుకులాలించి నెమ్మది గలిగి ఆతడెవ్వడో ఎచ్చటనుండునో మాకెరిగించుము. అని పల్కిరి. వారికి చిత్రకేసిని యిట్లనియెను. చెలులారా! వీధియందు పాటలు పాడుచు పోవుచున్న ఏకారులగు రాకుమారులను గాంచవలయునను కుతూహలమున గవాక్షము చెంతకేగి చూచితిని. అప్పుడు పరిపూర్ణచంద్రుని ప్రభ నొంచి వెలుంగు దివ్యతేజస్సంపన్నుడైన యొక్క రాకుమారుడు కానబడియెను. ఆతని చూచినంతనే నామన మాతనియందు లగ్నమయ్యెను. రండు మీరుగూడ నాతని జూపెద" నని గవాక్షము చెంతకు వారిని దోడ్కొనిపోయి చుక్కలలోని చంద్రునివలెనే వడి తేజరిల్లుచున్న పరాక్రమకేసరిని జూపి ఆతడే నాచిత్తచోరుడని తెల్పెను. వారు ఓయమ్మా! నీకోర్కెను క్షణములో దీరునట్లుగా నిప్పుడే వానిని దోడ్కొనివచ్చెదమని యామెను నమ్మికపుట్టవచించి యూరడించి యామె నంతఃపురము జేర్చిరి.

ఇదనంతర మా చెలికత్తెలిరువురు పరాక్రమకేతుని చెంతకరు దెంచి ఓయీ! నీవెవ్వరవు? ఈయూరికి క్రొత్తగా కానబడుచుంటివి. మీదేయూరు. ఇచ్చటి కేమిపనిగలుగవచ్చితివి. కాలకర్మవశముననీవు మాకంటబడితివి! లేకున్న నీకు ముప్పుగలిగి యుండునుగదా! ఈపట్టణ మేలెడి భూపాలుని కుమార్తెయైన చిత్రకేసిని సుందరులగు యౌవన పురుషులు గనుపడినంతనే వారలను తనసౌధమునకు రప్పించుకొని వివిధవికారముల వారికి భయము గలిగించి బికారులనుజేసి సాగనంపు చుండును. అయ్యది యెరుంగవు కాబోలును. నీయాకారమునుబట్టిచూ డగా నీవుకూడ యామెనుగాంచి తబ్బిబ్బుపడిన వానివలెనే గాన్పించు చుంటివి. మాతోరమ్ము, నిన్ను సురక్షితమైన తావునకు గొనిపోయి రాకుమారికవలన నీకెట్టియపాయమును గలుగకుండ రక్షించెదము. రమ్మని త్వరపెట్టసాగిరి. అంత నాతడు వారి సంభాషణలుపరికించి దూతికలై యుందురని నిశ్చయించి వారుపల్కినదెల్ల యసత్యమనియు తన్ను మోసగించుటకై వారట్లుపల్కుచుండిరనియు గ్రహించియుక్తి యుక్తముగా వారికిట్లు సమాధానమిచ్చెను. "మాపట్టణమా పగటిని మించి వెలుంగునది. నేనాకిరీటాధిపతులచే మ్రొక్కులుగొన్నవాడను మన్మథావేశము గల్గియున్నను మనస్సు చెదరనీయక చిక్కబట్టుకొను శక్తిగలవాడను. మీరాకుమార్తె నన్ను పిలిపించినప్పటిమాట జూచు కొందములెండు. ఇప్పటినుండియు ముందెప్పుడో ముప్పురాగలదని విచారించునంతటి వెఱ్ఱివాడను గాను. కావున మీదారిని మీరేగుడు. విధి ఎట్లున్న నట్లు జరుగగలదు" అనుచు వారికి తిరుగ మాట్లాడుట కవకాశ మీయక సాగనంపెను. వారును ఆతనిని వంచించి గొని పోవుటసాధ్యమని యెంచి రాకుమార్తె చెంతకేగి "అమ్మా! ఆతడు సూర్యకాంతిపుర మేలు జయప్రదుని ఐదవకుమారుడగు పరాక్రమ కేతునిగా యెరుంగుము" అని తెల్పి మరునాడాతని నెట్లైన గొని వత్తుమని బాసయిచ్చి ఆమెకుగల చింతదీర్చిరి.

మదనాతుర లాయువతికలు పరాక్రమకేతుని చెంతకరిగి వాని మూర్తి సౌందర్య మెఱిగించుచు, తమ భూపాలునియొక్క ఐశ్వర్యాతిశయములు వర్ణించుచు పెద్ద యుపన్యాస మొసంగి. అతనిని తమవలలో [illegible] చేయవలెనని యత్నించిరి. కాని అత డించుకయు చలింపక "తరుణీమణులారా! మీ రాకుమారికి నాపై వలపు జనించినదే యనుకొనుడు. అంతమాత్రమున మేమిలాభముండును. నేను విరాగుడనై తీర్థయాత్రాపరుడనై కామోపభోగముల నాసింపరాదని నిశ్చయించుకొనియుంటిని. అట్టివాడ నన్ను వలచిన ఆమె కేమి ప్రయోజనముండును. ఈసంగతి మీభూపాలున కెరిగింపుడు మరియు నాతనితో నిట్లు చెప్పుడు. సకలైశ్వర్యసంపన్నుడనై యుండిన నేను ఇప్పుడు నిర్ధనుడనై యుండ వివాహమున కంగీకరించుటకు సమ్మతింపనని చెప్పుడు అని పల్కి వారలను సాగనంపెను.

పరాక్రమకేతుడు చెప్పిన విషయములన్నియు భూపాలునకు దూతిక లెరింగించిరి. భూపాలుడును చేయునది తోపక మంత్రిని ఏమిచేయవలసియుండునని ప్రశ్నించెను. దీర్ఘముగా నాలోచించి మంత్రి ఇట్లనియెను. "దేవా! ఉపాయాంతరమున నాతనిని రప్పింపవలసినదే కాని వేరుమార్గము గాన్పింపకున్నది. రెండుమూడు దినములలో కార్యము సాధించుకొని వత్తు" నని పల్కి నృపాలునికడ సెలవుదీసికొని చనియెను.

పరాక్రమకేతుడు తనచెంత నేమియు ద్రవ్యము లేమిచే కొంత తడవు చింతించి ఆకస్మికముగా తన తొడయం దున్న మాణిక్యము జ్ఞప్తికి వచ్చుటచే తొడచీరి అందున్న మాణిక్యమును వెలికిదీసి దానిని బజారులో నమ్మజూపెను. వర్తకులెల్లరును ఆమాణిక్యము విలువగట్టనేరక మంత్రిసన్ముఖమునకుపోయి కటికచీకటినైనను పట్టపగలు చేయగల యీ మాణిక్యమునుజూచి అది యమ్మకమునకు

వచ్చినదనియు దానినొక పుణ్యుడు తీసుకొనివచ్చి యిమ్ముచుండెననియు తెలియబడినది. మంత్రి అతడు పరాక్రమకేతుడని గుర్తించి అతనిని తన వెంటబెట్టుకొని భూపాలుని సమ్ముఖమునకు బోయెను. భూపాలుని కేకాంతమున 'దేవా! తా మెవ్వనిని తీసుకొనిరమ్మనిరో ఆపురుషుని తీసుకొనివచ్చితి నింక మీ యభిప్రాయము ననుగుణ్యమైన మనం బీతనికి గలుగునట్లు చేసికొని కన్యనిచ్చి వివాహము గావింపుడనెను.

భూపాలుడు మంత్రిచేసిన కార్యమునకు సంతసించి యాతని నొక దివ్యభవనమున నుంచి సకలోపచారము లొనరించుచుండవలసినదనియు నాతని నెచ్చటికిని బోనీయకుండ పహారా యిచ్చుటకు తన భటుల కాజ్ఞాపించెను. అతడు తన కుమారిక చెంతకేగి యమ్మా! నీవు వరించియున్న పూరుషుని దెచ్చి మన భవనంబున నుంచితిమి. నీ వచ్చటికేగి ఆతడుకూడ నిన్నువలచునట్లుగా నటించి లోబరచుకొనుము. అని చెప్పి శుద్ధాంతమున కరిగెను.

ఆమెయు చెలికత్తెలతో నాసౌధమును బ్రవేశించి యాతనికి మనోవైకల్యము గలుగజేయుటకై వివిధవిధముల బ్రయత్నించియు కృతార్థురాలుగామికి చింతించుచు చేయునదిలేక "ఆహా! ఈత డెంత గుండెనిబ్బరముకలవాడు ముల్లోకముల నేలజాలు సౌందర్యవతినైన నేను తన మ్రోల చరించుచున్నను కన్నెత్తియైన చూడడు. పలుకరించినను పలుకడు ఇట్టివానిని లోగొనుట యెట్లు' అని చింతించి చేయునదిలేక యామె తన యంతఃపురమున కేగి జనకునకు తనయశక్తత దెలుప సంకల్పించుకొని తనకున్న భూషణములన్నియును ధరించుకొని విలువవైన దుస్తులుగట్టి మరాళయానంబున నాతని చెంత కేగి యచ్చట నే నడయాడుచు కొంత సేపును, వీణారవంబును దిలకించుతన మృదుమధుర స్వరంబును వీణారవంబుతో గలిపి మోహాజనకము

లైన పెక్కుపాటలను పాడియు నాతని మనంబును కరగింపనేరక, భావభవ భల్లభగ్న హృదయురాలై యాతని యెట్టెదుట వ్రాలెను.

పరాక్రమ కేతుడును యింక నుపేక్ష జేసినయెడల నామె జీవములకే ముప్పు గలుగునని తలంచి యామె నేల వ్రాలినతోనే యామెను తన బాహువల్లరులతో నెత్తి తనతొడపై బరుండబెట్టుకొని ప్రియవచనంబుల నామెను సేదదేర్చుచుండెను. భూపాలుని యీసంగతి తెలిసి యచ్చటికరుదెంచి పరాక్రమకేతుని వృత్తాంతమన్నియు దెలిసికొని వారిద్దరకును వివాహము గావించుటకు వలయు సంభారము లన్నియు జతపరచుటకు తగినవారల నేర్పరచి యాదినముననే అఖండ వైభవముతో వివాహకార్యమును జరిగించెను.

## పరాక్రమకేతుడు వివాహమైనపిమ్మట బకావలిని చూచుట కేగుచుండుట

రెండు మూడు దినము లరిగినపిమ్మట పరాక్రమకేతుడు భార్యను తొలిజామునందు రతుల మెప్పించి నిద్రపుచ్చి తలుపులను దెరచికొని రహస్యముగా వీధిలోనికి జనుదెంచి యటనుండి పాదచారుడై బకావలియున్న దేవాలయమున కరిగి యామెతో నడచిన సంగతులెల్ల జెప్పి యక్కారణమున కొన్నిదినములనుండి వచ్చుటకు వీలు కలుగలేదనియు జెప్పెను. ఆమెయు ఆతని చూచినతోడనే తన వెనుకటి దుఃఖములన్నియును మరచి యాతని కిట్లనియెను "నాథా మీకొక విన్నపము సేయుచున్నాను. మన్నింపవలయును' తొల్లి

మన మిట్టి దంపతులకు వియోగము గల్గించితిమో కాని యీ జాముస నిట్టి వియోగమును బొందియుంటిమి ఇంకనైన నిట్టి వియోగము కలుగకుండుటకై ఓకొక్కటి గావింపుడు మీరను దినంబునను యిచ్చటికి కనుదెంచుచున్నందున నాచెల్లెలగు చిత్రకేశినికి విచారము కలుగవచ్చును కాన మీరామెను సొప్పించి యిప్పటికి రావలదు. అవకాశమైనప్పుడెల్ల మీకు నేరికమైనప్పుడెల్ల మాసము నకో పక్షమునకో యొకసారి దర్శనమిచ్చుచుండు డదియే చాలును. మరియునొక్క సంగతిని మీరు గమనింపవలయును. అదేమందురా? నిత్యమును తమరి టనుదెంచుట యెఱింగెనేని యామెకు మీపై సందియము దోచినను దోచి మీపై కావలియుంచి మన గుట్టుమట్టుల నెఱుంగగలదు. అప్పుడు మన కూటమికి విఘాతము గల్గింప నామె యాలోచించును. అట్టి దెన్నడును సంభవింపకుండ మనము రహస్యమును గాపాడుకొనవలయును''అని పల్కెను ఆపలుకు లాలించి పరాక్రమకేతుడు ''ప్రియా! ఏమనుచుంటివి! ఆమె నాపై ననుమాన పడుననుచుంటివా? పడనిమ్ము ఏమిగావింపగలదో యదెల్ల గావింపు మనుము కాని నిన్ను చూడక నొక్కదినమైనను నిలువజాలను. నీదివ్యమంగళవిగ్రహమును కనులార గాంచక జీవముల భరించి యుండజాలను. నామనశ్శశిచకోరమ వగు నిన్ను దినముకొక్క మాటైనను గాంచి నీతో సంభాషించి ముదమొందకుండ నిలువ గలనని భావించితివా బకావలీ! ఎట్టి యనర్థములు సంప్రాప్తమైనను వెరువను ఏలనందువా! ఇంతకంటె అనర్థమేముండును. కావున అను దినమునను నన్ను రావలదని నీవు పలుకకుము.''అని ఆమెను మారు బలుకనీయక యితర విషయములు సంభాషించుకొనుచు సరసాలాప ముల నానికాలక్షేపంబును గడపి వేకువమైనతోడనే అంతఃపురమున

కేగి యెప్పటియట్లు చిత్రకేశిని ప్రక్కజేరియుండెను. కాని చిత్రకేశిని భర్త యెచటికో వెడలివచ్చుచున్న సంగతియే యెఱుఁగకుండెను.

పరాక్రమకేతుఁ డొరులకంట బడకుండ గుట్టుగ ననుదినమును బకావలిచెంత కరుగుచు వేకువయైనతోడనే మరల యంతఃపురమున కరుగుచుండెను. పగలు చిత్రకేశినియొద్దను రాత్రిభాగం బెక్కుడుగా బకావలిచెంతను గడుపుచు కాలయాపన మొనరించుచుండెను. కొన్ని వత్సరము లేగినపిమ్మట భూపాలుఁడు రాజ్యమును పరాక్రమకేతున కప్పగించి తాను తపమాచరింప బోయెను. పరాక్రమకేతుఁడు భూపాలుడయ్యు బకావలిని జూచుటకు ప్రతిరోజును బోవుచుండెను. ఒక్క నాఁడు అతఁ డట్లుపోవుట చిత్రకేశిని చెలికత్తెలిరువురునుజూచి ఆమరునాడు చిత్రకేశినికి యిట్లెరింగించిరి. "అమ్మా! సేవకాధర్మము మిగుల చెడ్డది. సేవకుడైనవాడు స్వామి హితాహితంబుల గుర్తించి అవసరమగునెడల అడుగకున్నను సమయోచితముగా సలహానొసంగవలెను. అట్లొనరింపక నుపేక్షించువాడు స్వామిద్రోహి తుల్యుడగును. ప్రభువులకు కష్టముగా నుండునని కొందరు కొందరు తమకు తెలిసినవిషయముల నెరింగింపక మరుగుపరచి కార్యము భంగమైనపిమ్మట అట్లు జరుగగలదని తామదివరకే ఎరింగియుండునట్లును పలుకుచు వాపోవుచుందురు. నిక్కపుభృత్యుఁ డెన్నడును చెప్పవలసిన యర్థము ప్రభువులకు కష్టముగా దోచునని యెరింగియు నిస్సంకోచముగా జెప్పవలయును. అందులకు సాహసింపనివాడు భృత్యధర్మమునుండి తొలంగుటయే యుత్తమము. ప్రభువైశ్వర్యయుతుండై ప్రభనొంది వెలుంగుచున్నపుడు అతనిపజ్జ జేరి యిచ్చకములాడుచు బట్టువలె పొగడుచు ఆపదవేళ విడచిపోవునట్టివా రెన్నటికి భృత్యులు కానేరరు. ఎవ్వాడు ప్రభుని సౌఖ్య మపేక్షించి తనసౌఖ్యమును పరిత్యజించి ప్రభుసౌఖ్య

మే తన సౌఖ్యమని భావించుకొనుచు సమయమొదవినప్పుడు సను కంజ యిడక ప్రభుసంరక్షణార్థమై తన ప్రాణమునుగూడ తృణప్రా యముగా నర్పించునో వాడే భృత్యుడు. భృత్యులెన్నడును ప్రభు లకు విన్నవించు విషయముల న్యాయముగ గాంచినదైన లేకున్న విని యైనను యుండవలయు సెగాని వరులు చెప్పిరనియు వరులు చూచి నట్లు జెప్పిరనియు నిక్కువములని భావించి ప్రభుసన్నిధినెన్నడును నుడువరాదు అట్టివారే ప్రభువున్నవలస పాత్రులగుదురు. తక్కుం గలవారు నిందకేపాత్రులు'' అమ్మా! ఇంతితడవు నీతో చెప్పకుండు లకో ఎరుంగుదువా! కల్లకపటంబులెరుంగని నీవు, లోకవృత్తాంతమెరుం గని నీవు, మాపలుకులయెడ నాదరము చెదవో లేదో యని సంశ యించియే నీకింతవరకు చెప్పితిమి. అట్లు సందేహించుటకు కారణ మేమందువా! మేము చిన్నప్పటినుండియు నిన్నెత్తి పెంచినవారమగుట చేత నీహితాభిలాషులమని నీవెరింగినప్పటికి మమ్ము సంశయింపగలు గు వాక్యములనే ఇప్పుడు చెప్పబోవుచుంటిమి. శ్రద్ధతో వినుము.

''అమ్మా! నీవిభుడు అన్యకాంతాసక్తుడై యుండెనని చెప్ప టకు చాల చింతించుచున్నాము. అత డనుదినమునను నీశయ్యాతల మును విడచి యెచ్చటికో పోవుచున్నాడు ప్రక్కనున్న యిల్లాలవైన నీవు యీమాత్రపుసంగతిని యీవరకేల కనిపెట్టలేక పోయితివో యె రుంగలేకున్నాము. ప్రక్కనున్న విభుడు లేచిపోవుచుండగా నీకొక నాడైన మెలకువరాలేదా! ఎంత వింతగా నున్నది! కాని అమ్మా ఆతడు నిన్ను విడిచిపోవుటకు గల కారణ మూహింపలేకున్నాము. నీవు కురూపివిగావే! ముల్లోకముల జయింపజాలినట్టి సౌందర్యముగల దానివిగాని. ముదిసి ముదిసి మోహమైనదానివి గావే? చక్కని ఎల జవ్వనముననున్న పడుచువు గాని, రతిరహస్య మెరుంగని అజ్ఞానవంతు

కాలవుగానే కళారహస్యపిజ్ఞానధురీణవుగాని, ఇట్టినిన్ను లోకైక విఖ్యాత సౌందర్యవతివైన నిన్ను; సరసకళాప్రవీణురాలవైన నిన్ను; విడచిపోవుటకు నీనాథుడు నీయందేలోపమును గనిపెట్టియుండెనో ఒక్కమారైన కనుగొనుటకు యత్నించినదానవుగావే. ఇంత ముద్దరాలవైతివేమి" అని పెక్కువిధముల నా చెలికత్తె లిరువురును నామెతో పరాక్రమకేతుడు పరకాంతకొరకు పోవుచుండుట నిశ్చయమని తెల్పవలయునని విదర్శనము జూచుకొమ్మనియు బోధించిరి.

చిత్రకేసిని తనవిభుడన్యకాంతాసక్తుడై పోవుచుండెనని విని మెక్కుడగు విచారమును పొంది, యారాత్రి తన విభునిసంగతి నంతయు కనుగొనవలెనని సంకల్పించుకొనెను. నాటిరాత్రి విభుడు తన్ను సంతసపరిచిన పిమ్మట మునుపటికంటె వేగముగా నిద్రవచ్చుచున్నట్లు నటించి కన్నులు మూసికొనియుండెను. పరాక్రమకేతుడు కొంతవడి నిరీక్షించి భార్య నిద్రించినదని మెల్లన యామె పక్కనుండిలేచి వెలికరుదెంచి యెప్పటియట్లు బకావలిని చేరబోయెను.

## చిత్రకేసిని పరాక్రమకేతుని రహస్యమును కనుగొని బకావలియున్న ఆలయమును ధ్వంసమొనరించుట, బకావలి శాపవిమోచనము

విభుడు తనచెంతనుండి లేచి వెడలినపిమ్మట కొంతసేపటికి శయ్యాతలమునుండి డిగ్గి యొక గవాక్షము చెంతకేగి యందుండి తన విభుండు రాజమార్గము ననుసరించి పోవుచున్న జూచెను. తోడనే భరింపరాని దుఃఖముజెంది మూర్ఛిల్లెను. "ప్రాణాధికుడైన ప్రాణనాథుడే పరకాంతాసక్తుడై యుండినట్లు తెలిసికొనిన యే మానవతి దుఃఖింపకుండ నుండగలదు" అట్లు మూర్ఛిల్లిన యాచిత్రకేసిని కొంతసేపటికి స్మృతిదెచ్చుకొని లేచి మెల్లన శయ్యాతలమును జేరి తన మనంబున నిట్లు వితర్కించుచుండెను.

"ఇప్పుడేమి చేయుదును. నన్ను విడనాడి యెచ్చటికేగితి" వని ప్రశ్నించిన నాతను ప్రత్యుత్తరమిడునా? కల్ల రంకాడ నేర్చినవాడు బొంకాడ నేర్వకుండునా సాధా! నాకంటె నెక్కుడు సుందరీమణుల పొందు లభించినదాయని ప్రశ్నించిన నాత డేమని ప్రత్యుత్తరమిచ్చు నోగదా? ఆహా! ఇందువలననేగదా పురుషుల ప్రేమకును బదనికల కును మూలము లేదందురు. ఇట్టి దేశాభోలును. నేనేమైన ప్రశ్నించి తినా తనరహస్య మెరిగితినని దురాగ్రహావేశుడై నన్నింకను యెట్టి యధోగతికి పాలుసేయునోగదా ? ప్రశ్నింపకున్నయెడల యీతని నీ కార్యవిధానమునుండి తప్పించి నిండుకౌగిట నీతని నిలుపుటకు తగిన వెర వెద్దియును దోచుటలేదు. రహస్యముగా నాతని వెంబడింతునా? అయ్యో! ప్రమాదమే. పరులెవ్వరైన అర్ధరాత్రిమున పోవుచున్న నన్నుగాంచిన నిందింతురుగదా! లేనిపోని నేరము నాపై మోపబడుట కెక్కువ అవకాశ ముండునుగదా! మరియు తన్ననుసరించి వచ్చు చున్నానని నావిభు డెఱింగినచో నన్ను దండింపక నూరక విడచునా? కావున నయ్యది సరియైనమార్గము కాజాలదు. పోనిమ్ము ఈతడు నన్ను సంతుష్టిపరచుచుండె నదియే పదివేలని భావించి యూరకుం దునా! అట్లైనచో నీతని వ్యామోహము దినదినాభివృద్ధినిగాంచి తుద కసాధ్యమగునోకదా?" అని పెక్కువిధముల వితర్కించుకొనుచు నేమిచేయుటకును పాలుబోవక యెప్పుడు తెల్లవారునా యెప్పుడు నాస్నేహితురాండ్రతో కలిసి తగిన కార్యవిధాన మాలోచింతునా యని తలపోయుచు నిద్రించెను.

పరాక్రమకేతుడు బకావలి చెంతకరిగి యామెతో కొంతతడవు సంభాషించి వేకువయైనతోడనే యంతఃపురమున కరుదెంచి యెప్పటి యట్లు తన ప్రేయసిప్రక్కను నిదురించెను.

తెల్లవారినతోడనే బకావళి తన చెలికత్తెల నిరువుర వెంటబెట్టు కొని యొక రహస్యప్రదేశమున కేగి రాత్రి తాపడిన పరితాపమునంతయు దెల్పి అందుల కనుకూలమైన మార్గమేదైన నాలోచింపుడని వారల బ్రతిమాలుకొనియెను. వారును "అమ్మా! యిందులకై చింతింప కుము. నేడెట్లైనను అతని రహస్యమున నావకాశ్యాగ్రముగా గ్రహించి అందులకు దగిన ప్రతివిధానమాలోచించి జెప్పెద"మని బాసయిచ్చి యామె నోదార్చిరి. పరాక్రమకేతునకు యీసంగతి సుంతయు తెలియనే తెలియదు; నాటిరాత్రికూడ పరాక్రమకేతుడు యెప్పటియట్లు బకావలిని చేరజోయెను. కాని చెలికత్తె లిరువురును అతని నీడవోలె ననుసరించుచునే యుండిరి. పరాక్రమకేతు డాకపరిష్ఠైనను వెనుక తిరిగి చూడకయే బకావళీ ఆలయమున కరిగెను. వారును ఆలయము సమీపించి దూరముననుండి ఆతని చర్యలను పరికించి త్వరితగమనమున చిత్రకేసి చెంతకేగి సమస్తవృత్తాంతమును ఆమె కెరుకపరచిరి. అంత నామె తన చెలికత్తెలను ప్రతివిధాన మరయుడని చెప్పి తనకు వారాతని రహస్యవృత్తాంతమును జెప్పినందులకై తగినట్లుగా బహుమాన మొసంగి పంపివేసెను.

మరునాడు వారు ముగ్గురును కలసి ఆలోచించి యాతీర్మానమున కెట్టకేలకు వచ్చిరి పగటిపూట ఆదేవళమును ధ్వంసమొనరించి అచ్చట దేవాలయముయొక్క నామరూపములేమియు మిగులకుండనట్లుగా జేయవలయును. అట్లొనర్చిన నాతడు రాత్రి సంచారమును మానునని నిశ్చయించిరి. తోడనే యామె చెలికత్తెలకు గావలసిన ద్రవ్యమొసంగి యాదేవాలయమును ధ్వంసమొనర్చుడని చెప్పి పంపెను. వారును పెక్కురు పనివాండ్రను నియోగించి యాదేవళమును భగ్నమొనరించి దేవళముండెడి యానవాలైన లేకుండునట్లుగా జేయించెను.

మఱునాఁడు నెప్పటి యట్లు పరాక్రమకేతుఁడు బకావలిని చూడవలయునని పోయి యచ్చట దేవాలయమును గానక యత్యధికముగా చింతించి—తల్లీ! అహో, సాహసమున్నైన జూచుకొని యుపేక్షితానందమును బొందుచుండిరి. నన్ను జూచి యాదైవము నేటినుండి యయ్యదికూడ లేకుండ జేసెనే, యని పెద్దయుఁ బ్రొద్దు విచారించి చేయునది లేక నగరి యంతఃపురమును చేరఁబోయెను.

పరాక్రమకేతుఁడు బకావలిపై ధ్యానముంచి యనుదినమును వాహ్యాళికై యాదేవాలయముండెడు చోటికేపోయి కొంతతడ వందు గూరుచుండి విచారించుచుండువాఁడు అట్లుండ నొక్కనాఁ డొక తెలుకులవాఁడు పరాక్రమకేతుని చెంత కరుదెంచి అయ్యా అయ్యా! ఈ స్థలమును నాకు కౌలున కిప్పింపుదు, ఏదోపంట పండించుకొని జీవనమును నిలువబెట్టుకొందునని యతిదీనముగా ప్రార్థించెను. అతఁడందులకు సమ్మతించి యాభూమి వాని కొసంగి సేద్యము చేసికొమ్మనియెను. ప్రభువనుజ్ఞ యిచ్చినతోడనే యాతఁ డెక్కుడగు నానందము నొంది యాప్రదేశమునకు నలువైపులను కంచెలను పాతి యందు నువ్వుజల్లెను. క్రమక్రమమున నావిత్తనములు మొలకలెత్తి యెదుగ నారంభించెను. పరాక్రమకేతుడప్పటికిని బకావలిపైనుండిన మనసును ద్రిప్పుకొనజాలక యనుదినమును యాపైరుచెంత కరిగి కూరుచుండి యద్దానినిదిలకించి యానందించుచుండెను. ఇట్లుండ యాపైరుకొన్ని దినములకు ఫలించెను. కాని యాపొలమునకు మధ్యనున్న యొకనువ్వు మొక్క మిక్కిలియేపుగా నెదిగి మనోహరమైన యాకృతితో నొప్పుచు నెల్లరకు మహదానందమును గూర్చుచుండెను. పరాక్రమకేతు డాచేనునుగోయునప్పుడు సమీపముననుండి యాయేపుగాపెరిగిన మొక్కను విడిగాదీయించి యాఫలవస్త్రమున కిట్లనియెను. ఓరీ! ఈవృక్షముయొక్క

గింజ లన్నిటిని గొనిపొమ్ము. నీస్వంతమున కుపయోగించుకొను మనియెను. వాడును అట్లే యాచరించెను.

బకావలి తెలుకులవాని యింట జన్మించుట

కొన్ని దినములకు యా తైలవర్తకుని భార్య గర్భముధరించి నవమాస స్ఫూర్తియైనపిమ్మట నొక స్త్రీ శిశువును కనియెను. ఆ బాలిక యతి మనోహరమై యుండినందున లోకులెల్లరును యా బాలికను గూర్చియు నాబిడ్డ చక్కదనమును గూర్చియు ముచ్చటించు కొనుచుండిరి. ఈసంగతి భూపాలకుడై యున్న పరాక్రమకేతు డాలించి యా తైలవర్తకునిచే యాబిడ్డను దెప్పించి చూచి తాను యెట్లగునని భావించియుండెనో యట్లే యగుట కెంతయో సంతసమంది యావర్త కున కిట్లనియెను. "ఓరీ! ఈబాలిక కెట్టికొదువయు గలుగకుండునట్లు పోషించుచుండుము. ద్రవ్యమునకు లోభింపకుము. నీకు వలసినప్పుడెల్ల ద్రవ్యమున మాయొద్దనుండి గొనిపోవుచుండుము అని చెప్పి వానికి విశేషముగా ధనమిచ్చి పంపెను. ఆవర్తకుఁడు సంతోషమున నింటి కరిగి భార్యకు కుమారికనిచ్చి భూపాలుఁడనిన వాక్యముల నామె కెఱింగించి భూపాలుఁడు తనకు బహుమానముగా నొసంగిన ద్రవ్య మును చూపెను. ఆమెయు నెక్కుడుగా ముదమందెను.

శుక్లపక్షపాకరుని చందమున నా బాలిక దినదినాభివృద్ధి గాంచి షోడశవర్షముల ప్రాయమునుజెంది యుండెను. అప్పు డామె సోయగమును గాంచి పెక్కురు రాకుమారు లామెను పెండ్లియాడ వలయునని జనుదెంచి యా తెలుకులవాని కెక్కుడుగా బహుమతుల నొసంగుచు యాకన్నెమిన్న చిత్తమును దమవంక కాకర్షించుకొనుట కామెకు విలువయైన భూషణములను వలువలను యొసంగుచు యామె కటాక్షము గోరియుండిరి. ఆవర్తకుడును యామె సాహసించివచ్చిన

వారందఱితోడను "ఇయ్యది మాకుమార్తె యైనను పసితనము నుండియు భూపాలుని దబ్బునవలన బోషింపబడినది ఆత డీమె నెవ్వని కీయనెంచెనో తెలియదు. ఆతని యభిప్రాయమును గైకొనకుండ నీకన్నె నెవ్వరికిని యర్పింపజాలను." అని పలుకుచున్నను పెక్కురు 'భూపాలుఁడు భార్యయుండ మరల పెండ్లాడ' డని భావించి వర్తకు డిష్టపడినయెడల తమ కాకన్య లభించునని తలంచి యాతనినే గొండఱు నమ్మి వర్తించుచుండిరి. పెక్కు రాతని భూపాలునిచెంతకు బోయి రావలసిన దని బ్రతిమాలుకొనిరి.

ఆవైశ్యవర్తకుడును ఆమె నాశించి వచ్చువారలబాధ పడలేక యొకనాడు భూపాలున సన్నిధికేగి యాతనికి నమస్కరించి "దేవా! నాకుమార్తె యుక్తవయస్కురాలై యుండెను. పెక్కు రామె నపేక్షించి యనుదినమును మాయింటిచుట్టును దిరుగుచుండిరి. వారి కెట్టి సమాధానమును చెప్పక వారితో మాకన్యను భూపాలుడెవ్వని కిమ్మనునో వారికే యొసంగుదునని పల్కుచుంటిని. కావున తమ యభిప్రాయమును దెలుపు" డని వినయవిధేయత లుట్టిపడబల్కెను.

భూపాలుఁ డాతని గాంచి ఓయీ! నీకుమార్తెను సామాన్య కాంతగా భావింపకుము. ఆమె చక్రవర్తి చేబట్టదగినది. ఆమెతో నీవాలోచించిన యెడల నీకు సర్వమును తెలియనగును. నేనామెను వివాహము గావించుకొందునని పల్కి కొన్ని బహుమానములనొసంగి యాతని పంపివేసెను. ఆతడును గృహమున కేగుచు కట్టా! ఇదేమి వింత భూపాలున కల్లుడైన యాతనికి బిడ్డనిచ్చిన యెడల నాతనితో సరితూగగలమా! కార్యమున పెరవారలచే నెట్టిమాటలను పడకుండ గలమా యని వితర్కించుచు సందేహించుచు గృహమున కరిగెను. ఆబాలిక తండ్రిచెంత కరుదెంచి యాతని ముఖలక్షణములనుబట్టి యాతని విచారమును గుర్తించి జనకా! నా వివాహమునుగూర్చి

యనుదినమును చింతింతురేల నేను పూర్వజన్మజ్ఞానము కలదానను. తొలిబాముున నేను గులోబకావలి యను దేవకన్యకను కొలది కాల మోర్చియుండిన యెడల సర్వము చక్కబడును. నావిభు డరుదెంచి నన్ను తనతో తీసికొనిపోగలడు. అని యాతనికి దన వృత్తాంత మంతయును దెల్పి యాతని సంతోషపరచెను. ఆతడును దైవముపై భారమువైచి కానున్న దెట్లో కాగలదని తలంచి వివాహప్రయత్నమే తలపెట్టక మిన్నకుండెను.

## పరాక్రమకేతుడు తెలుకులవాని కుమార్తెగా జన్మించిన బకావలిని పెండ్లియాడుట

బకావలియొక్క శాపము తీరినతోడనే యనేక భూతగణంబు లామెను చూచుట కరుదెంచి విలువయైన భూషణములను చీనిచీనాం బరములను గొనితెచ్చి యామె నర్పించుచుండిరి. బకావలి రత్నము లను భూషణములను గైకొని యన్నిటిని జనకున కందించుచు జనకా! యీరత్నములను భూషణములను గైకొనుము. ఇవి నీ జీవితాంతము వఱకె గాకుండ పెక్కుతరములవఱకునుగూడ సరిపడగలవు. నాకింక సెలవొసంగుము. నాభర్తను కలిసికొందునని యాతనిచే ననుజ్ఞగొని యొక విమానముపై నెక్కి యచ్చోనిని చిత్రకేసినియుండు సౌధమునకు గొనిపోయెను.

పరాక్రమకేతుడు చిత్రకేసినితో సరససల్లాపము లాడుచు నామెను బుజ్జగించుచుండెను. బకావలి విమానమునుండి డిగ్గి లోని కేగి భర్తృపదములకు నమస్కరించెను. తోడనే యాత డామెను లేవనెత్తి ప్రియా! తిరుగ నిన్నెన్నాళ్ళకు గంటిని అని పలుకుచు నామెను యాలింగన మాచరించుకొని "చిత్రకేసినీ! ఈమెను దిల

కించితివా ? బకావలి యను దేవకాంత ఈమెకొఱకేసుమా నేను మీాపట్టణమునకు రావలసివచ్చినది. ఈమెకొఱకేసుమా నేను పెక్కు లగు నిడుములకులోనై కడకు నీజనకునిచే గారాగృహమునగూడ బెట్టబడితిని" యని యామెకు సకల మెఱింగించెను. చిత్రకేసిని యసూయనువిడచి బకావలిని కౌగిలించుకొని తన నేరముల క్షమిం పుమని వేడుకొనియెను. అనంతరము బకావలి చిత్రకేసినిజూచి "చెల్లెలా ! త్వరపడుము. నీకీతనియం దనురాగముగలదేని వెంటనే బయలుదేరుటకు సిద్ధపడుము. క్షణమైనను జాల మొనరించుటకు వీలులేదు" అని పల్కుచు ఆమెను తొందరపెట్టసాగెను. ఆసమయ ముననే తపోవనమున కరిగియున్న చిత్రకేసిని జనకుడు ఆమెను జూడ వలెనను నపేక్ష తపంబునకు భంగము గలిగించి బయలుదేరి చను దెంచెను. చిత్రకేసిని జనకునకు నమస్కరించి తనకు తన విభునితో పోవుట కనుజ్ఞ యొసంగవలసినదని ప్రార్థించెను. అంత నాతడు "కుమారీ ! నిన్ను చూడవలయునను కుతూహలముచే తపోభంగము నకై సహించి యిట్లరుదెంచితిని. ఇప్పట్టున నీవు నన్ను విడచిపోవ యత్నించుచుంటివి. ఇయ్యది నీకు తగునా రాజ్యమంతయును నీ కొసంగి యల్లునిచెంత నుంచుకొని సౌఖ్యరసాంబుధిని దేలుచు కాల యాపన మొనరింపవలయునని కనిపెట్టుకొనియున్న నన్ను విడచిపోవ నెంచుట తగునా" యని కుమారీ వియోగమున కోర్వజాలక విల పించుచుండెను. అల్లారుముద్దుగా పెంచిన పుత్రికలను అత్తవారింటి కనుపునపుడు కన్నీరునింపక కఠినమానసు డెవ్వడును యుండరనుట నిక్కువముగదా.

అట్లు విలపించుచున్న జనకుని సమయోచితా లాపములచే నూరడించి ఆతనివలన ననుజ్ఞ గొనియెను.

### పరాక్రమకేతుడు బకావళీ చిత్రకేసినులతో తన పట్టణమున కేగుట.

అతులితంబగు వైభవంబున కదలి చనుచున్న పరాక్రమకేతు నకు వస్త్రభూషణాద్యలంకారములను శయ్యాసనభాజన ఘోశాకళా చికాదిగృహోపకరణంబులును, వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్య రాగ, మరకత, మాణిక్య, నీల, ప్రవాళ, ముక్తికాది వివిధరత్నసంఘ టితభూషణజాలంబులును, విచిత్ర పేశలకౌశేయచీనాంశుకంబు లగు దుకూలజాలంబులును, మృగమదఘనసారకుంకుమ రసంబు లాదిగాగల సుగంధద్రవ్యంబులతో నింపబడిన పేటికాసహస్రంబులును, సింధు యలజవ్వనంబున నివ్వటిల్లుచు రాకానిశాకరబింబ ప్రతిమాననముఖు లగు పరిచారికాసహస్రంబును, పవమాన తిరస్కృతజవంబులగు ఆజానేయ సహస్రంబులును, కులగిరులనైన మాటాడించు శక్తి సామర్థ్యములుగల్గిన మత్తమదవారణ సహస్రములును వరణంబుగా చిత్రకేసినికి జనకుఁడొసంగిఆలిని కొంతవరకు సాగనంపి మరలి రానే రక వెనుదిరిగి జూచుచువాఁడు దృష్టిపథమునుండి మఱుగుపడిన యనంతరము రాజనగరున కరిగెను.

పరాక్రమకేతుడు యిం[illegible] కలసి తన పట్టణ సమీపమున కరిగి తిలకవతీ మకరతటమునలో [illegible] బరచెను. వారును తమ వల్లభుడు లబ్ధవిజయుడై చనుదెంచుచుండుట నెరింగి అధికంబగు సంతోషమున పట్టణమంతయు నలంకరింప జేసి వారిని యెదుర్కొని స్వాగత మొసంగి పురములోనికి కొని తెచ్చుటకు తగిన యేర్పాటులను గావించవలసినదని యాజ్ఞాపించిరి. పౌరజనంబు లును చిరకాలము విదేశపర్యటన మొనరించి లబ్ధవిజయుడై చనుదెం చుచున్న భూపాలునకు స్వాగత మొసంగుటకై వీధుల నన్నిటిని చక్కగా నలంకరించిరి. పన్నీరుల వీధులన్నియు దడపిరి. ముత్యాల

తోరణములు గట్టిరి. ఎడనెడ చలువపందెళ్ళను నిర్మించి రంభాస్తంభములతోను చిత్రవిచిత్రములైన కాగితములతో చేయబడిన బుట్టలతోడను దేదీప్యమానములగు దీపములతోడను నలంకరించిరి.

పౌరులందరు అమితోత్సాహంబున తమ ప్రభువున కెదురుగా జని జయజయధ్వానము లొసంగుచు కర్పూరనీరాజనంబులిచ్చి బకావళీ చిత్రకేసినులకును పరాక్రమకేతునకును కర్పూరదండల నొసంగి బహూకరించిరి. పరాక్రమకేతు డిట్లు జయజయధ్వానములొసంగుచుండ పురంబు ప్రవేశించి పౌరజనులకోర్కె దీర్చుటకై పురమంతయును నూరేగి తమ ప్రాసాదమును జేరనరిగిరి. తిలదవతి మరకతమణు లిరువురును పసిండిగిండియలతో పన్నీరు పట్టుకొని పూజాద్రవ్యంబులు పళ్ళెరములనుంచి వల్లభున కెదురుగాజని యాతనికి సాష్టాంగనమస్కారంబు లాచరించి యాతని పాదపద్మములు పన్నీటగడిగి పైటచెంగుతోతడియొత్తి పూజాదికము లాదరించి నీరాజనంబిచ్చి కైదండ యొసంగి అంతఃపురమునకు తీసికొనిపోయిరి. తిలదవతీ మరకతమణు లిరువురును బకావళీ చిత్రకేసినులను సమాదరణపూర్వకంబుగా గాగిలించుకొని సన్మానించిరి.

పరాక్రమకేతుడు భార్యలతో సుఖముగా కాలము గడపుచు కొన్నిదినములు వేగించెను. అనంతర మొక్కనాడు బకావలి యాతనితో నిట్లనియెను. "నాథా! మనమరుదెంచునపుడు మజ్జనకు డెంతయో విలపించి మాసమున కొకపరియైనను రావలసినదని చెప్పియుండెను. పెక్కువత్సరములైనను ఆతని జూచుట కొక్కపరియైనను బోయియుండలేదు. అతి క్షేమని భావించునో, యాతడు మన క్షేమము నెఱుంగుటకై యెంతగాపరితపించుచుండెనో దెలియదుగదా? మనము క్షేమముగానుంటిమని యాతని కొక్కమారైనను వర్తమాన మంపి

యుండలేదు. ఇట్టిది సాహసమని భావించితిరా" యని పల్కెను. అంత పరాక్రమకేతు డిట్లు పలుకుచున్నను సతులు కర్తయింట శాంతసౌఖ్యము లభించుచున్నను పుట్టింటి మమకారము తప్పదనుట కియ్యది మేగబా నిదర్శనము. కానిమ్ము. ఇప్పుడే వారికి వర్తమాన మంపుదము. మరియు వారి నొకపరి యిక్కడకు కదలించి మనల నాశీర్వదింపవల యుననికూడ వర్తమాన మంపెదను. వారినే కాక రూపావతిని యామె తల్లిదండ్రులను యఘటితచరితను కూడ పిలువవలయునని సంకల్పించి యుంటిని. అని పల్కి మరునాడు కొందరు భటులను బిలచి వేర్వేరకు సుపత్రముల వ్రాయించి యొసంగి బంధుజనులను గొనిరావలసినదని చెప్పి పంపెను.

పరాక్రమకేతుని జూడ బంధుహితాదు లరుదెంచుట

బకావలి తండ్రి చిరకాలమునుండి తమ యల్లునివద్ద నుండి యొక్కవర్తమానమైనను రాకుండుటచే నెక్కుడగు పరితాపమొంది కుందుచుండెను తనంతటతానేగి చూచివచ్చుట లాఘవమని దలంచి యేమియును చేయనేరనిచోటికి చింతించుచుండెను. అట్టియెడ బరాక్రమ కేతునిచే పంపబడిన భటు లరుదెంచి యాతనికి కమ్మ నొసంగి యిట్లనిరి. "దేవా! తమ కుమారితయు నల్లుడును సుఖులైయున్నారు వారు మిమ్ములను చూడవలయునని మిక్కుటముగా నభిలషించు చున్నారు. వారు బంధువర్గమునంతకును గొప్ప విందు చేయ సంక ల్పించుకొని మీవద్దకు మమ్ము బుత్తెంచిరి. కావున తప్పక దయ చేయవలయును" అని విన్నవించిరి.

ఆతడును వారివలన కుమార్తెయొక్క క్షేమోదంత మాలించి పరమానందభరితుడై తమ కట్టి శుభవర్తమానమును గొనివచ్చిన భటులకును మంత్రులకును విశేషముగా పసదనమిచ్చి గౌరవించి

సకుటుంబముగా బయలుదేరి వచ్చుచుంటిమని కమ్మ వ్రాయించి వారికిచ్చి మున్ముందు పుత్తెంచెను. తదుపరి యాతఁడు తల్లినకును తక్కుంగల ముఖ్యబంధులకును దగిన వస్త్రాభరణములును బహుమతులును జేకొని తన భార్యను ముఖ్యబంధువులను తగినపరివారజనంబులను వెంటబెట్టుకొని యొక్క శుభముహూర్తమున నల్లని పట్టణమునకై బయలుదేరెను.

రూపావతి తల్లిదండ్రుల కడకు బలప్రసాదుఁడను సచివకుమారుడు సముచిత పరివారముతో బంపబడెను. బలప్రసాదుఁడు భూతరాజును సందర్శించి యాతనికి పరాక్రమకేతుఁడు స్వయముగా లిఖించియిచ్చిన యుత్తర మొసగెను. అతఁ డాయుత్తరము చదివించెను. అందిట్లు వ్రాయబడి యుండెను.

“పరాక్రమకేతుఁ డనేకవందనము లాచరించి వ్రాసికొను విన్నపములు. తమరు నేను తొల్లి యుమ్మరమైన తాపమున మ్రగ్గుచుండ నత్యధికాదరమున నన్ను సంరక్షించి నాజీవనమున కేకమాత్రాధారమైన బకావలిని సమకూర్చిరి. ఇందులకు తమకు నేను కృతజ్ఞుడనై మెలంగవలసి యున్నది. తమరు నాయందు మున్నెట్టి యనురాగమును నిల్పియుండిరో యాయనురాగమునునిల్పి నేఁడుగూడ నన్ననుగ్రహింపవలసినదని ప్రార్థించుచున్నాను. బకావలియు నేనును తమ యాశీర్వచనముల బడయుటకు నిరీక్షించుకొనియుంటిమి. కావున మాప్రార్థన మన్నించి మాపురమునకు విచ్చేయవలయును.

ఇట్లు,

ప్రణామశతంబు లర్పించి ప్రార్థించు మీయనుగ్రహపాత్రుఁడు,

పరాక్రమకేతుఁడు.

ఆ యుత్తరమును విని భూతరా జధికానందమునంది యాతనికి తమపై నున్న [illegible] సంతసించి తన ప్రియురాలితో

నీసంగతి యంతయు దెల్పి ప్రయాణమునకు సిద్ధము కమ్మని హెచ్చ రించెను.

బలప్రదుడు రూపావతిని గాంచి విస్మయమందుట

బలప్రదుఁడు రూపావతిని సందర్శించి యామెకు పరాక్రమ కేతు డొసంగిన యుత్తరమును గులోబకావళి మరకతమణు లొసంగిన యుత్తరములను నొసంగెను. బలప్రదుఁడు రూపావతి సౌందర్యమును గాంచి మున్నెన్నడును నంతటి సౌందర్యముగలవారిని చూచియుండక పోవుటచే ముగ్ధుడై యామెను పరిణయమాడ సంకల్పించుకొనియెను. కాని తానప్పుడు త్వరపడినయెడల కార్యము భంగమగుననియు, తన యజమానునకు గూడ నగౌరవము సంభవించుననియు దలంచి యేమియును బలుకనేరక నిశ్చేష్టితుడై కన్నులతో నామె సౌందర్య మును తనివిదీర గ్రోలుచుండెను, రూపావతియు నాతని సోయగమును గాంచి సంభ్రమాశ్చర్యములకు లోనయ్యెనే కాని తానొక మానవుని వరించిన జనకుడు కోపించునని తలంచి తన యభిమతమును వెలి గ్రక్కక లోలోననే యిమిడ్చుకొనియెను. అట్లు కొంతతడవు యిరువు రును చేష్టలు దక్కియుండిరి. తదనంతరము బలప్రదుడు యుత్తరముల సంగతి జ్ఞప్తికి దేగా నామె స్మృతి దెచ్చుకొని వానిని విప్పి యిట్లు చదివికొనియెను.

"రూపావతీ! నీవు నేను పడుచున్న సంతాపము గాంచి యయ్యది నీకు సంభవించునట్లుగనే భావించి యెంతయో ప్రయత్నించి నీజనకునకును, జనయిత్రికిని నాయందు కనికరము గలుగున ట్లొనరించి యా మహానుభావునకు నాజననీజనకులకు నన్నర్పించునట్లు గావించి మహోపకార మాచరించియుంటివి. అట్టి నీయుపకార మెన్నటికిని

మరువజాలను. నాపై మున్నెట్టి కూర్మిగలిగియుంటివో నేనుగూడ నట్టి వాత్సల్యమున నే నాపై నిల్పి నన్ను సందర్శించుటకు రావలయును.

నీసందర్శనమున కెదురుచూచుచు నిరీక్షించుచున్న

నీయనుంగు సోదరి,

బకావలి.

రెండవయుత్తరమును విప్పి యిట్లు చదివెను.

రూపావతీ! నీకు నే నొనర్చిన సహాయ మతిస్వల్ప మైనను నన్ను మెక్కు డనురాగమున నాదరించి ప్రేమించి లాలించి నా మనోరథమును దీర్చుటకై విశ్వప్రయత్న మొనరించి సాధించితివి. నీమే లెన్నటికిని మరువను. బకావలియు మరకతమణియు ననుదినమును నిన్ను తలంచుచు నీరాకగోరి యున్నారు. కావున వారలను సంత సింపజేయుటకును నీయభిమానమునకు గురియైన నన్ను సంతసింప జేయుటకు నీవు తప్పక రావలయును.

అనియున్న యుత్తరములను జదువుకొని బలప్రదుని జూచి తగు మాటలాడి యాతని బహూకరించి పంపెను. తదుపరి రూపావతి తన జనకునికడ కేగి తన్నుగూడ మీతో గొనిపోవుడని పెక్కువిధ ముల బ్రార్థించెను. ఆతఁడు కుమార్తె యభిలాషమును దీర్పనెంచి యంగీకరించెను. భూతరాజు కుమార్తెతోడను భార్యతోడను యుచిత పరివారముతోడను బయలుదేరి పరాక్రమకేతుని పట్టణమున కేగెను.

పరాక్రమకేతుఁడు బంధుజనుల సన్మానించుట

పరాక్రమకేతుఁడు బంధుజనంబు లెల్లరకు దగిన విడుదుల నేర్పాటు గావించి వారలకు సమస్తసౌఖ్యములు గలుగున ట్లేర్పాటు గావించి యనుదినమునను గానకళాప్రదర్శనములచేతను, మల్లవిద్యా

ప్రదర్శనములచేతను యింద్రజాలమహేంద్రజాలములచేతను వారలను సంతసింపజేయుచు వారి కెట్టి లోటుపాటులును కలుగనీయకుండెను. అఘటితచరిత తన యల్లుని ప్రాభవమునుగాంచి తనజన్మ తరించినదని సంతోషసారావార వీచికల దేలియాడుచుండెను.

బకావలి మున్నుగాగల కాంతలందఱును రూపావతిని తక్కుంగల స్త్రీజనంబును యత్యధికసంతసంబున దినములను నిముషములట్లు వేగించుచుండిరి. బకావలితండ్రి యా సౌధము ప్రాకారాదులు తన కూర్మిసుతకు దాను నిర్మించునట్లుండుట కెంతయు సంతసించి యందుగల లోపమునదీర్చ గులోబిమొక్కను గొనివచ్చి గులోబకావలి సౌధమునకు సమీపముననున్న జలయంత్రమధ్యమున నాటించెను. ఆమొక్క యచ్చట నాటింపబడినతోడనే యావనమున కింతింత యనరాని సౌందర్యముకలిగెను.

కొన్నిదినము లేగినపిమ్మట బకావలితండ్రి స్వగృహమున కరుగుటకు అల్లుని సమ్మతింపజేసి పరివారముతో బయలుదేరెను. పరాక్రమకేతుడును యత్తమామలకును వారి పరివారములకును దగిన వస్త్రభూషణాద్యలంకారముల నిడి గౌరవపురస్సరముగా వారలను సాగనంపెను. తదనంతరము భూతరాజు తనగృహమున కరుగ యత్నించుచుండు టెఱింగి పరాక్రమకేతుడు వారిని సమీపించి యింకను గొన్నిదినము లిట నిలువవలసినదని పెక్కువిధముల ప్రార్థించెను. కాని యాతఁడు తనకచ్చట నిలుచుటకు వలనుపడదనియు అవశ్యాచరణీయములగు కార్యములింట నున్నవనియునుజెప్పి పరాక్రమకేతుని సమ్మతింపజేసెను. కాని బకావలి మున్నగువారు రూపావతిని విడువజాలక యామె సాంగత్య మింక గొన్నిదినముల వఱకైన నొసంగవలసినదని ప్రార్థింపగా నాతడియ్యకొని భార్యతోడను పరివారముతోడను స్వగృహమున కరిగెను.

బలభద్రుడు రూపావతినిగాంచి మోహావేశుడగుట

బకావలియున్నగువా రెల్లరును రూపావతితో అతిమైత్రిని మెలంగుచు క్షణమైనను నామెను విడచియుండజాలకుండిరి. రూపావతియు వారలతోటి సంభాషణమే సంతోషదాయకమైనట్లును వారలతో విహరించుచుండుటయే మహదానందమని భావించుచు దినములు గడుపుచుండెను.

బలభద్రుడు రూపావతినిగాంచిననాటినుండియు నిద్రాహారము లెరుంగక దినదినము కృశించుచుండెను. క్రమక్రమముగా నాతడు మతిలేనిపగిది దిరుగు నవస్థను జెందెను. బలభద్రుని కంటికి గానబడిన దెల్ల రూపావతివలెనే గాన్పించుచుండెను. కాని సాహసించి యామె పేరైనను నుచ్చరింపడయ్యెను. అత డనుదినమునను రూపావతి సందర్శనము లభించుటకై యుపవనప్రాంగణమందు వేచియుండి వారు తోటలోని కరుగునప్పుడును తోటనుండి వెలికరుదెంచుచుండి నప్పుడును గాంచి యానందించుచుండెను. ఇట్లు విరహవేదనాదోధూయమానమానసుడై యెట్లో రూపావతి శయనించుసౌధము నెఱింగి యామె సముఖమునకుబోయి తనయవస్థ నెఱింగించుకొని యామెను ప్రార్థింపవలయునని సంకల్పించుకొనియెను

రూపావతియు పగటిపూట స్నేహితురాండ్రతో దిరుగుచు కాలక్షేపము చేయుచుండుటచేత బలభద్రునిగూర్చి చింతించుట కవకాశము లేకపోయినను రాత్రిభాగమున తనచెంత నెవ్వరును యుండకుండుటచే నెక్కుడవకాశ ముండుటచే రాత్రి నిద్దురబట్టనంతవఱ కాతనిచర్యలే గణించుకొనుచు నాతని రూపమునే చింతించుకొను చుండెను. కాని యొక్కొక్కనాడు తాను—భూతకులసంజాతయగు తాను ఒకమానవుని వరింపతగదని తీర్మానించుకొని యాతనితనతలపు

నుండి పారద్రోలుటకు యత్నించుచుండును. ఒక్కొక్కనాఁ డామె తన మనస్సునకు తానే సమాధానము చెప్పుకొనుచు బకావలి మర కతమణి మున్నగు భూతకాంతలు మానవుని వరించి యాతనిని పరి ణయమాడి సుఖించుటలేదా యని ప్రశ్నించుకొని తనవలపుకాని సౌందర్య మభిలషించుచుండును. ఇట్లు ఆమె డోలాయమానమాన సయై యుండెను.

ఒకనాటి రాత్రి యామె యొక హంసతూలికా తల్పమున శయనించియుండగా బలప్రమద్దుఁడు లోనికేగి యామెను గాంచి మోహాతిరేకమున నామెను బిగ్గకౌగిలించుకొని చుబుకమును ముద్దిడి శృంగారచేష్ట లొనరించి వెడలిపోయెను. అతఁడు వెడలిపోవు సమ యమున రూపావతి యాతని గాంచి యాతని బలప్రదునిగా నెఱింగి యాతని కెట్టివ్యథను కలుగనీయరాదని తలంచి గోలసేయక చెలికత్తెల నైన మేల్కొలుపదయ్యెను. ఆనిశాశేషమంతయును తర్కవితర్క ములతో వేగించి నేమిచేయుటకును మనస్కరింపమి సూర్యోదయ మైన యనంతరము యామె బకావలిచెంత కరిగి యామెతో నిట్లని యెను.

చెలీ బకావలీ! ఇన్నిదినములనుండి నీయొద్ద నొక కొరంత లేకయుంటిని. నే నెన్నిదినములుండినను నీవు సంతృప్తి వహించవు. నాకును నిన్ను వదలిపోవలయునని యుండదు. కాని లోకులు కాకుల వంటివారు గదా! యౌవనమున నున్న నేను తడవిందు నిలిచిన యెడల లేనిపోని నేరములు నాపై నారోపింతురేమో యని తోచు చున్నది. మరియును మీరెవరును సుఖించుచుండ గాంచినకొలది నాకును ఐహికవాంఛలపైన బుద్ధిపొడముచున్నది. అనునంతకు బకా వలి అడ్డమువచ్చి "అక్కా! అయినయెడల నీకుకూడ తగినవరుని యన్వేషింపనుంటివా? అట్టి యభిప్రాయమే యున్నయెడల నిస్సంకోచ

ముగా దెల్పుము. నీపురదిగారిని వరాన్వేషణకార్యమునందు నియో గించెదను'' అని పల్కెను. చాలుచాలు నూరకొనుము. ఎవ్వరైన విన్నమెపల నవ్వి పోదురు ఇంతమాత్రమునకే తత్తరపడి గుట్టువెడు నట్లు కట్టిడీ మానవుల చెట్టబట్ట నుంకింతు ననుకొంటివా? నా చిత్తస్థైర్యము నీవెఱుంగక ఇట్లనుచుంటివని తలంతును. ఆమాట లటుంచుము. జననీజనకులు నన్నిట దిగవిడచి జని చాలకాలమైనది వారు నన్నుగూర్చి యేమనుకొను చుంటిరో తెలియదుగదా మరియు నింకొక్కటి వినుము. చుట్టమైవచ్చి దయ్యమై పట్టుకొనినట్లు చూచు టకై చనుదెంచి ఇన్నినాళ్ళిచ్చట యుండుటయే చాలును. ఇంక నా కనుజ్ఞ యిమ్ము పోయివచ్చెదను. అని తన మనోవికారమంతయును హృదయముననే యణచుకొని రూపావతి పల్కిన పల్కులు బకావలి విని ''రూపావతీ! ఇదేమే యిట్లాడుచుంటివి ఇచ్చటనుండుటకు నీకు వెగటుగానున్నదా? లేక జననీజనకులను సందర్శింపవలయునను బుద్ధి జనించినదా? ఏమైనను ఇప్పుడు నిన్నంతలో వెడలనీయదలచుకొన లేదు'' అని పల్కెను. రూపావతి ''అక్కా! నన్ను నిలువరింపజూడ కుము నాకేలకో తల్లిదండ్రులయొద్ద కేగవలెనను వాంఛ పొడమినది'' అని పెక్కువిధముల నామెకు బోధించి యామెను సమ్మతింపజేసి పరాక్రమకేతునితోకూడ జెప్పి ప్రయాణమునకు సంసిద్ధురాలయ్యెను. పరాక్రమకేతుడు ఆమెను తన సోదరిని సత్కరించినట్లుగా సత్కరించి వస్త్రాభరణముల నొసంగి పసుపుకుంకుమలబెట్టి తగిన పరిజనములను తోడుగా నొసంగి యామెను జనకునింటికి సురక్షితముగా నప్పగించ వలెనని పరిజనుల నాజ్ఞాపించి పంపెను. రూపావతియు నిరంతర ప్రయాణము గావించి యెట్టి అంతరాయమును లేకుండ సురక్షిత ముగా పితృగృహమున కరిగెను.

భూతరాజు కుమార్తె నాలింగనము జేసికొని "అమ్మా! చిరంతర ప్రయాణముచే నలసి బడలియుంటివి. లోనికేగి హాయిగా భుజించి యించుక విశ్రమింపుము. తదుపరి నచ్చటి విశేషములను మాకెఱింగింతువుగాక లెమ్ము" అని యామెను త్వరపెట్టి గృహములోని కంపెను. తదనంతరము పరాక్రమకేసరిని భటులకును బహుమానము లొసంగి మజ్జనభోజనాదుల వారల సంతృప్తిపరచి మార్గాయాసము దీరునంతవఱకును వారలను తనపట్టణమున నిలిపి తదుపరి వారలకు మార్గమునందు కావలసివచ్చు నాహారపదార్థముల నొసంగి పంపించెను.

రూపావతి బలప్రదుని వియోగమున పరితపించుట.

రూపావతి బకావలియొద్ద తన రహస్యము నిసుమంతయు వెలువరింపక నామెచే ననుజ్ఞగొని తల్లిదండ్రులకడ కరుదెంచినది మొదలు చింతాక్రాంతయైయుండెను. చెలులతో మనసిచ్చిమాటలాడకుండెను పలువురు చెలికత్తెల నెల్లపుడును వెంటనుంచుకొని విహరించెడు నలవాటుగల యామె యిపుడేకాంతమును గోరుచు చెలికత్తెలతో చెప్పనైన చెప్పక యుపవనమునకు బోవుచుండెను. అట శుకపికంబుల యుల్లాసంపు పలుకు లామెకు వెగటుగదోచెను. మత్తమధుకరముల ఝుంకారధ్వను లామె కర్ణపుటంబులకు శూలముపోల్కి దోచెను. మందమలయానిలుం డనలసఖుడై యామె పరితాపమును ద్విగుణీకృత మొనరించుచుండెను. అందువలన నచ్చోట నిముషమైనను నిలువజాలక మరల యంతఃపురంబును ప్రవేశించును. అచ్చటనే తడవు నిలచిన తనగుట్టు బయటబడునేమోయను సంకోచమున మెలంగుచుండెను. చెలులెవ్వరైన చెంతజేరి యిట్లేల యుంటివని ప్రశ్నించిన నామె తొలుత ప్రయాణపు బడలికయనియు మరికొన్ని దినంబు లేగినపిమ్మట తన దేహమున నించుక యస్వస్థతగానున్నదని

యు, తప్పించుకొనుచుండెను. కాని యెవ్వరికిని దన మనోగతంబును దెలుపకుండెను. ఒకటి రెండుపర్యాయములు రూపావతి తన చెలుల కెవ్వరికైనను తన మనోగత మెఱింగించి తనకు సహాయ మొనర్ప వలసినదని ప్రార్థింపనెంచెను. కాని అంతలో వారు భూతములగుటచే తాను మానవుని వరించినందులకు మండిపడి తనకపాయము కల్గింతురని సందియము దోచుటచే నందులకు సాహసింపనేర దయ్యెను.

ఇట బలప్రదుఁడును రూపావతి జనిననాటినుండియును యెక్కుడగు మదనతాపమునకు జిక్కి బాహ్యజ్ఞానశూన్యుడై యుండెను. అతని ప్రవర్తన మెవ్వరును గనిపెట్టకుండిరి గాని శమంత యను పరిచారిక యాతని ప్రవర్తనమునగలుగు మార్పుల నేతుణమున కాలక్షణము గనిపెట్టుచు నాతడు రూపావతి యందనురక్తుడై యుండినట్లు తెలిసికొని యొక్కనాడాతడు మంతనంబున నున్న సమయంబున నాతని జేరంజని "ఓయీ! నీవిట్లుండుటకు కారణమేమి. పరికింపగా నీవొక కామినికై పరితపించుచుంటివనుట తెల్లమయ్యెను. నాకడ దాపరిక మొనరింపక సర్వమును నాకెఱుగజెప్పుము నాచేతనున్న సహాయమేమైన యొనర్చి నీకుసంతసముగూర్చెద"నని పల్కెను. ఆపల్కులాలించి బలప్రదుడు చిఱునవ్వున ఏమనుచుంటివి. నేనొక కాంతకై పరితపించుచుంటి ననుచుంటివా? తన్వీమణీ! కల్లకల్ల నాకెవ్వరిపైనను యనురాగములేదు. నాయం దేసుగుణములున్నవని యెవ్వరువరింతురు. కాన నాపైగల దురభిప్రాయమువిడచిపెట్టుము" అని తనమనోగతము మరుగుపరచుచుపల్కెను. అంత నాశమంత మరలవానికిట్లనియెను "ఓయీ! నాకడ నేలమరుగుపరచెదవు. రాత్రులందు నిద్దురరాక పరిపరివిధముల రూపావతిని దలంచుకొనుచు పరితపించుటెఱుంగ ననుకొంటివా? ఏపనిచేయుటకును మనస్కరింపక నీవుపడుపరితాపమును గుర్తింపలేదనుకొంటివా? రూపావతి యిటనున్నపుడు ప్రతిదినమునను పనియున్నను లేకు

స్నను పూలతోటచెంత కాచుకొనియుండుట గమనింపలేదనియే భావించెదవా? ఇంకను దెలుపుమందువా? వెఱ్ఱివాడా! ఊరక చెడి పోకుము. ఉన్నదున్నట్లు వచించితివా నీకుదగిన సహాయ మొసర్చెదను. నీవు నీ మనోగతమును నీయందే యుంచుకొని పరితపించుచున్న నేమైన లాభముండునని తలంచితివా? అయ్యది యున్మాదము మున్నగు ఘోరపరిస్థితుల గల్గించునని దలంపుము'' అని మరల ప్రశ్నించెను.

బలప్రదుఁడును కొంతపడి యాలోచించి సర్వమామె యెఱింగి యుండెననియును, ఇంక నామెకడ నేమిజెప్పినను యుపాయముండదని యును నిశ్చయించి సకల మామెకు దెల్పి యిట్లనియెను. ''శమంతా! ఆమెకొఱకై నేను యెట్టి పరితాపమందుచుంటినో ప్రత్యక్షముగా నీవు చూచుచుంటివిగదా? ఇంకను యిట్లే పరితాప మొందుచుండిన యెడల నిరాశాపీడితమై నాహృదయము వ్రయ్యలగునేమో యని తోచుచున్నది. కావున శీఘ్రకాలములో నామె సాంగత్యము లభించుట కనువైనమార్గ మన్వేషింపుమని యామెను పరిపరివిధముల బ్రతిమాలు కొనియెను.

శమంత బలప్రదునకు సహాయము చేయుట

అని తన్ను వేడుకొనిన యాతనిని తగు విధంబున నూరడించి ''ఓయీ! విచారింపకుము. నీయభిమత మీడేర్చుటకు శక్తివంచన లేక ప్రయత్నించెదను. ఇందు మరియొక రహస్యమున్న దాలింపుము. ఆమెకును నీయందు మక్కువగల్గి యున్నట్లే తోచుచున్నది. ఏల నందువా? ఆమె నీచేష్టలన్నిటిని గాకున్న కొన్నిటినైన యెఱింగి యుండును. అట్లయ్యును యామె యావృత్తాంత మితరుల కెవరికిని యెఱింగించియుండలేదు. కావుననే నేను నీపై యామెకు మక్కువ యున్నట్లు తలంచితిని. ఇందలి నిక్కమెఱింగిన పిమ్మట నీకార్యమును

సాధించుటకు యత్నించెదను. అంతవఱకు నీవు త్వరపడవలదు. మరి యును నాచేతులనిడిన యిక్కార్యము ఫలించినదనియే తలంపుము'' అని పల్కి యాతని బంపివైచెను.

మరికొన్ని దినములు గడచిన యనంతరము శమంత బలభద్రుడు నొక విజనస్థలమున గలసికొని యాతని కిట్లనియెను. ''ఓయీ! నేను దలంచిన ట్లామె నీయందు బద్ధానురాగయై యుండెను. అందు కేమి యును సందేహము లేదు. కాని యామెతో నీకు సాంగత్య మొన గూర్చుటకు దగిన యుపాయమేమియును స్ఫురింపదయ్యెను. ఎన్ని విధముల నాలోచించినను కార్యసాధనమునకు వీలైన యవకాశమే లభింపకుండెను. అయిన నొక్కటి జెప్పెద నాలింపుము. ఇపుడు నిన్ను నేను వారినగరమునకు గొనిపోయెదను. కాని నీవు స్త్రీవేషమును ధరించుకొనిన గాని యందున్న మోసము గలుగగలదు. అందుల కంగీకరించితివా? నిన్ను నేడె యాపురంబునకు గొనిపోయి విడచి వచ్చెదను. ఆపై నీవు నీసామర్థ్యమంతయును వినియోగించి యామె యంతఃపురమును జేరుటకు యత్నింపుము'' అని బల్కెను. బలభద్రుడును అంతకంటె వేరుపాయము లేదనుటచే యందుల కంగీకరించెను.

శమంత యాతనికి స్త్రీవేషమును వేసి సొమ్ములుకైసేసి యాతని వెంటబెట్టుకొని రూపావతియున్న పట్టణమునకుబోయి యందున్న పంక జాక్షియను తన సోదరియింటికేగెను. ఆమెయు చిరకాలమునకు దన యింటికివచ్చిన శమంత నెక్కుడుగా నాదరించి సమస్తోపచారములు గావించి వారి నింటనిల్చి ''చెల్లెలా! నేనిప్పుడు రూపావతి సముఖము నకు బోవలసియున్నదిపోయివచ్చెద. ఇంటసమస్తపదార్థంబులునుగలవు వంటగావించి మీరిరువురును భోజనముగావింపుడు మిగిలిన యన్న మును కూరలను మూతబెట్టియుండుడు. నేను వచ్చినతరువాత వంట చేయుట కాలస్యమగునేమో!'' అని పల్కి రూపావతికొలువునకరిగెను.

శమంతయు వంటగావించి బలప్రదునకు భోజనమిడి తానునూడ భుజించి మిగిలిన పదార్థములను తన సోదరినిమిత్తమై మూతబెట్టి జాగ్రత్త పరచెను.

పంకజాక్షియు రూపావతి కొలువునుండి యరుదెంచునప్పటికి ప్రొద్దుపోయెను. అప్పు డామె స్నానముగావించి భోజనముచేసి యొకించుక నిద్రించి లేచి సోదరిని పిలిచి చెల్లెలా! మీపురంబునగలుగు వింతలేమి? ఇల్లేల వచ్చితివి? ఈచిన్నది యెవ్వరు? ఈమె నెచ్చటనుండి తీసికొని వచ్చితివి? తెల్పుమన నామె తనసోదరి కిట్లనియెను. అక్కా! ఈమె నాస్నేహితురాలు. నిన్నుజూడవలయునని బయలుదేరి వచ్చుచు మార్గమున తోడుగా నుండునని వెంటబెట్టుకొని వచ్చితిని. ఇక్కడ వింతలేమి? రూపావతి నీయాడిగములకు మెచ్చుకొనుచుండునా? ఆమెయొద్ద నేనెఱిగిన పరిచారిక లెవ్వరున్నారు. ఆమె కుశలినియై యున్నదా? రాజగృహమున వింతలేమియును లేవుగదా? తెలుపుమనిన పంకజాక్షి యామె కిట్లనియెను. ఈమె మీపట్టణమునుండి వచ్చినప్పటినుండియు నొక మోస్తరుగా నున్నది. ఎవ్వరితోడను మనసిచ్చి మాటలాడదు మనచెంత నెవ్వరైన నిలిచియున్నయెడల విసిగికొనుచు వారి నావలకు బంపివేయుచుండును. తరచుగా నామె యేకాంతవిహారములు సలుపుచుండునేగాని యుద్యానవనమునకైనను చెలికత్తెలతో నరుగదు. కారణ మెవ్వరును యూహింపజాలకుండిరి. అని యామె చరిత్రమంతయును సవిస్తరముగా వినిపించెను. అపల్కులవలన నామె విరహానలసంతప్తహృదయై పరితపించుచున్నట్లు నిశ్చయించి యేకాంతమున బలప్రదున కాసంగతి నెఱింగించి యాతని సంతోష మినుమడింపజేసెను.

శమంత స్త్రీ వేషముననున్న బలభద్రుదున కంతఃపురచిత్రములు
జూపుమని పంకజాక్షిని వేడుకొనుట

శమంతపంకజాక్షి కిట్లనియెను. అక్కా! ఈమె యంతఃపుర
ములు చూడ నభిలషించుచున్నది. ఆమె యభిలాష దీర్పవలసినదని
యామెకు మారుగా నేను ప్రార్థించుచుంటిని మరియు నీమెకు పుష్ప
ముల దండలుగా గూర్చుటయందు మిక్కిలి నేర్పుగలదు. కావున
వీలైన యెడల నీమెకు రాకుమార్తెయొద్ద నేమైన నుద్యోగము
లభియించు నేమో యత్నింపుము. అట్టి దేమైన లభించిన నీమె
యిచ్చటనే యుండును. లేనియెడల మరల నాతో వెంటగొనిపోవు
దను. ఈమెకు పుష్పమాలల గట్టుటయందేగాక చిత్రలేఖనమునను
ప్రవేశముకలదు. అని చెప్పిన విని పంకజాక్షి యామె కిట్లనియె:
చెల్లెలా! ప్రస్తుత మెట్టి యుద్యోగమును దొరకుననుట సందియముగా
నున్నది. కొన్నిదినము లిట కనిపెట్టుకొని యున్నయెడల నేమైన
లాభమున్న నుండవచ్చును గాని యింతలో దగిన యుద్యోగము
లభింపదు. అంతఃపురమున కీమెను గొనిపోవుటకు గూడ నేనిప్పుడు
భయపడు చున్నాను. ఏలనన రాకుమారి యెవ్వరిని దరిజేరనిచ్చుట
లేదు. అట్టియెడ దూతలగు వారిని గొనివచ్చిన యామె కోపగించు
నేమో! ఇంకను కొన్నిదినము లిచ్చట నీవుకూడ నుందువుగదా. ఈ
లోపున కార్యానుకూలమునకై ప్రయత్నించెదను. అని పల్కెను.
వారామె పలుకులకు సంతోషితాంతరంగులైరి.

కొన్నిదినములైన పిమ్మట నొక్కనాడు బలభద్రుడు కొన్ని
పుష్పమాలలను గట్టి పంకజాక్షిచే రూపావతి కిమ్మని పంపెను ఆ
రూపావతి పంకజాక్షి యొసంగిన పుష్పమాలికల యెడల ననాదరణము
జూపినయెడల నామె వేరొకవిధముగా తలంచునేమో యను భయ

మున వానిని స్వీకరించి బల్లపై నుంచెను. తాని యామె కేమితోచెనోగాని యామాలికలలో నొకదానిని గైకొని తన చేత నుంచుకొని రచనానిర్మాణమున కెంతయో సంతసించుచు నటునిటు ద్రిప్పిచూచుచుండగా నతినైపుణ్యమున నాప్రసూనములమధ్య నిరికింపబడి యున్న మొగలిరేకుపై లిఖింపబడియున్న యక్షరముల గాంచి యవేమైయుండునాయని పరికింపనెంచి యక్షరములు చెదరకుండు నట్లుగా నద్దానిని వెలికిదీసెను అందు "వియోగములు దుస్సహాములైనను ప్రణయసామ్రాజ్య సింహాసన సోపానములుగా నెన్నబడు చుండునుగదా ?" అని యుండెను. ఆమె యీపలుకులనే గణించుచు అందిమిడియున్న భావమేమాయని యాలోచించుచు కొంతవడి వేగించి యందలి యర్థము స్ఫురింపనందున యాలేఖను గుప్తము గావించి పంకజాక్షిని పిలువనంపి యామె కిట్లనియెను. పంకజాక్షీ! నే డీ పూలమాలికలను నీవే కూర్చితివా ? లేక మరియెవ్వరైన గట్టియుండిరా! చాల సుందరముగా నున్నవి. రేపటిదినమున కూడ నట్టివానినే తీసికొనిరమ్ము. ఈమధ్యను పూలమాలికలన్న నేవగింపు జనించినది గాని ఈపూలమాలికను చూచినతోడనే వాని సౌందర్యము నన్ను సులభముగా నాకర్షించినది నిక్క మెరిగింపుము. ఈ పూలమాలికగట్టినవారు మరియొకరైనపక్షమున వారిని నాచెంతకు గొనిరమ్ము. బహూకరించెదను. అని పల్కిన పంకజాక్షి యామె కిట్లనియెను. "అమ్మా! మా ఇంటికి నాసోదరియు ఆమెతో నొక జవ్వనియు చనుదెంచియుండిరి. ఆమెయే యాప్రసూనమాలికలను గట్టినది వలయునెడల యామెను గొనివచ్చెదనని సవినయముగ పల్కెను.

ఆ మరునాడు పంకజాక్షి తనతో నామెను వెంటబెట్టుకొని రూపావతిచెంత కరిగెను. రూపావతియు యామె సౌందర్యమును

గాంచి సంతసించి "జవ్వనీ! నీవెవ్వరు ఎచ్చటనుండి యిచ్చటికరుదెంచితివి? నీవృత్తాంతమంతయు సత్యముగా నెఱింగింపుమన ఆమె రూపావతి కిట్లనియెను. నిక్కమెవచింపువారిని లోకులెన్నడును విశ్వసింపరుగదా! ఒక ప్రారబ్ధవశమున నిక్కావ నెవ్వరికి ఎఱింగింపకూడదని నిశ్చయించుకొంటిని. ఎచ్చటనైనను తలదాచుకొని యీజీవితమును గడుపవలెనని అనుకొనుచున్నాను. కావున అనుగ్రహించి ఆశ్రయమొసంగిన కలకాలము మీకు విధేయురాలనై యుండెదను అని పల్కెను.

రూపావతి కాంతను చూచినంతనే యపారమగు దయకల్గెను. తాపవహ్ని యొకించుక శాంతించినట్లు దోచెను. ఆమె దన చెంత నిలుపుకొననెంచెను. కాని నూతనులను కొలువులోచేర్చినయెడల తల్లిదండ్రులు కోపింతురేమో యను భయమున ఆమె కిట్లనియెను. నీవీ యంతఃపురమునకు వచ్చుచుండుము. అవకాశమున్నపుడు నాజననికెఱింగించి నీకు దగిన కొలువొసంగెదను. అని పల్కి యామె వలన యామొగలియాకుపై వ్రాసినవ్రాత కర్థమెఱుంగగోరెను. పంకజాక్షి చెంతనుండుటచే సందేహించి యామె నావలకు బొమ్మని స్పష్టముగా జెప్పుటకు సాహసము లేక యామెను చూచి పంకజాక్షీ! నాకిపుడు స్నానము చేయవలయునని యున్నది. నీవేగి సర్వమును సిద్ధముగా నున్న వేమో కనుగొనిరమ్మని పల్కెను. పంకజాక్షి లోనికరిగెను. రూపావతి యాజవ్వనిని పిలచి మంతనంబున కామె నామొగలిరేకును జూపి జవ్వనీ! ఈమొగలిరే కెవ్వరు లిఖించిరి. ఇద్దానిని పూలమాలికలో నుంచి నాకెందులకు బంపితివి. సందేహింపక దెలుపుమని యడిగెను. అంత నామెయు, అమ్మా! ఏమియును దోపక నాచరిత్రమును దలంచుకొనుచు నేనేమో వ్రాసితిని. కాని యాపత్రములు పూలమాలికలలో ప్రమాదవశమున బడినవి. మాలిక తయారైన పిమ్మట నద్దానిని గమనింపనేరనైతిని మన్నింపవలయును. అనిపల్కెను. ఇంతలో పంకజాక్షి మరలివచ్చుచుండుట చూచి రూపావతి యాప్రసం

గమును మార్చి స్నానముచేసి యిప్పుడే వచ్చెదను. అని పల్కి పంకజాక్షిని వెంటబెట్టుకొని లోపలికేగెను.

నాడు రూపావతి కామెను తిరిగి కలసికొని మాటలాడుటకు దగిన యవకాశము గల్గినదికాదు. అట్లగుటచే నామెను మరునాడుం గాలమునకు రావలసినదిగా ప్రార్థించి బహుమాన మొసంగి పంపివైచెను. అట్లామెను పంపివైచి రూపావతి తన శయనగృహమున కరిగి యేకతంబుననుండగోరి చెలులను బిలచి నాకునిద్దురవచ్చుచున్నది. ఇచ్చట నిలచి సద్దుచేయకుండుడు. నాకు నిద్రాభంగము గల్గింపకుండు డని యాజ్ఞాపించి శయనతలమున బరుండి యిట్లు చింతింపసాగెను. అక్కటా! నామనోవల్లభుడైన యాతడే యాకమ్మలిఖించి యామెచే పంపియుండునని తలంచితిని. కాని యామె పల్కులతీరుజూడ వేరుగా నున్నది. ఒకనాటికైన నామనోరథము దీరునట్లుగా గాన్పింపదు. ఏమి చేయుదును. ఇచ్చటికెట్లైన నాతడరుదెంచెనా? నా మందిరముననే యాతని నిల్పికొని నామనోరథమును దీర్చుకొందును. కాని యాత డిచ్చటికెట్లువచ్చును. వచ్చినను యాతని జాడ నాకెఱిగించువారెవ్వ రున్నారు. పాప మాతడుకూడ నాకై యెంతపరితపించుచుండెనోకదా? ఆహా! ఆతని చేతలు తలంచుకొనిన యొడలు పులకరించుచున్నది. ఆలోచించిచూడగా పరస్పర ప్రేమబద్ధులమగు మేము యేనాటికైన సుఖింపగలమని తోచుచున్నది. అట్టిదే సంభవించిననాడు—నేనాతని ప్రేమింపకుండుటయో లేక యాతఁడు నాయెడల విరక్తుడై యుండుటయో సంభవించియుండును. కాని మాయుభయులకును సాంగత్యము గల్గుకాల మిప్పటికిని నిర్ణయించుటకుసూత్ర మెంతమాత్రమును యవకాశము కలుగుటలేదు. ఎన్నటో యాతనిగూడి సుఖింప గలుగుదు నను నాశచే యింతవరకును నా మేనప్రాణములు నిలిచినవి కాని

యది ఘరాశమేమైన చెప్పవలసిన దేమున్నది. అని పెద్దయుంబ్రొద్దు చింతించి నిద్రించెను.

## బలప్రదుని అంతఃపుర ప్రవేశము.

నాటిసాయంకాలము పంకజాక్షి తనతో నామెను రూపావతి కడకు గొనివచ్చెను. రూపావతి యామెను జూచి బలప్రదుని జూచి నట్లుగనే సంతసించి త్వరితముగా వలయునలంకారము ధరించి చెలి కత్తెలతో నుపవనంబు ప్రవేశించెను. అట నాపల్లవాధరి యనుజ్ఞగొని చెలుతెల్లరను ప్రసూనసంగ్రహణమునకై యరిగిరి. ఆమెకు పంకజాక్షితో జనుదెంచిన సుందరితో మాటలాడుటకొకించుక సమయము లభించెను. అట్లులభించిన యాస్వల్పావకాశమును వృథపుచ్చక యామెతో నించుకదూరమున నున్న లతానికుంజమున కరిగి యామెతో నిట్లు సంభాషించెను. లతాంగీ! నీవే యావాక్యమును లిఖించితినను చుంటివే! అట్లేందులకు వ్రాసితివి? నీ కెట్టివియోగము గల్గెను? అయ్యది ప్రణయసామ్రాజ్య సింహాసనమున సోపాన మెట్టులయ్యెను వివరముగా నెఱింగింపుము అని పల్కిన యామె మృదుమధుర వచనముల నిట్లనియెను. రూపావతీ! ఇట్లేల ప్రశ్నించెదవు? నీ విట్లు ప్రశ్నించుట దిలకింపగా నీవును వియోగసంతప్తవైనట్లు గాన్పించు చున్నావు. నీ వెవ్వరిని వరించితివి? వాడు నీచేతికందనివాడా? నిక్కము వక్కాణింపుము. నే నెట్టులైనను ప్రయత్నించి నీకు సౌఖ్యమొనగూర్చుటకై యత్నింతును. అంతియెగాక డొంకతిరుగుడులాడినట్లు నన్నేమేమో ప్రశ్నలవైచి యేల బాధించెదవు. నాచరిత్ర మెవ్వరికిని జెప్పకుందునని శపథము దాల్చియుంటినని చెప్పియుండలేదా యని పల్కెను.

అప్పల్కులాలించి రూపావతి యామె కిట్లనియెను. ఇచ్చట నున్న వా రందఱును భూతసంతతిలోనివారు. అట్టివారు నేనొక మానవుని వలచుట విని పరిహసింతురే గాని సహాయమొనర్చుట కెన్నడును యంగీకరింపరని భావించి వారికి నా మనోగతము నీవఱకు చెప్పియుండలేదు. మనసిచ్చి మాటలాడుచుంటివి. కావున నీతో వచించుచుంటిని వినుము. బలప్రదుఁడను మంత్రికుమారునియందు నామనంబు లగ్నమైనది. ఆత డన్నిటను పరాక్రమకేతుని బోలియుండును. బలప్రదుడు పరాక్రమకేతుని కుడిభుజమువంటివాఁడు. ఆతడును నాపై మక్కువగొనియున్నవాడు. ఆతని నెట్లైన నీ యుపవనంబునకు దెచ్చితివా నీమేలెన్నటికిని మరువను. నీకు విశేషముగా బహుమాన మొసంగెదను. రెండవకంటివా డెఱుంగకుండ నీకార్యమును సాధింపవలయును అని చెప్పెను. ఆపల్కు లాలించి మంచిదని యామె యంగీకరించెను. ఇంతలో మరల చెలు లరుదెంచుటచే వారు ప్రసంగాంతరము లోనికి దిగిరి.

బలప్రదుఁడు జరిగిన సంగతులెల్ల నాటిరాత్రి రహస్యముగ శమంత కెఱింగించెను. ఆమెయు నందులకు దగిన యుపాయ మాలోచింతము. రేపటిదిన ముదయమున నీ వంతఃపురమునకు బోకుము. ఏదో యొక వంకబెట్టి తప్పించుకొనుము. అని యామె యాతనికి బోధించెను. తెల్లవారినతోడనే పంకజాక్షి రూపావతి కొలువుకూటమున కరుగుచు యా సుందరినిగూడ తనతో రావలసినదని కోరెను. కాని యామె నాడు తనకు కడుపు నొప్పిగానున్నదనియు, నాడు రాజాలననియును, అవ్యాధి శాంతించిన సాయంకాలము తప్పక వత్తుననియు జెప్పి తప్పించుకొనియెను. పంకజాక్షియు నామెను నిర్బంధింపక తనకు ప్రొద్దెక్కుచున్నదని త్వరితగమనమున రూపావతి చెంతకరిగెను.

బలభద్రుడును శమంతయు నాలోచించిరి. కడకు వారిట్లు తీర్మానించుకొనిరి. బలభద్రుడు స్త్రీవేషమున రూపావతి చెంతకుబోయి బలభద్రుడు నీపై విరహముచే యిచ్చటి కరుదెంచియున్నాడు. అతని నీ యుపవనములోనికి పంపుటకు తలుపుల దెరచియుంచి యెవ్వరును వచ్చుటనుండకుండ జేయుమనిజెప్పి వెలికరుదెంచి, నిజరూపమున యుద్యానవనము ప్రవేశించుట. ఇట్లు నర్చిన మేలగును. ఆవిధమును రూపావతి కెఱింగించుటకు బలభద్రుడు స్త్రీవేషముననే బయలు దేరెను. ఆమె యేకాంతమందిరములో గూరుచుండి తనదూతిక కార్యము నెట్లు సానుకూలపరచునో యని విచారించుచుండెను. ఆ సమయమున బలభద్రుం డామెను సమీపించి రహస్యమున నామెకు దమ పన్నాగమంతయును దెలిపెను. అందులకు రూపావతి నవ్వి ఓసీ! అంతగా భయపడనేల. ఇదే యీ తాయెతుగొనిపోయి యాతని మెడ గట్టుము. తోడనే యాతడు చిలుకరూపమును పొందగలడు. అప్పు డాతడు బహిరంగముగా నాయంతఃపురమునకే రావచ్చును. అని యామెకు తాయెత్తునొసంగి పంపెను. ఆమెయు నధికసంతోషమున నీవృత్తాంత మంతయును యామెకుదెల్పి కార్యమును సానుకూల పరచితినని యామెను విశేషముగా పొగడి సాయంకాల మైనతోడనే శమంతచే తాయెతు కట్టించుకొని చిలుకరూపమును పొందెను.

## శమంత పరాక్రమకేతుని పట్టణమునకు మరలివచ్చుట

శమంత బలభద్రుని చిలుకగాజేసి రూపావతి యంతఃపురము నకు బంపిన పిమ్మట పంకజాక్షిని కలసికొనియెను. ఇరువురును యిట్లు సంభాషించుకొనిరి.

పంక—నీతో నరుదెంచిన యామె పుష్పమాలికలు గట్టుట

యందు నేర్పరియగుటను కావుననే యామెను రూపావతి యెక్కువగా ప్రేమించి యుండెను. ఇంకను యామె యిక్కడనే యున్నచో నామెకు రూపావతిపంచిజీత మేర్పాటుజేసి యుండును సుమా!

శకుంత—దాని కట్టి ప్రాప్తిలేదు. కావుననే యింతలో బుద్ధి మారిపోయినది. ఇంత పిన్నతనమున తీర్థయాత్రలకు బోకున్న నేమి మునిగినది?

పంక—అట్లనకుము. ఆమెకు తోడుగా నరుదెంచుటకు దగిన వారు దొరికిరి గాబోలును. ఏకముం దట్టితోడ్పాటు కలుగదని యామె దలంచియుండును.

శకుంత—ఎంతయో ప్రాధేయపడినది గదా యని తోడితెచ్చి ఉద్యోగము సంపాదించుటకు విశ్వప్రయత్నము లాచరించుచుంటిమి. మన యత్నములన్నియు ఫలోన్ముఖమునకు వచ్చినవి. నేడో రేపో యుద్యోగము దొరకుననుకొనుచుండగా మనమాట సుంతైనను విని పించుకొనకుండ వెడలిపోయినది గదా యని కించపడుచున్నాను.

పంక—ఇంక నావిషయమును గూర్చి యెక్కుడుగా నాలోచింపకుము.

శకుంత—అట్లే చేయవచ్చును. కాని రేపటి దినమున రూపావతి యాకాంతను గొనిరమ్మనిన నీ వేమందువు. లేదనినచో నామె చిన్నబుచ్చుకొనదా?

పంక—సరే నాకు ప్రొద్దుబోవుచున్నది. నేను కొలువునకు పోయి వచ్చెదను.

శమం—అక్కా! ఏదినమున కాదినమున నీతో జెప్పవలయు ననుకొని మఱచుచున్నాను. నేనును త్వరలో మాపట్టణమున కరుగ వలసి యున్నది. ఇంక నాలుగైదు దినముల కంటె వ్యవధిలేదు.

పంక—పోవచ్చును లెమ్ము నీదో పెద్దదాని నైతిని. నీవు నండి పెట్టుచుండగా హాయిగా దినుచుంటిని. ఇంకొక నెలదినములుండుము. అప్పటికి మాకోటలోని తొందరలుగూడ తగ్గును. మాకించుక తీరిక గూడ కలుగును.

శమంత—నెలదినములే! ఒక్కదినము సెలవులేకుండ మాని తిని, బకావలి మిఠాయములును కారములును మారును. వలయునెడ మరల వచ్చెదను. ఇంత యెందులకు? నీవుగూడ సెలవుగైకొని మా పట్టణమునకు రమ్ము. కొన్నిదినము లచ్చటనుండి వత్తువుగాని.

పంక—ఇప్పుడు సెలవు దొరకునట్లు లేదు. నీకాగుటకు వీలున్న యెడల నొకమాస ముండుము. లేదా! మాటవచ్చునను భయమున్న నీయిష్టము.

శమంత—ఆగుటకు వీలులేదు. నేడుగాకున్న మానె రేపై నను బయలుదేరవలయును.

పంక—అయిన యెడల రేపు బయలుదేర వచ్చును. లెమ్ము. అని పల్కి యామె కొలువున కేగెను.

శమంతయు పంకజాక్షి యొద్ద ననుజ్ఞగొని యామరునాడచటి నుండి బయలుదేరెను. ఆమెయు బలప్రదుడును రూపావతియు గలిసి కొనినందుల కెంతయు సంతసించుచుండెను. రూపావతి యాతనిని నిక్కముగా వరించియుండుటచేత తన వారలవలన నెట్టియలజడియు గలుగ కుండ నాతని రక్షించునని నమ్మి నిశ్చింతతో నిరంతర ప్రయాణములు సల్పి పరాక్రమకేతుని పట్టణమున కరుదెంచెను.

## బలప్రదుడు రూపావతిని కలిసికొనుట

అట రూపావతియు చిలుకరూపమున నానిభ మెప్పుడు వచ్చు డెంచును. ఎప్పుడు నాచేతిపై వ్రాలును అని తలపోయుచు నిరీక్షించు చుండెను. అంతట చిలుక చనుదెంచి యామె చేతిపై వ్రాలెను. ఆమెయు నధికసంతోషమున నాచిలుకను లాలించి మధురతరంబు లగు ఫలంబుల నాచిలుకకు మెసవనొసంగి లాలించెను. రాత్రి చెలు లందఱును వెడలిపోయినంతనే యామె యాచిలుకను మరలనెప్పటి వలె మనుజుని గావించుకొనెను. బలప్రదుఁ డామెను తనివితీర కౌగి లించుకొని ప్రియా! మన కిట్లనుసంధానపరచినయామెమనము సుఖిం చుట చూచుటకు నోచదయ్యెను. దానిబంధువు లెవ్వరో తీర్థయా త్రకు బోవుచు నామెను వెంటగొనిపోయిరి సుమా యని పల్కెను. రూపావతియు, ఆమె స్నేహ మింకను యుండకపోయెనేయని చింతించెను.

రూపావతి బలప్రదుని పగలు చిలుకగా జేయుచు రాత్రియందు పురుషునిగా జేసికొని యాతనితో కామోపభోగము లొందుచు కొంతకాలము గడపెను. చెలులందఱును యామె తొల్లిటివిచారము లేకుండ సంతోషమున నామె చరించుచుండుటచేతను, ముఖము నను, యధరంబుపైనను దంతక్షతంబులుండుటచేతను, రాత్రియందు నిదుర లేమిని దెలుపుడుచేయు కన్గవయరమోడ్పు గల్గియుండుటచేతను యామె రతిసుఖ మనుభవించుచుండెనని నిశ్చయించుకొనిరి. కాని యొక్కనికిని నిక్కవము తెలియక మనమందఱ మిట్లు నిరంతరము కావలియుండ నెవ్వఁ డామె యంతఃపురమున కేగియుండును. అట్టిది సంభవించుట సామాన్యము కాదే యని చింతించి యొకనాఁడొక కొందఱామె చిలుకను పురుషునిగా జేయుటచూచి యామె తల్లిచెంత

కరిగి అమ్మా! చెప్పిన నమ్మకమువా లేదో నీకుమార్తె యెవ్వరితోడ నో రతిసుఖంబుల దేలుచున్నది. ఆమె ప్రవర్తనము తొల్లిటివలె లేదు. సలయుసెడ నీవే పరీక్షించుకొని తగినట్లు మందలింపవలయును అని విన్నవించిరి.

రూపావతితల్లి యొక్కనాడు సూర్యోదయమునకు మున్నె చనుదెంచి కుమార్తెచెంత కేగెను. ఆమె యింకను నిదురించుచునే యుండెను. ఆమె లక్షణముల పరికించి రాత్రియందు పురుషునితో రతులదేలి యామె పారవశ్యము జెంది మైమరచి నిద్రించినట్లు గాన్పించెను. తోడనే యామె కుమార్తెను తట్టి లేపి యేమే దుర్మార్గురాలా! ఇట్లుంటివేమి? యీగుర్తులేమి? మించుటద్దముల మించు చెక్కులిట్లు గంట్లుపడినవేమి? కురులివ్విధి చెదరియుండగతమేమి? ఈయధరంబున నిట్టి పల్గాటులుండనేల. ఇట్టిపాట్లు నీకు గల్గించిన యా నరాధము డెవ్వడు? నాకంటబడిన యాతుచ్ఛుని నల్లిని నలిపి వైచునట్లు నలిపివైచెదను. అను రూక్షవచనముల బలుకుచుండ రూపావతి యేమియును బలుకక కొంతవడి యట్టె నిలచి తన జనని కోప మిసుమంత శాంతించిన పిమ్మట మెల్లన తల్లి కిట్లనియెను. అమ్మా! ఊరక లేనిపోని యనుమానములు పెట్టుకొనకుము. నానానేకభూతరక్షితమైన యీ యంతఃపురము సామాన్యులకు చొరరానిదనుమాట మరచితివా! అయినను సామాన్యుని వరించి యాతనితో తుచ్ఛమగు నైహికసుఖ లనుభవించుటకే నంగీకరింతుననియే భావించితివా? అని ఆమె యిచ్ఛకములాడి కల్లయేడ్పుల నేడ్చి యామెను నమ్మించెను. ఆమెయు కుమార్తె పల్కులు నిక్కువములనియే భావించి తన సౌధమునకు కేగెను.

బలప్రదుని పోకడ దెలియక పరాక్రమ కేతుఁడు చింతించుట.

శమంతయు బలప్రదుడును పట్టణమును విడిచి పోయినపిమ్మట పరాక్రమ కేతుఁడొక్కనాఁడు పరిసరమున గల భూపాలునకు గప్పము కట్టవలసినదని వర్తమానమంపుటకై బలప్రదుని పిలువనంపెను. ఆభటుడు బలప్రదుఁ డూర లేడనియు నెచ్చటికేగెనో యింట నెవ్వరికిని దెలియదనియును. అతఁడు గ్రామాంతరమునకేగి యొక మాసమునకు పైగా నయ్యెననియును పరాక్రమ కేతునకు దెలియజేసెను. పరాక్రమ కేతు డాతఁడు తనతో నైన వచింపకుండ నెక్కడికేగియుండునా యని తలపోయుచు నంతఃపురమున కరిగెను.

అందొక పాన్పున బరుండి బలప్రదుడు సమయమునకు గ్రామమున లేకుండెనే యింక నెవ్వరినిబంపిన యీకార్యమును సాధించుకొని వత్తురని యాలోచించుచు పరధ్యానముగా నుండెను. ఆసమయమున గులోబకావళి యాతనిచెంత కరుదెంచి మేజాపై ఫలహారము నుంచి మంచితీర్థమును గొనివచ్చుటకు లోనికేగెను. ఆమె మరలి వచ్చెను. కాని పరాక్రమ కేతుఁ డింకను యాలోచనానిమగ్నుఁడై యుండుట దిలకించి యామె నాథా! ఏవిషయమునుగూర్చి తమరింతగా నాలోచించుచుంటిరి. నేను రెండుపర్యాయములు లోని కరుదెంచియుంటిని. అయినను మీరు గుర్తింపకైరి తెలుప వీలగునేని యను గ్రహింపుడని పల్కెను.

పరాక్రమ కేతుఁడు శయనతలమున గూర్చుండి బకావలినిగూడ దనచెంత గూర్చుండ నియోగించి యామె కిట్లనియెను. చెలీ! ఒక విషయమునుగూర్చి యాలోచించుచు పరధ్యానముగా నున్నమాట నిక్కము. కాని యదియొక రహస్యవిషయముగాదు. నేను బలప్రదుఁ డూర లేడని తెలియవచ్చినది. అతఁడు నాకు కుడిభుజమువంటివాఁడు,

మంత్రితోఁగ విషయమున నాతని యాలోచన నాటిలేనిది ఆతఁడు నాతో జెప్పకుండ గ్రామాంతర మేగియుండెను. ఆతఁ డెచ్చటికేగి యుండునాయని యాలోచించుచుంటిని. అంత బకావలి చిఱునవ్వున యాతని కేమైన స్త్రీగాలి సోకినదిగాబోలును అని పల్కెను. పరాక్రమకేతుఁడు చిఱునవ్వున ఏమేమీ! ఆతఁ డెవ్వరినైన వరించెనా? యేమి ఎవ్వరిని? నీకీ వృత్తాంత మెట్లు దెలియవచ్చినదని ప్రశ్నించెను.

బకావలి యాతని కిట్లనియెను. నాథా! ఆతఁడు రూపావతి యందు భ్రమగొని యుండెనేమోయని నే ననుమానించుచుంటిని. నే ననుమానించుటకు గొన్ని కారణములు గలవు. ఆతఁడు రూపావతిని యామె తల్లిదండ్రులను ఎటునాటకుబోయి వచ్చిననాటినుండియు యాతని ప్రవర్తన మారినట్లు దోచుచున్నది. ఆతఁడు రూపావతి యీ గ్రామమున నున్నన్నిదినములును ప్రతిదినమునను యుద్యానవనమునకు బోవుమార్గమున మాకు సాక్షాత్కరించువాఁడు ఆమె వెడలిపోయిననాటినుండియు ఆతనిజాడయే గాన్పింపదు. ఆమెను వారి గ్రామమున దిగవిడచి రావలసినదని తమరు దన్ను బంపుదురేమో యని దలంచి యానాఁడెల్ల మీతోనుండెను. ఆవిషయమును మీరు మఱచియుండిరి గావలయును. ఈకారణమువలన నాతఁడు రూపావతిని ప్రేమించి యుండెనని దలంచుచుంటిని. రూపావతియు నాతనియందు మక్కువగొని యున్నట్లు దోచుచున్నది ఆమె వెడలిపోవుటకు మున్నాడిన మాటలవలన నామె మనోగతమించుక వెల్లడియైనది.

పరాక్రమకేతుఁడు చిఱునవ్వున ఈవఱకు నాకీసంగతి నేల దెలుపవైతివి. పాపమాతఁ డామెకొఱకై యెట్టిపాట్లు పడుచున్నాఁడో గదా! యని పల్కి మిన్నకుండెను. ఇంతలో నొక పరిచారిక యరుదెంచి అమ్మా! శమంత వచ్చియున్నది. దర్శనమపేక్షించుచున్న దని నుడివెను. ఆమెను లోనికి రానిమ్మనియెను ఆమె వచ్చులోపల గులో

బకావలి శమంతయు బలప్రదుఁడును నొక్క దినమునందే గ్రామమును విడచి యుండిరనియు నాతఁడు శమంతసహాయము నపేక్షించి యుండునని యనుమానించుచున్నారనియు జెప్పెను.

శమంత లోనికరుదెంచెను. తోడనే పరాక్రమకేతుఁడు శమంతా! ఇన్నిదినములు జాగొనర్చితివేమి? బలప్రదుని రూపావతితోఁగలపుట కిన్నిదినములు పట్టినదా యని ప్రశ్నించెను. ఆమెయు నిదేమి యాతఁ డిట్లడుగుచున్నాఁడని మనంబున ననుకొని అయ్యా! ఆతఁ డెచ్చటి కేగియుండెనో నాకు తెలియదు. నేను నాపినతల్లి కుమార్తెను సందర్శింపవలయునని పోయియుంటిని అని ప్రత్యుత్తరమిచ్చెను గులోబకావలి యూరకొనక నీసంగతి యంతయు దెలియవచ్చినది. నిక్క మెఱింగించిన నిన్ను దండింపము. నీవెఱిగిన దంతయు దెలుపుము లేనియెడల నిష్కారణముగా దండింపబడుదువని పల్కెను.

శమంత యాపలుకు లాలించి యిక నెట్లును తప్పదని నిశ్చయించుకొని నిక్కమంతయు నెఱింగించెను. పరాక్రమకేతుఁ డా వృత్తాంత మంతయును విని శమంత నావలి కేగుమని ప్రియురాలి నిట్లనియెను. ప్రేయసీ! ఆతని కక్కడ నిక్కట్లు గలుగుట నిక్కము. వారి కూటమి నేనుగాకున్న రేపైనను దెలియకపోదు. కావున మన మిపుడు పురమును పోయి యాతని సంరక్షింపవలయును. తొల్లి యీ రూపావతి నిన్ను నాకు గూర్చుటలో బడినశ్రమ యింతంతనరాదు. ఈతఁడును మన కాప్తకోటిలోనివాఁడు కావున మన మవశ్యము పోవలసియున్నది నేనరిగి యందులకు దగిన యేర్పాట్లు గావించి మరల నొకక్షణములో నరుదెంచెదను. నీవును సిద్ధముగుము అని జెప్పి యాతఁడు వెలికరిగి దర్బారునకేగి మంత్రిని రావించి తానొక కార్యార్థమై గ్రామాంతర మేగుచుంటిననియు, యవశ్యముగా బరికింపవలసిన విషయములను జాగరూకతతో బరికింపవలసినదనియు నుత్తరు

నొసంగెను. ఇంతలో గుఱ్ఱములు సిద్ధము చేయబడినవని తెలియుట తోడనే యూతడు బకావలీ ద్వితీయుఁడై గుఱ్ఱములపై నెక్కి పయనము సాగించెను.

## బలభద్రుడు పట్టుబడుట

నాటినుండియు రూపావతి తనరహస్య మతిగోప్యముగా కాపాడుకొనుచు నౌకరుల కెవ్వరికిని దనపై ననుమానము కలుగకుండునట్లు నటించుచు బలభద్రునితో నిరంతర సౌఖ్యముల దేలుచు కాలమును నిమిషములవలె గడపుచుండెను. ఇట్లు మరికొన్ని దినములు గడచెను. రూపావతి గర్భవతియయ్యెను. చెలికత్తె లీసమాచారమును యీయామె తల్లికెఱింగించి, ఆమెను మండిపడి యీవృత్తాంతమును తనవిభునకు దెలియపరచెను. ఆమె భటులను బంపి యీయామె శయనాగార మంతయును శోధించి యీయామెకు ప్రియతరమైన వస్తువులేమి గాన్పించినను విడువక దీసికొని రావలయునని యాజ్ఞాపించెను.

వారామె శయనాగారము నంతయును శోధించి అందేమియు విచిత్రవస్తువులు గాన్పింపమికి చింతించి కడకామె శయనాగారము చెంత పంజరముననున్న చిలుకను తమతోగొనిపోయి తమ యేలిక కర్పించిరి. ఆతడాచిలుకను తనచేతిపై నుంచుకొని దువ్వుచుండగా నా చిలుకమెడలో కట్టబడియున్న తాయెతువిడి క్రిందపడియెను. తోడనే చిలుకరూపము మారి బలభద్రుడయ్యెను. బలభద్రునిగాంచి భూతరాజు మండిపడియెను. ఓరీ దుర్మార్గుడా! యీరూపమున నంతఃపురము ప్రవేశించి ద్రోహమొనరించెదవా? నీవెవ్వడవు నీవు మాయంతపురమెట్లుప్రవేశింపగలిగితివి? నీవృత్తాంతముదెలుపుమన నాతడయ్యా! దురాగ్రహమున చెడదిట్టుచుండ కులగోత్రములు దెల్పిన ప్రయోజన మేమియుండును. ప్రయోజన మిసుమంతైన నుండునందురా నావృ

త్తాంత మాద్యంత మెఱింగించెను. లేనివాడు నేఁడు దండింపబడుటయేఁ గాక నావంశమువానిగూడ నిఁకపైన్నెన్నఁడు సహింపజాలను అని పల్కి మిన్నకుండెను. ఇంతలో రూపావతి శౌఘమునుండి కుమారి మూర్ఛిల్లియున్నది. త్వరితముగా నావలసినదని భూతరాజును వర్త మానము వచ్చెను. తోడనే యాతడు తన భటులతో బంధితుని జాగరూకతతో బరికించుచు, పారిపోనీయకుండుడని సెలవిచ్చి కుమార్తెయున్న తావున కేగెను.

రూపావతి తనయొక్క రహస్యమంతయును తన జనకునకు గూడ తెలియవచ్చినదని తెలియుటతోడనే యామె తన వల్లభునకు కీడు సంభవింపక మానదని నిశ్చయించుకొని మూర్ఛిల్లెను. చెలికత్తె లెందఱెట్టి యుపచారము లొనర్చినను సేదదేరదయ్యెను. వారింక చేయునదిలేక భూతరాజునకు వర్తమాన మంపిరి. అతఁ డరుదెంచు నప్పటికి రూపావతి తల్లియు చెలులును పరిచర్య లెన్నియో చేసి యామె నించుక సేదదేర్చిరి. భూతరాజు కుమార్తెను సమీపించెను. రూపావతి తన్ను సమీపించిన జనకుని పాదములపై వ్రాలి తన తప్పిద మొప్పుకొని క్షమింపవలసినదని ప్రార్థించెను. తన కాతని తోడిదే ప్రాణమని యెఱింగించెను. ఆతని విడచి యొకక్షణమైనను నిలువజాలనని విలపించెను. ఆతఁడు క్షమింపబడకున్న యెడల తనకు చావు నిక్కమని స్పష్టపరచెను. తానే యాతని కొఱకై విలపించి విలపించి రప్పించుకొంటినని వాక్రుచ్చెను. భూతరాజు పల్కు లాలించి యేమిచేయుటకును మనస్కరింపక కుమార్తె కిట్లనియెను. రూపావతీ! యింకనైనను బుద్ధిగల్గి వాని సాంగత్యము మానెదనని నాకు బాసయిమ్ము అట్లైన వానిని క్షమించి వాని నగరమునకు వానిని బంపివేసెదను. లేదా! నీకండ్లయెదుటనే యాతని ముక్కముక్కలుగా ఖండించి యగ్నింబడవైచెదను. ఇంక నాట్లాన

రించుటకును వీలులేదని ఖండితముగా పల్కెను. రూపావతి మరల యూతని ప్రార్థించెను. గాని లాభకుసుమంతయును లేకపోయెను. ఎట్లు కేల కామె యూతని విడిచిపుచ్చవలసినదనియు తానింక నెన్నడును యూలని స్మరింపకుండ నుందుననియు జనకుని ప్రార్థించెను. అతఁ డందులకు సమ్మతించి యట్లే యొనర్తునని కుమార్తెతో చెప్పి యావల కేగెను. రూపావతి జనకుని పల్కులను విశ్వసించి యుండెను.

భూతరాజు కొందఱు సరదారులను పిలచి వారితో కొంత తడవు మంతనములాడి తదనంతరము బలప్రదుని వారివెంట బంపెను. బలప్రదునితో ఓయీ! నాకుమార్తె ప్రార్థనముచే నిన్నింతటితో వదలి వైచుచున్నాను. లేకున్నయెడల కఠినముగ శిక్షించియుండుమని పల్కి సన్మానముతో నాతనిని సాగనంపి కుమార్తె చెంతకేగి బల ప్రదుని సన్మానముతో బంపించుచున్నట్లు దెలిపి యామె కాతని జూపెను. రూపావతి కన్నుల నీరునింపి యట్లే మూర్ఛితురాలయ్యెను. భూతరాజు పంపిన సరదారు లాతని కొంతదూరము గొనిపోయి యొక మహారణ్య మధ్యమున నిలిపి ఓయీ! తనకుమార్తె సంతసింపవలయు ననియే నిన్ను క్షమించినట్లు నటించి యిచ్చట నిన్ను వధించి యగ్నిలో బడవేయ వలసినదని యాజ్ఞాపించి యున్నాడు. కావున అందులకు సిద్ధపడుమని చెప్పి యెండుకట్టెల ప్రోవుచేయించి యగ్ని దగిల్చిరి. వీతిహోత్రుడు తనకు చక్కనివాడాహారము కాబోవు చున్నాడను సంతసమున గాబోలును యాకాశ మంటునట్లుగా జ్వాల లను నాలుకల జాపుచుండెను.

బలప్రదుఁడు తనకు తటస్థించిన యాపద కెంతయు వగచుచు తనలో నిట్లు వితర్కించుకొనియెను. ఇన్నిదినములకు నా మనోరథము తీరినది. వలనుపడినంతవరకు ఆమెతో మహేంద్రభోగము లనుభ వించియుంటిని. చాలు నీజన్మమున కియ్యదిచాలును. ఇంతకెక్కుడుగ

వాంఛించుట దగదు. కావున మరణించుమంతటి నను విచార మావం తయును లేదు. కాని తన జనకుని పల్కులే నిక్కువములని భావించి యున్న నాప్రియురాలు నాయీ మరణవార్త యాలించిన నేమగునో యను విచారముమాత్రము నన్ననవరతము బాధించుచున్నది. పర మేశ్వరా! ఆమె నేను సంతసించుచున్నట్లు దలంచి సుఖించున ట్లను గ్రహింపుము. నామరణవార్త యామె కెప్పుడును తెలియనీయకుము' అని పెక్కువిధముల వితర్కించుకొనుచుండెను,

బలప్రదుఁడు రక్షింపబడుట

భటు లాతని సంహరించుటకు సంసిద్ధమగుచుండగా నిదువురు యోధులు గుఱ్ఱములపై చనుదెంచుచున్నటు లగపడిరెను. వారు భూతరాజుయొక్క తదనంతర యాజ్ఞలను దెల్పు నరుదెంచినవారై యుందురనియు, నొకానొక వేళ భూపాలుఁడు కుమార్తె ప్రాణాపాయ మున నున్నయెడల నీతని రప్పించి యామె సముఖమున నిలువబెట్టి యామెకు సంతసము గూర్పనెంచి వెనుకకు బిలువనంపి యుండు ననియు, భావించి వధింపక నిలచిరి. కాని యాగాతులు వారనుకొని నట్లు భూతరాజుచే పంపబడిన వారలుకారు. పరాక్రమకేతుడును బకావలియునై యుండిరి. వారు బలప్రదుని గాంచి విస్మితులైరి. పరాక్రమకేతుఁ డాతని కౌగిలించుకొని "ఓయీ! యెన్నిదినములకు నిన్ను గనుగొంటిని. ఇన్నిదినము లెక్కడనుంటివి. ఇదేమి! వీరు నిన్నిట్లు నిలిపిరెందుకు, నీవృత్తాంతమేమి? సవిస్తరముగా దెలుపు" మనిన యాతఁడు పరాక్రమకేతునకు ప్రణమిల్లి "దేవా! నాడు తమతో గ్రామాంతర మేగుచుంటినని వచించి సెలవుదీసికొంటిని,

నాటినుండియు భూతరాజుగారింటనే మెలంగుచుంటిని. రూపావతి యందనురాగము కలవాడనై యామెతో గొన్నిదినములు సౌఖ్య మనుభవించి కడకిట్టి సన్మానము నొందుచుంటి''నని తన వృత్తాంత మంతయును తెలిపెను. పరాక్రమకేతు డచ్చట నున్నవారిని జూచి ''ఓయీ యీతని వధింపరాదు. ఈతడు నా యాంతరంగిక మంత్రి. కావున యీ వృత్తాంతమును మీ రేగి భూతరాజుతో దెలుపుడు లేకున్న యెడల మిమ్ముల పారద్రోలిగాని జక్కాడిగాని యీతని నీయాపదనుండి రక్షించెదను.''అని గంభీరముగా పల్కెను. వారును యీతని చారిత్రమంతయును నిదివరకు విన్నవారగుటచే భీతిల్లి 'అయ్యా! తమ యాజ్ఞానుసారము మెలంగిన మాకు భూతరాజువలన నెగ్గుగల్గును. మాకెట్టిమాటయు రాకుండ మీరొసరించిన నైన నీతని నిప్పుడు వదలివైచి మీతో చనుదెంతు'మనిరి. పరాక్రమకేతుడు బలప్రదుని రక్షించి యుచితవేష మొసంగి భటుల కిట్లనియెను. ''మేముగూడ నిప్పుడు మీతో భూతరాజుచెంత కేతెంచుచుంటిమి రండు''అని పల్కి యటనుండి యందఱు కదలి చనిరి.

## రూపావతీ బలప్రదుల వివాహము

పరాక్రమకేతుడు బలప్రదుని వెంటబెట్టుకొని భూతరాజును సమీపించెను. అతని రాకగని భూతరా జాశ్చర్యమగ్నమానసుడై తగువిధంబున నాతని సన్మానించెను. అంత పరాక్రమకేతుడు, ''అయ్యా! నాదొక విన్నపమున్న దాలింపుడు. ఈబలప్రదుడు నా యమాత్యవర్గములోనివాడు. ఈతనిపై నాకెక్కు డభిమానము. అట్టి యీతని తమరు వధింపబంపిరి. ఈతడు తమకుమార్తెయందు బద్ధా

పరాగుడై యిచ్చటికరుదెంచి నెట్లో యంతఃపురమును ప్రవేశించి నాడు. అయ్యది యీతఁ డొనర్చినది తప్పేయగును. కాని యందు లకు మరణదండన విధించుట లస్సగాదు. మరియు నితఁడు మీకు మూర్తి మనసుకెక్కినవాఁడు. సుందరుఁడు, సర్వసద్గుణసంపన్నుఁడు. తమ కెల్ల విధంబుల నల్లుఁడగుటకు తగినవాఁడు. కావున యీతని మన్నించి తమ కుమార్తె నొసంగి పరిణయము గావింపుఁడు. తమ వలన నే నర్థించు యీమాత్ర మొనరించి నా కానంద మొనగూ ర్చుఁడు. తమకు పుత్రుని వంటివాఁడ నగుటచే నింతగా తమ్మర్థించు చుంటిని ఇంకొక్క విశేష మాలింపుఁడు. మీకుమార్తె రూపావతి యీతనికై యెంతగా పరితపించుచున్నదో గుర్తింపుఁడు. ఆమెను వేరొకనికిచ్చి వివాహము గావించుటకుగూడ వీలులేదు. ఇప్పు డామె గర్భవతియైయున్నది. అట్టి యీమె నన్యునకిచ్చుట నింద్యమగును. పోనీ యామెనుకూడ వధింప సంకల్పించి యుంటిరా? కట్టా! నిందు చూలాలును అట్లొనరింప భావ్యమా!'' అని పెక్కువిధముల నాత నికి బోధించి సమ్మతింపజేసెను. ఆసమయమునకే రూపావతి యస్వ స్థతజెందియున్నదని విని కాలఘుటితయు నామెభర్తయు జనుదెంచిరి. వారును రూపావతి తల్లిదండ్రులతో బలప్రదునకు రూపవతి నొసంగి పరిణయము గావించుటయే యవశ్యకర్తవ్యమని తెల్పిరి.

భూతరాజును చేయున దేమియునులేక వారందరి పల్కుల కదురాడనేరక యొక్క శుభముహూర్తమున రూపావతీ బలప్రదుల ఖండవైభవమున వివాహము గావించెను. వివాహానంతరము రూపావతికి పెక్కురు పరిచారికలను యరణముగా నొసంగి రథగజ తురగపదాతి సైన్యమును యంగరక్షగా వెలలేని కానుకలతో నామె అత్తవారింటికి పంపెను.

పరాక్రమకేతుడు బలప్రదునకు కొంతరాజ్యమిచ్చి పట్టాభిషిక్తుని గావించెను.

పరాక్రమకేతుడు తనభార్యలతో నెంతటి మహదానంద మనుభవించుచుండెనో యంతటి యానందమును రూపావతీ బలప్రదు లనుభవించుచుండిరి.

స మా ప్త ము.



శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము